# భారతి

ఫిబ్రవరి 1973



వ్యవస్థాపకులు :

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



ఫిబ్రవరి 1973

సంపుటము : 50 : సంచిక : 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1973



---

# వేల

శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి

నిలువు టద్దము ముందు లేచి
నిలబడి చూచుకొన్నాను
చిలువలు పలువలుగా వి
చిత్ర వర్ణాలకు మారి
కలలో వలె జనన కాల
ఘడియ నుండి బ్రతుకు తెరువు
వలయాలు వలయాలుగా వి
వర్తపు టలజడి గాగ.

అద్దము చిత్రమై నట్టి
దందులో నేను నాకేమొ
ఇద్దర మనిపించు నట్టు
లెంతయు కనుపించి నాను.
ఇద్ద రెట్లని విచారించి
ఎరుక తెచ్చుకొనిన మీద
అద్దములో ప్రతిబింబ
మంతే కదా అనిపించి—

అనుకొని హాయి మేయంగ
నందుకొంటిని స్వాదు ఫలము
ల ననుగ్రహించు పళ్లెరము
అను పాప మందించిన పవి
ఘన మధు రుచి మంతములను
కావలెనని ప్రేమ వలన
నను నేను మఱచిన వాడ
నా కద్ద మేమి జ్ఞాపకము?

నా అనుభవ మిట్లు సాగి
న కొలది నిష్క్రియు డట్లు
నా యత్ను డట్లుగా తోచి
నా దాత డంతంత కును వృ
ధా యాస మని నేను పిచ్చి
తరహా అనియు నేను వాని
పోయిన జాడ పట్టుకొని
పోలేదు. అద్ద మేమిటికి?

వరదలు వరదలు నదులు
వర్షము ముంచెత్తిన యది
కరదులు కరదులు నరులు
కలికానికి కరువైనారు
వరదులు వగదులు సురలు
వాకిళుల్ మూసికొన్నారు
గరదులు గరదులు పశులు
కాటు వేయంగ చూచెదరు.

ఈ మహా ప్రళయ జలనిధి
నీ గతి ఈదుకొనుచు మ
నోమయ సీమాంతముల క
నుంగొనుచును కరచరణ
సామగ్రి కదలాడ కుండ
సమ్మె చేసిన ఈ వెలుంగు
లేమి మ్రింగుదును మ్రింగకను
ఏమి చేయుదు నద్ద మెచట?

వెలుగులు వెలుగుల చిమ్మి
వేసిన నీడ లివేమి?
జలములు జలముల క్రిమ్మి
సాగిన జాడ లివేమి?
కలగా వైష్ణవ మాయ
గా కలగా పులగముగ—

## వేళ

జలి భూతి మొక్కడు మిగిలి
చాలదా ఇది తోడు నీడ !

గగన మండలము కన్పించి
కన్నులు చెదరగొట్టినది
విగళిత వాసనల్ చిమిడి
వినిపాతము లయిపోయినవి
నిగళ బంధనములు ప్రిదిలి
నిలువున నీరు చేసినవి
ఎగుడు దిగుడు లెడసినవి
ఎఱుక తామరస మేచినది.

జలి మెక్కడ వెలు గెక్కడ ది
శా వలయ విశాల శాల
పులితోలు వర్ణమయము ప
పుచ్ఛవి పొల్చిన లీల
ప్రళయం కరీ మహో౽భయ వి
రా డద్భుత రస విలోల
విలస దాకాశ తత్త్వ విని
విష్ణుపు టనుభూతి వేల.



# సరస్వతికి రెండు ముఖాలు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

'ద్విధా ప్రయుక్తేన చ వాఙ్మయేన'

ఓషధిప్రస్థ నగరంలో శివపార్వతుల కల్యాణం మహావైభవోపేతంగా జరిగింది. నూతన వధూవరులు గౌరీశంకరులు సభలోని వేదమూర్తి బ్రహ్మదేవునకు నమస్కరించారు. ఆయన గౌరీదేవిని ఆశీర్వదించాడు. అప్పుడు సరస్వతి ఆ దంపతులను ప్రస్తుతించింది.

ఇది కుమార సంభవంలోని కథ—

సరస్వతి చేసిన ఆ ప్రస్తుతి ఇది.

ద్విధా ప్రయుక్తేన చ వాఙ్మయేన
సరస్వతీ తన్మిథునం ను నావ
సంస్కార పూతేన వరం వరేణ్యం
వధూం సుఖగ్రాహ్య నిబంధనేన॥

కుమా. 7–90.

వాగ్దేవి ఆ దంపతులను నుతించుటకు రెండు విధములైన శబ్దజాలము నుపయోగించింది. 1. సంస్కారముచే పరిశుద్ధమైన సంస్కృతముతో పూజ్యుడైన శివుని. 2. సుఖంగా బోధపడే ప్రాకృత భాషతో పార్వతిని ప్రస్తుతించింది.

ఈ శ్లోకం భావం చూచినపుడు సాహిత్య పరులకు అనేక ఆలోచనలు ముసురుకుంటూ వస్తాయి. సంస్కృత ప్రాకృతాలు శివపార్వతులంత సనాతనమైనవా? అనే ప్రశ్నను అట్లా ఉంచి వాగ్దేవియైన సరస్వతికి సంస్కృత ప్రాకృత భాషలు రెండింటియందును సమానాదరం ఉన్నట్టు స్పష్టంగా తెలుస్తుంది. సరస్వతీ హృదయం ఎట్లా ఉన్నా సరస్వతీ పరంగా సంస్కృత ప్రాకృత భాషల యందు తనకున్న సమాన గౌరవభావాన్నీ తననాటి సాహితీపరుల దృష్టినీ కాళిదాస మహాకవి వెల్లడించాడని చెప్పవచ్చు.

ఆయన పేర్కొన్న సంస్కృత ప్రాకృతాలు అచ్చంగా మననాటి గ్రాంథిక వ్యావహారిక భాషల వంటివి. పై శ్లోకంలో 'సంస్కార పూతేన (వాఙ్మయేన)' అన్నమాటకు వ్యాఖ్యాత మల్లినాథు డిచ్చిన అర్థం ఇది. సంస్కారేణ = శాస్త్రవ్యుత్పత్త్యా, పూతేన=ప్రకృతి ప్రత్యయ విభాగ శుద్ధేన, సంస్కృతే నేత్యర్థః 'సుఖగ్రాహ్య నిబంధనేన' అన్నమాటను ఇట్లా వివరించాడు. సుఖేన గ్రాహ్యం=సుబోధం, నిబంధనం=రచనా యస్యతేన (వాఙ్మయేన) ప్రాకృత భాషయే త్యర్థః.

దీనినిబట్టి సంస్కృతానికి శాస్త్రీయమైన వ్యాకరణ సంస్కారం ఉండుటచేత అది పరిశుద్ధమైన భాష అనీ పరిశేష న్యాయంచేత ప్రాకృతానికి అంత సంస్కారం లేకపోయినా ప్రజాసామాన్యానికి సుఖంగా బోధపడే గుణం గలది అగుటచేత ఆదరింపదగినదనిన్నీ మనకు అవగతమవుతుంది.

మహాకవి సాహిత్య తత్త్వం ఎరిగిన ఉదార గుణుడు. కనుకనే పాత దనగానే పట్టాభిషేకం చెయ్యాలనీ, కొత్తదనగానే ఈసడించాలనీ చెప్పే మూఢవిశ్వాసాన్ని ఖండించి పరీక్షించి మంచిని గ్రహించండయ్యా అన్నాడు. అదే మనస్తత్త్వంతో సరస్వతి రెండు భాషలనూ సమాన ప్రతిపత్తితో స్వీకరించి శివపార్వతులను నుతించిందనీ చెప్పాడు. ఏమి? పార్వతికి సంస్కృతం రాదా? ఆమె విద్యాభ్యాస సందర్భంలో 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః' అని వర్ణించాడు గదా! ఆ కాలంలో విద్యాద్వారం (medium of instruction) సాధారణంగా సంస్కృ

తమే గదా! పార్వతికి సంస్కృతంరాదని కాదు. అయితే స్త్రీ కోమల ప్రకృతికి సంస్కృతం సరిపడదు ఆమె మృదు హృదయాన్ని వివరించగలిగినది అలరించ గలిగినదీ ప్రాకృతమే. కనుక ఆ ఔచిత్య పరిజ్ఞానంతో సరస్వతి ప్రాకృతం ఉపయోగించింది. ఇక్కడ ఒకటి తోస్తుంది. కాళిదాస కాలంలో పండితులు సంస్కృతం మీద చూపే మోజూ గౌరవం ప్రాకృతంమీద చూపక చిన్నచూపు చూడడంతో ప్రాకృత మార్దవ మాధుర్యాలెరిగిన కవి ఆ సమకాలీన పరిస్థితులకు సమాధానంగా సరస్వతీ ముఖాన ఇట్లా పలికించినాడా అనిపిస్తుంది.

కేవలం భాషా శుద్ధి మాత్రమే చూచుకొనే పండితులకు ప్రాకృతం తిరస్కార్యమే కావచ్చు. కాని రస రామణీయక ప్రవణులైన కవులు దానిని సరిహరించుకో లేరు. ఉన్న సంస్కారంతోనే దానిని స్వీకరించి అమోఘమైన రచనలు చేస్తారు. పాత—కొత్తలు, సంస్కృత—అసంస్కృత భాషలూ కాళిదాస కాలం నుంచీ చర్చనీయాంశాలుగానే ఉండడం గమనించదగ్గది.

పండితుల సంస్కృత భాషాభిమానానికి విరుగుడుగా ప్రాకృత కవులు సంస్కృతంమీద దండెత్తే ఉద్యమం లేవదీశారు. ఈ క్రింది పద్యాలు చూస్తే వారి తీవ్ర వాదం బోధపడుతుంది.

'పరుషా స్సంస్కృత బంధాః
ప్రాకృత బంధోహి భవతి సుకుమారః
పురుష మహిళానాం యావత్
ఇహాంతరం తావ దేతేషామ్.'

సంస్కృత రచనలు పరుషములు. ప్రాకృత రచన సుకుమార మైనది. పురుషుడికీ, స్త్రీకి ఎంత వ్యత్యాసం ఉందో ఈ రెండింటికీ అంతే.

అమృతం ప్రాకృత కావ్యం
పఠితుం శ్రోతుం చ యే న జానంతి
కామస్య తత్త్వ చింతాం
కుర్వంత స్తే కథం న లజ్జంతే.

ప్రాకృత కావ్యం అమృతమే. అది చదవడం, వినడం ఎవరికి రాదో వారు శృంగార చర్చ చేయడానికి ఎందుకు సిగ్గుపడరు?

లలితే మధురాక్షరే
యువతి జన వల్లభే సశృంగారే
సతి ప్రాకృత కావ్యే
కః శక్నోతి సంస్కృతం పఠితుమ్.

ప్రాకృత కావ్యం లలితం. మధురాక్షరములు గలది. యువతిజన ప్రియమూ, శృంగార యుక్తమూ అయినది. అట్టిది ఉండగా సంస్కృతం ఎవడు చదువుతాడు? ఇదీ వరస !*

ఇంత ప్రతిఘటించి రచనలు చేసినా ఆ ప్రాకృత రచనల వల్ల, సంస్కృతం నిర్మూలం కాలేదు. అంత వరకూ పెరిగిన సంస్కృత విశ్వరూపపు మోకాలి దగ్గరికైనా రాలేదు ప్రాకృతం. సంస్కృతంలో మధురమైన శృంగార రచనలు వృద్ధికాకనూ పోలేదు. కాని ఈ ప్రతిఘటన ప్రాకృతం నిల దొక్కు కోడానికీ, సంస్కృతీయుల తిరస్కారాన్ని ఎదుర్కోడానికీ పనికి వచ్చింది. అతివాదం ఎప్పుడూ ఎదుటి వాదాన్ని నిర్మూలం చెయ్యలేదనీ స్వవాదం తన బలంమీద తాను నిలబడ వలసిందేననీ ఉభయులూ గ్రహించి స్తిమిత పడ్డారు.

ఒకనాడు సంస్కృతవాదులు చేసిన తప్పే అలనాడు ఆంధ్ర గ్రాంథిక వాదులున్నూ చేశారు. తెలుగులో వ్యావహారిక భాష అశాస్త్రీయమనీ, గ్రామ్యమనీ దూషించీ సభలుచేసీ, ప్రభుత్వానికి మహజర్లు పెట్టీ దానిని రూపు మాప జూచారు. అంతేకాక 'గిడుగు రామమూర్తి నుడువు నిల్వక పోయె, ఒగి జయంతి రామయోక్తి గెలిచె' అని గ్రాంథికానికి కైవారమున్నూ చేశారు. కాని వ్యావహారికానికి క్రమంగా ప్రజలఅండ దొరికి బలపడింది. అది సంస్కారపూత కాకపోయినా సుఖగ్రాహ్య నిబంధన అనే సంగతి స్థిరపడింది. ఒకసారి గిడుగువారు ఒక

* సౌలభ్యం కోసం ప్రాకృత గాథలు విడిచి సంస్కృతం ఉదాహరించడ మయినది. ఈ శ్లోకములు గాథా సప్తశతి పీఠికనుండి సంగృహీతములు—

(చౌఖాంబా ప్రచురణ.)

ప్రసంగంలో కృష్ణాపత్రికలో ఇట్లా అన్నారు. 'గ్రాంథికం సంస్కృతం వంటిది. దానిని చక్కగా అభ్యసించిన వారు దానిలోనే రచనలు చేయవచ్చు. అది నేర్వని వారు తమ వాడుకభాషలో తాము రచనలు చేసుకోవడానికి అభ్యంతరమేమి? ఎంకి పాటలను ఎవ్వరూ భాషాపరంగా ఆక్షేపించ నక్కరలేదు. ఆ భాష ప్రాకృతం వంటిది. ప్రాకృత కావ్యాలు చదివి ఆనందించడం లేదా?' ఇక్కడ ప్రాకృతానికి వ్యాకరణ ముంది కాదా? అని కొంద రడగవచ్చు. కాని భరతుని నాటకది 'సంస్కారగుణ వర్జితం' అయినా నాటకాల్లో పాత్రౌచిత్యానికి ఆయన వాడవచ్చు నన్నాడు. అట్లాగే కాళిదాసు నాటికి కూడా 'సుఖగ్రాహ్య నిబంధన' మాత్రమే. అయినా దానిని సరస్వతీ ముఖ పవిత్రితం చేసాడు. సరస్వతికి రెండు ముఖాలు అనుకొంటే ఒకటి సంస్కృతం, వేరొకటి ప్రాకృతం. ఒకటి గ్రాంథికం, ఇంకొకటి వ్యావహారికం. రెండూ రెండు ప్రయోజనాలు నెరవేరుస్తాయి. రెండూ పవిత్రాలే.

ఇప్పుడు — చిత్రమేమిటంటే వ్యావహారిక వాదులు పూర్వపు గ్రాంథిక వాదుల స్థానం తీసుకొని గ్రాంథికాన్ని బహిష్కరించాలని సింహనాదాలు చేస్తున్నారు. దాన్ని నిర్మూలనం చెయ్యాలని తీర్మానాలు చేస్తున్నారు. తీర్మానాలవల్లా, శంఖనాదాలవల్లా ఏదీ నిర్మూలం కాదని నెవకటి గ్రాంథిక చరిత్రే రుజువు చేసింది. నాకు తెలిసినంతలో వ్యావహారిక భాషా ప్రవర్తకులైన ప్రముఖులెవ్వరూ గ్రాంథికాన్ని నశింప జెయ్యాలని చెప్పలేదు. గ్రాంథికం శమైక్య సాధ్య మనీ, రచనా సౌలభ్యానికీ, విద్యావ్యాప్తికీ వ్యావహారికానికి సముచితస్థానం ఇవ్వవలెననీ వాదించారు. కృతార్థులైనారు.

గి. రాంమూర్తిగా రన్న ఈ మాటలు చూడండి—

'వ్యావహారిక భాష తల్లివలె నాకు ప్రేమ పాత్రము, ప్రాచీనాంధ్ర భాష మూలపు టమ్మవలె నాకు పూజ్యురాలు' వ్యాసావళి పుట 140. (విశాలాంధ్ర ప్రచురణ).

ఇక గురజాడ వారు—

'సులభ సాధ్యమగు నవీన గ్రాంథిక భాషొకటి ప్రబలిన యడల బుద్ధి బలము కలిగియు మూగలై యున్న మనవా రెందరు గ్రంథములను వ్రాసి భాషను వృద్ధిజేయుదురు! పుట్టు కవులై గ్రాంథిక భాష వేరని వారి కది మహోపకారము కదా!' అని ఒక ప్రసక్తిలో అన్నారు. చూ. ముత్యాలసరాల పీఠిక (ఎమెస్కో ప్రచురణ—పుట 24.)

సరిగ్గా గురజాడవారి సూచననే స్వీకరించి ప్రవర్తింపజేసే తలంపు ఉన్నా లేకపోయినా సమకాలీన మైన అవసరాన్నీ అభిరుచినీ గుర్తించి చిన్నయసూరి వరవడినుంచి తప్పుకొని సులభ సాధ్యమైన గ్రాంథిక భాషలో శ్రీ వేలూరి, వేటూరి, పింగళి, రాళ్ళపల్లి, విశ్వనాథ ప్రభృతులూ తదనుయాయులూ ధ్రుత సంధిని, రేఫ శకటరేఫలను, పాతపడ్డ మాటలనూ విసర్జించి ఎన్నో రచనలు చేశారు. ఇంత యేల—ఆ గిడుగువారు, గురజాడ వారూ చేసిన శిష్ట రచనలన్నీ ఇంచు మించు ఆ సులభ గ్రాంథిక భాషలోనే ఉన్నాయి. కనుక గ్రాంథికాన్ని నిర్మూలించడానికి గాని, నిషేధించ డానికి గాని ఒక ఉద్యమం కూడదు. అమూల్యమైన ప్రాచీనాంధ్ర వాఙ్మయం ఉన్నంత వరకూ దాన్ని అభిమానాంశంగా చదివే తరగతు లున్నంతవరకూ అది నశించదు. సంస్కార పూతమైన గట్టి ప్రాణంతో తాను బ్రతుక్కొంటూనే వస్తుంది. అది రుచించనివారూ, అభ్యాసం లేనివారూ, స్వేచ్ఛగా వ్యవహార భాషలో వ్రాసుకోవచ్చు. దేనిలోనూ నిర్బంధం కూడదు.

* * *

'పురాణ మిత్యేవ న సాధు సర్వమ్.'

ఇంకొక వైపు చూద్దాం—

అభ్యుదయ కవితా యుగం వరకు ఛంద స్సుందరమైన పద్య రచన సాగుతూనే వచ్చింది. ఇంకా ఏ కొద్దిగానో సాగుతూనూ ఉంది. అయితే ఈమధ్య వచన గీతం పద్యం యొక్క సురక్షిత స్థానాన్ని ఆక్రమించింది. దానితో పైకి కనపడని అంత స్సంఘర్షణం ప్రారంభ మయింది.

కాలానుగుణంగా వచ్చిన ప్రబలమైన మార్పు సంఘర్షణకు దారి తీస్తుంది. తప్పదు. దాన్ని సూక్ష్మ దృష్టితో చూస్తే తత్త్వం విశద మవుతుంది. భావ కవితా యుగంలో వారివి ప్రభావితుల్ని చేసిన నవ్య భావాల కనుకూలంగా రచనా ధోరణి మారి గీత పద్యా

నికీ, ముత్యాల సరానికీ, గేయానికీ, ప్రాముఖ్యం వచ్చింది. నాడు వీటితోనూ సంఘర్షణ పడ్డ వారున్నారు. తర్వాత సర్దుకొన్నారు. ఇప్పుడింకా కాలం మారింది. సామాజిక రాజకీయ ప్రగతి శీలం దానికి చెందిన కొత్త సిద్ధాంతాలూ నేడు కవితా వస్తువు లైనాయి. వాటికి తగిన రచనా వాహికను ఎన్నుకోవడం అవసరం కదా! పూర్వచ్ఛందస్సులలో ఆ వస్తు భావాలు సూటిగా పలకవు. అంతేకాక నేటి ప్రకృతి శాస్త్ర తాత్త్విక భావధార నిసర్గంగా, నిరర్గళంగా రచనలో ప్రవహించాలంటే కొత్తరచనా ప్రకియ ఉండడం అవసరం. అదే అప్పుడు ఈ నాటి కవులు స్వీకరించిన వచన గీతం. నేటి భావావళి సరాసరి అక్షరాస్యులైన ప్రజలకు అందాలంటే భాషాఛ్ఛంద స్సులు అడ్డం రాకూడదు. కాల కాంతి రచనమీద ప్రతిఫలించి నప్పుడే ఆ రచన తన ప్రయోజనాన్ని ఉజ్జ్వలంగా నెరవేర్చ గలదు.

వ్యాకరణ జ్ఞానం లేకపోయినా భావసమృద్ధి ఉన్నవారు స్వేచ్ఛగా రచన చెయ్యడానికీ, అందులో రాణించడానికీ వ్యావహారిక భాష అక్కరకు వచ్చినట్లే వచనగీతం ఛందోబందోబస్తులను తెంచేసే వారికి ఆత్మబంధు వయింది. ఛందస్సులో చేయి తిరిగినవారు సయితం దీనిలోని సౌలభ్యానికీ, సహజత్వానికి మోజు పడి దీన్ని తమ కవితా సాధనంగా తీసుకొన్నారు. కవిత్వానికి ఛందస్సే అక్కరలేదు. ఉక్తిచాతురి, భావ సౌందర్యం ఉంటే వచనగీతంలోను కవిత్వం పలుకు తుందని చాలా మంది నిరూపించారు. ఆరుద్ర, అంజ నేయులు, తిలక్, దాశరథుల వచనగీతాలు కవిత్వం కాదని ఎవరూ అనలేరు. వీరు ధారాళంగా పద్యం వ్రాయగలిగినా తమ నూతనానుభూతులను సూటిగా వెల్లడించడానికీ ప్రజాసామాన్యానికి మరింత చేరువగా రావడానికీ ఈ కొత్త ప్రక్రియను చేపట్టారు. అడ మగాళ్లు అన్నట్టు వచనగీతం ఏమిటని ఒక ఆక్షేపణ. కాని దానిలో పస లేదు. ఇది కేవలం వచనం కాదు. గీతమూ కాదు. రెండు గుణాలు సమ్మిశ్రిత మైన ఒక కొత్త ప్రక్రియ. వచనం వంటి స్పష్టత, గీతం వంటి ఒక నాదసౌందర్యంతో, తూగుతో కూడిన పదరచన దీని లక్షణం. కనుక రెండూ ఒక పేరులో ఇమిడాయి. చేతకానివారు పద్యం వ్రాసినా, వచన గీతం వ్రాసినా జీవకళ లేకపోతే అది కవిత్వమే కాదు. జీవం ఉంటే ఏది వ్రాసినా అది కవిత్వం అని ఒప్పు కోవాలి.

కాగా—

యువభారతివారు ప్రకటించిన మహతి సంపుటం లోని ఈ మాటలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. 'కవిత్వము ఛందస్సులోనే వ్రాయవలయును. అట్లు వ్రాయనిచో కవిత్వము కాదు.' మహతి (ప్రతిభ పుట 20) అదే వ్యాసంలో మరికొంచెం దూరం పోయి—'కవిత్వ మనగా వర్ణన; ఉచితముగ, సమర్థ ముగ, దేనిని గురించి వర్ణించినను కవిత్వమే—కథను చెప్పుట కూడ వర్ణనయే. కథలోని భిన్నభిన్న విష యములు వర్ణింపబడు చున్నవి.' అన్నారు శ్రీ విశ్వనాథ వారు. అయితే పై రెండు వాక్యాలకూ పొంతన ఉన్నదా? మొదటి వాక్యమును బట్టి ఛందస్సులో వ్రాయనిది కవిత్వమే కాదు. రెండవ వాక్యమునుబట్టి ఉచితముగ, సమర్థముగ చేసిన వర్ణన కవిత్వము. కథ చెప్పుట గూడ వర్ణనయే. కనుక అది కూడా కవి త్వమే కావలసి ఉంది. అయితే ఛందస్సు ఉండవలెనా? అక్కరలేదా? తేలలేదు. ఒకవేళ ఛందోబద్ధమైన వర్ణనము కథ చెప్పుట మాత్రమే కవిత్వమని వారి అభిప్రాయమా?

ఈ అభిప్రాయము లోక విరుద్ధము. బాణుని కాదంబరి దండి దశకుమారచరిత్ర మొదలైనవి గద్యంలో వ్రాయబడ్డవి. అవి మంచి కవితా సంపత్తి కలవిగా గణింపబడుతూన్నవి. గద్య రచయితలు గూడా కవుల కోవలోనే పరిగణింప బడుతున్నారు. 'గద్యం కవీనాం నికషం వదన్తి' అనే సూక్తి ఎరుగని వా రుండరు. కవులకు గద్యరచన ఒరిపిడిరాయి వంటిది. అంటే ఒక కవి పద్యం వ్రాసి ఒప్పించినట్లుగా గద్య వ్రాసి ఒప్పించడం కష్టం. పద్యం గాన, శిల్ప గుణాల వల్ల అర్థగాంభీర్యంఉన్నా, లేకపోయినా పాఠకుల్ని లొక్కుపోతుంది. గద్యానికి నిర్దిష్టమైన ఆ ఆవరణం ఉండదు. అది తన భావసమృద్ధివల్లనే నిలదొక్కు కోవాలి. కనుక కవితాగుణానికి గద్యం పరీక్ష.

'బాణోచ్ఛిష ం జగత్సర్వం'

'కాదంబరీ రసజ్ఞానాం ఆహారోఽపి న రోచతే'

అనే బాణుని ప్రశంస, 'కవి ర్దండీ కవి ర్దండీ భవ

భూతిస్తు పండితః', 'ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవం దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయోగుణాః' అనే దండి ప్రసక్తి కవుల శ్రేణిలో వారికి గొప్ప బహుమానాలు.

శ్రీనాథుడు, పోతన మొదలైన ఆంధ్ర మహా కవులు దండి, బాణులను కవుల శ్రేణిలోనే ప్రశం సించినారు.

'భట్టబాణ మయూర భవభూతి శివభద్ర
కాళిదాసుల మహాకవుల గొలిచి'

'......ప్రవరసేనుని దండి భాసు దలచి'
కాశీ. 1 అ. 19 ప॥.

'మృదుమధుర వచనవర్గ పల్లవిత స్థాణు బాణునకుం బ్రణమిల్లి' భాగ 1 స్కం. 12 వ.

కనుక వచన రచయితలను కూడా కవు లనడం లోనే ఔచిత్యం ఉంది. ఇంత యేల శ్రీ చలం, విశ్వనాథల వచనరచనలనుండి కొన్ని భాగాలను తీసి శ్రద్ధగా అచ్చువేస్తే దాన్ని ఎవరు కవిత్వం అన కుండా ఉండగలరు? కవిగా చలం అనే సంపుటిని చూస్తే నా మాటల్లోని యాథార్థ్యం తెలుస్తుంది.

కాగా—

ఛందస్సు కవిత్వానికి వస్త్రభూషణాదుల వంటి బహిరంగ లక్షణంగాని అంతరంగ ధర్మం కాదు. ఆంతరిక ధర్మాన్నిబట్టి అవ్యభిచారి అయిన లక్షణం చెప్పవలెను గాని బాహ్యగుణాన్నిబట్టిగాదు. అట్లా చెపితే ఆ నిర్వచనం అవ్యాప్తిదోష జుష్టం అవుతుంది. కనుకనే కవితా మర్మజ్ఞులైన ఆలంకారికు లెవ్వరూ ఛందస్సును కావ్యలక్షణాలలో చేర్చలేదు.

'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' కావ్యాదర్శం.

'వాక్యం రసాత్మకం కావ్యమ్' సాహిత్యదర్పణం.

'రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్' రసగంగాధరం.

'సా వా గ్యా రసవృత్తి:—సాధ్వోహి రసో యథా తథం కవిభిః' ఆంధ్ర శబ్దచింతామణి.

కనుక కవిత్వానికి ఛందస్సు విధిగా ఉండా లనడం చెల్లదు.

శ్రీ విశ్వనాథవారి సాహిత్య చరిత్రచూస్తే ఈ నిర్వచనం వారి దగ్గరనుండి రాదగ్గదిగా కన్పించదు. శ్రీ సత్యనారాయణగారు కాల్పనిక యుగంలో తన సాహిత్య కృషి సాగించిన ప్రముఖకవి. నాటి ప్రాచీన కవితామార్గంనుంచి వైదొలగి నవ్య సాహిత్య ప్రోద్బలంలో అన్ని ప్రయోగాలూ చేసిన ఆధునిక రచయిత. సంకుచితమైన పూర్వకవితా రంగాన్ని విశాలపరచే ఉద్యమంలో ఆయన గేయం, ముత్యాలసరం, తుదకు ఒకటి రెండు వచన గీతాలు గూడా (ప్రయత్నించి చూపించవచ్చు) వ్రాసి నవ కవితోద్యమానికి అండగా నిలిచిన క్రియాశీలి.

ఒకసారి ఏలూరు నవ్యసాహిత్యమండలి సభలో శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారు గణపతిశాస్త్రి చదివిన 'మాదాకవళం తల్లీ' అనే గేయాన్ని వెటకారంచేసి ఆక్షేపిస్తే సత్యనారాయణగారు ఆ గేయాన్ని సమర్థిస్తూ దానిలోని ఔచిత్యాన్ని, భావ పుష్టిని వివరిస్తూ రెండు గంటలు ఉపన్యసించారు. ఆలోచించగా శాస్త్రులవారి ఆక్షేపణకు మూడు కార ణాలు కనపడతాయి. 1. అది నిర్దిష్టమైన ఛంద స్సులో లేదు. 2. వారి దృష్టిలో సద కవితకు గౌరవం లేదు. 3. అది వీధిలో తిరిగే ముష్టివాళ్ల దారిద్ర్యం మీద వ్రాసిన 'అశ్లీల' కవిత. కనుక సభలో చదువ దగిన యోగ్యత దానికి లేదు.

వెనకటి తరానికి చెందిన గురువు గారికి, రెండవ తరానికి చెందిన శిష్యుడు గారికీ కవితా రూప నిర్వచ నంలో పెద్ద అభిప్రాయ భేదం వచ్చింది. ఒకరికి కవిత కానిది రెండవ వారికి చక్కని కవిత అయింది. ఒకరికి బహుశః పద్యంలోనే గాని కవిత కనపడకపోగా రెండవ వారికి గేయంలో కూడా కవిత్వం కనపడింది. అయితే ఇందులో ఎవరికి కవిత్వం అంటే తెలియదు? ఇద్దరికీ తెలుసు. కాని చూచే చూపు వేరు. ఒకరు సంప్ర దాయ గంథంలో మునిగి ఒకచోట స్థిరపడిన వారు. వేరొకరు కాలంతోమారి కొత్త దృక్పథం అలవరచు కొన్న వారు.

నిజానికి శాస్త్రులవారికి కిన్నెరసాని పాటల లోను, కోకిలమ్మ పెళ్లిలోనూ కవిత్వం కనపడలేదు,

వాటిని కూడా సన్నగా ఎగతాళి చేసి ఆక్షేపించే వారు. వారికి కవితా బాహ్యరూపమైన గేయం నచ్చదు. మార్గకవుల దృష్టిలో గేయం హేయం. కనుకనే 'ముది విటులు విధవ లంజలు పద కవితలు మూరు బాస బాపన వారల్' అని పదకవితకు మంగళం పాడారు. మార్గకవుల దృష్టిలో పదకవిత ఛందోబద్ధం కాదు. అది తాళ లయానుగుణమైన పదముల కూర్పు. కీర్తనలకు, జావళీలకు పనికి వచ్చేది. దానిలో రచన అంత గౌరవప్రదం కాదు. నిర్దిష్టఛందస్సు కల ద్విపదకూడా వారికి ఆపోవలేదు. 'ద్విపద కావ్యంబు ముది లంజ దిడ్డికంత'' అని దాని తలపై కూడా అక్షింతలు చల్లారు.

పై వాదాలు పరిశీలిస్తే రచనా బాహ్య రూపాన్నిచూసి చేసిన ఈసడింపేకాని కవితయొక్క ఆంతర ధర్మమైన రసం, భావసౌందర్యం దాకా వెళ్లి అన్నమాటలు కావు. సమ్యక్ జ్ఞానంతో కవితకు రస, రామణీయకాలు, ప్రధానం అనుకొంటే బాహ్య రూపం దగ్గర తగాదాలు ఉండవలసిన అవసరం లేదు.

ఇపుడు శ్రీ సత్యనారాయణగారు గురువుగారి స్థానంలో కూర్చుని వ్యక్తిగత ఇష్టానిష్టాలే కవితా లక్షణంగా శాసించడాన్ని వారి శిష్యులు సైతం హర్షించలే రనుకొంటాను.

ఏతావతా—

వచనంలో వ్రాసినా పద్యంలో వ్రాసినా రమణీయార్థం ఉంటే అది కవిత్వమే. బాహ్యరూపమైన ఛందో నిర్బంధం అశాస్త్రీయం. కానయితే ఛందస్సు కొందరి రచనకు దీప్తి నియ్యవచ్చు. కొందరి రచనకు వచనమే ఔజ్జ్వల్యమును సంపాదించ వచ్చు. అది కవి స్వేచ్ఛకు విడిచిపెట్టవలసినదే. కనుక గ్రాంథిక వ్యావహారిక భాషలు ఎట్లాగో అట్లే వచన గీతం, పద్యం సరస్వతికి రెండు ముఖాలు. రెండూ అపరిహార్యములే.



# సీమోల్లంఘన

శ్రీ పణతుల రామచంద్రయ్య

ఇరుకు గదిలో దీప శిఖపై ఎగసే ఆలోచనా శికరాల్ని
ఇంత పెద్ద అనుభవాల చషకం లోకి వంచుతున్నా నని
నవ్వుతారు వీళ్లు.

గచ్చు రాలిపోతున్న గుండెల్లో రూపు కట్టని సిందూర రేఖల్ని
కాయితాలపై నింపుతూ తలవంచిన నాపై
రువ్వుతారు రాళ్లు.

తమకంతో కిటికీలోంచీ క్షితిజ రహస్యాలను చదవటం ఆపి
తమ నిరంతర సార్థవాహం లోనికి రమ్మంటారు.
రెక్కలతో ఎగిరి వియద్గంగా డిండీర సాన్నిహిత్యం సాధించ కుండా,
ఒక్క ఒయాసిస్ అయినా లేని అంచులకు పయనించ మంటారు.

ముందు నడుస్తున్న వాణ్ని చూసి నేర్చుకోమంటారు—
స్పందనలూ, సాశ్రు నయనాలూ సత్తా లేని వంటారు.

చావు నవ్వుల మధ్యగా పోయే బ్రతుకు దారి వీళ్లకు తెలుసు
సహజావేశాలకు తగిలిస్తారు తళుక్కుమనే బంగారు గొలుసు.

చాలామంది వీళ్లు, ఆజానుబాహులు, ఉత్తరీయ ధారులు,
సంప్రదాయ మధువు తాగి స్వైర విహారం చేసే గంభీరులు.

అయినాసరే — నా నిరంతరత్వాన్ని వీళ్లకోసం విడనాడను.
యథార్థాల పిడికిలి లోంచీ పిండిన లౌక్యాన్ని చవిచూడను.

ప్రాక్తన వైభవాల దుర్గంలో చేరి వీళ్లు
పరిహాసంగా నవ్వుతోంటే,
పక్కనే నిశ్చలంగా నిల్చున్న మర్రిచెట్టు కింద నేను
ప్రచండ సందేహా నిలం సృష్టిస్తాను.

## సీమోల్లంఘన

అనిశాంత వేదనా గీతంతో సముద్రాన్ని ఉన్మత్తాన్ని చేసి
అనాదిగా ఇక్కడ ఏర్పడ్డ హద్దును రద్దు చేయిస్తాను.
శృంఖలాలూ, గౌరవాలూ, పాప పుణ్యాలూ రూపు మాపి
సృష్టిని జీరో పాయింటువద్ద ప్రారంభిస్తాను.

అక్కణ్ణుంచి ప్రస్థానం సాగిస్తాను —
అవ్యాహతంగా, ఏకాంతంగా, నీలనీల గగనం కింద.
ఊహా పూర్ణకుంభాన్ని తొణక్కుండా మోస్తాను
హేతు భారావనతమైన దీనదీన మస్తిష్కంపైగా.

నడిచే దారుల్లో అన్ని మలుపుల్లో అందంగా
నవార్ద్ర స్వప్న మల్లికా ప్రపంచాలను పరుస్తాను.
కొండల్లో రాళ్లల్లో నీళ్లల్లో పేరుకున్న అర్థాలు చూడమంటూ
గుండె గుండెనూ తట్టి బిగాజుపట్టిన కిటికీలు తెరుస్తాను.

ఏ మజిలీలోనూ స్వాగత రుచిర హాసాల చాయలు లేవనీ
ఏ ముహూర్తంలోనూ ఆగామి బాధల ఇతిహాసాలు మాయం కావనీ
ఎందరు గొడవ చేసినా జంకకుండా వస్తాను
అందుకే యీ రోజు నేను సీమోల్లంఘన చేస్తాను.



# ఆధునిక యుగము - గాంధీ సాహిత్యము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

'దాసుల్గా జను భారత ప్రజకు
స్వాతంత్ర్యంబు సత్యాగ్రహ
శ్రీ సంధిల్లగ జేసి, సర్వ జగతీ
క్షేమం కరుల్ బుద్ధు డా
యేసుక్రీస్తు, మహమ్మదు త్రయిని
దా నేకంబుగా గూర్చు 'గాం
ధీ సాహిత్యము' విశ్వమానవ
సముత్తేజంబు గావించుతన్.'

'అరయన్నీదు శతార్ధ జన్మతిథి
నా దర్శించితి నే పద్యముల్
స్మరణీయంబగు నీదు దర్శనముతో
స్వాతంత్ర్యమున్ జూచితిన్
సరిగా నీ శతవార్షికోత్సవ తిథిన్
సద్భక్తి బూజింపగా
నరుదౌ శక్తిని నా కొసంగిన
మహాత్మా! నీకు శ్రద్ధాంజలుల్.'

1919 అక్టోబరు తే 2 దిని గాంధీ మహాత్ముని ఏబదవ జన్మ దినమున పద్యములను వ్రాసి 'గాంధీ సాహిత్యము'నకు శ్రీకారము చుట్టితిని. అర్ధ శతాబ్దమైన వెనుక 1969 అక్టోబరు తే 2 దిని 'గాంధీ శత జయంత్యుత్సవ సందర్భమున' 'నవ్యాంధ్ర కావ్య జగత్తులో 'మహాత్ముని ప్రశంస' అను విషయమై పరిశ్రమ చేయు భాగ్యము లభించినది. అప్పుడు సంగ్రహముగా దానిని గూర్చి తెలిపితిని.[1] దీనిని విపులముగా వెల్లడించుటకు సమాదరణతో నవకాశము గల్పించిన 'భారతి' పత్రికా సంపాదకులకు, ప్రథమముగా నా మనఃపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను.

ఆంధ్రజాతి 'మన మాంధ్రులము—మన దేశ మాంధ్రదేశము—మన భాష ఆంధ్ర భాష' అన్న మాట మఱచి నానా ముఖముల చెదరియున్న కాలములో నిప్పటి కరువది రెండేండ్ల క్రిందట ముక్కోటి ఆంధ్రులకు (నేటి జనసంఖ్య 4 కోట్ల 33 లక్షల 95 వేలు.)

'ఆంధ్రపత్రిక' అను పంచాక్షరి మూలమున
'ఆంధ్రత్వము' అను భావము

సృష్టించి, దాని నేకైకముగా వ్యాప్తిచేసి, ఆంధ్రోద్యమమున కంకురార్పణము గావించి ప్రత్యేకాంధ్ర రాష్ట్ర సిద్ధికి మూలపురుషులైన వారు కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

గాంధీ మహాత్ముడు భారతపిత
కాశీనాథుని నాగేశ్వర రావు ఆంధ్రపిత !

భారత దేశమున స్వాతంత్ర్య సమరము ప్రారంభమైన నాటినుండి మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము—ఆంధ్రపత్రిక మూలమున నేకైకముగా యావదాంధ్రలోకమున ప్రబోధ ప్రచారములు చేయుటయే గాక, 'సంవత్సరాది సంచిక,' 'భారతి' మూలమున—గాంధీ సాహిత్యమునకు చిరస్థాయిత్వము గడించినది శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావు గారే—ఆ పుణ్యమూర్తి కక్షరాంజలులు సమర్పించుచు వ్యాసము మొదలుపెట్టుచున్నాను.

భారత స్వాతంత్ర్యయ సమర కాలమున—క్రీ. శ. 1920 నుండి ఆంధ్రదేశమున వ్యాప్తమైన సాహిత్యమునకు; గాంధీ సాహిత్యము అని పేరు. ఇది పూర్తిగా ప్రజానీకమునకు సంబంధించినది.

ఆంధ్ర వాఙ్మయమున ప్రజలను ప్రబోధించిన

---

1. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము—ప్రసారము.

సాహిత్యములు రెండు. మొదటిది పండ్రెండవ శతాబ్దిని శైవ సాహిత్యము. రెండవది ఇరువదవ శతాబ్దమున గాంధీ సాహిత్యము—శైవ సాహిత్యము భక్తిసూత్రమున సాంఘిక చైతన్యమును పెంపొందించి—పద, పద్య, గేయ రూపముల శైవమును వ్యాప్తముచేసి, ప్రజలను మతవీరులుగా మలచినది. గాంధీ సాహిత్యము కాలాను సారముగా, పద, పద్య, గేయ, నాటక, ఉపన్యాసముల మూలమున నఖిలాంధ్ర దేశీయులను స్వాతంత్ర్య సమరోన్ముఖులను గావించి, స్వాతంత్ర వీరులనుగా దిద్ది తీర్చి విజయమును సాధింప జేసినది. వస్తుతః రెండింటి లక్ష్య సాధనము మూలమున మత స్వాతంత్ర్యోద్యమములో—తెలుగు భాషా సాహిత్యములకు గల దివ్యశక్తి లోకమున కంతకు వెల్లడియైనది. రాజ కీయమునకు సాహిత్యమునకు, సంబంధము గలుగుట చేత—నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలో నిది యొక నూతనాధ్యాయముగా పరిణమించినది.

తెలుగున స్వాతంత్ర్య పథకమును తొలుత ప్రవర్తింప జేసినవారు కవులు. కావున వారి చరిత్ర గాంధీ సాహిత్యమున తొలి ఘట్టము.

## కవులు — స్వాతంత్ర్య పథకము

ఆంధ్రభాషా సాహిత్యము లాదినుండియు రాజ పోషణచేతనే వర్ధిల్లిన వనుట నిర్వివాదాంశము. అయి నను తెలుగుకవు లెన్నడును రాజులకు దాసోహమన్న వారు కారు. రాజుల తమ్ము నలక్ష్యము చేసినపుడు, రాజుల వలన మానసికముగా బాధకలిగినపుడు, వారెదురు తిరిగి, తమ వ్యక్తి గౌరవము స్వాతంత్ర్యము నిలుపు కొనుచు ప్రవర్తించెడివారు.

రాజప్రశంస నాందిగా గల నన్నయ భారత మవత రించిన మఱి నూఱేండ్లకే – కవితా స్వాతంత్ర్యము వ్యక్తి స్వాతంత్ర్యము ప్రదర్శించిన కవులుండుట గమ నింపదగినది. వారే—

## శివ కవులు

తెలుగున భాషలో—భావములలో— ఛందస్సులో ఇతివృత్తములో—ప్రక్రియా వైవిధ్యములో—స్వతంత్ర పథకమునకు శ్రీకారము చుట్టిన వారు శివకవులు— వర్ణవ్యవస్థ పరిహరించిన శైవమున సంఘమంతయు నేక కుటుంబము — కావుననే రాజశిఖామణియైన నన్నెచోడకవి తనకృతిని గురువునకే అంకితము చేసి నాడు. సాంఘికమైన తరతమ భేదములు సమసి పోవుటచే శైవసాహిత్యము, సంఘమును వీర్యవంతముగా నొనర్చి, ప్రజానీకము నుత్తేజపఱచినది.

శైవసాహిత్యము కేవల సాహిత్యదృష్ట్యా లేక సాంఘిక పరిణామదృష్టితో సమ్యక్పరిశీలన చేసిన ప్రస్తుత భాషా జాతీయ సమైక్యత కది యెట్లు తోడ్పడునో విశదమగును.

నవత, మానవత ప్రతిపాదించి, మానవత్వము నందు దేవత్వము నిరూపించి, సాహిత్యము సార్వ జనీనము చేసిన వారు శివకవులే. పాల్కురికి సోమ నాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్రలు—సాంఘిక చైతన్యమునకు, సజీవ నిఘంటువులు.

శివకవి యుగముననే విలసిల్లిన మఱియొక మహాకవి—

## వేములవాడ భీమకవి

'సీ. ప. వచియింతు వేములవాడ భీమన భంగి
యుద్దండ లీల నొక్కొక్కమాటు'

అన్న శ్రీనాథకవి సార్వభౌముని సూక్తికి పాత్రమైన భీమకవి, కవి స్వాతంత్ర్యమునకు ప్రథమోదాహరణము.

ఉద్దండకవి యనగా, తన కవితాశక్తిచే నెట్టి వానినైనను వశపఱచుకో గలిగిన ఘటికుడు.

భీమకవి రాజ కళింగ గంగు అనురాజు నొద్దకు బోయి కస్తూరి నిమ్మని యిట్లు కోరినాడు—

'మ. ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ
దాక్షారామ భీమేశ నం
దనుఁడన్ దివ్య విషామృత ప్రకట
నానాకావ్య ధుర్యుండ, భీ
మన నాపేరు వినంగఁ జెప్పి
తెలుంగా ధీశ! కస్తూరికా
ఘన సారాది సుగంధ వస్తువులు
వేగం దెచ్చి లాలింపురా!'

ఇందురాజును, ఏకవచనమున బోధించుటయే గాక ఒక విశేషమున్నది. భీమకవి, తక్కిన కవులవలె

రాజువొద్దకు వెడలి, కస్తూరిని కోరినాడు. కాని 'కస్తూరికా' అనుటలో చిక్కువచ్చినది. రాజు భార్య పేరు 'కస్తూరికా మోదిని' భీమకవి కాసంగతి తెలి యదు. కళింగ గంగునకు కోపమువచ్చి తరువాత రమ్మని పంపి వేసెను.

అ పై భీమకవి రాజ్యభ్రష్టుడవు కమ్మని శాపమిచ్చుట, తిరిగి ఆతని యనుగ్రహమున రాజ్యము పొందుటయు, నందఱికి పరిచితములే.

ఇది కట్టుకథకాదు. తిట్టు కథకాదు. కవి గట్టిదనము నుట్టంకించు కథ

## పో త న

శ్రీనాథ యుగమున పరమభక్తాగ్రేసరుడైన బమ్మెర పోతన—సర్వజ్ఞ సింగమనాయని వారివలన తనకు కలిగిన యనాదరణను — పురస్కరించుకొని రాజనింద చేసిన యీ క్రింది పద్యము. యావదాంధ్ర లోక మెఱిగినదే.

'ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి
పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి
శరీరమువాసి, కాలుచే
సమ్మెట వేటులం బడక సమ్మతి
శ్రీ హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకడు
భాగవతంబు జగద్ధితంబుగన్'

సర్వజ్ఞ సింగమ నాయడు భాగవతము తనకు కృతి నిమ్మని పోతనను నిర్బంధించి నాడు. పోతన 'ససేమిరా' ఒప్పుకొనలేదు. సింగమ నాయడు పోతనను బాధింప దలచెను. కాని సాధ్యము కాలేదు.

పోతన రాజులకు కృతి నిచ్చి చనిపోయిన వెనుక యమునిచే బాధలు పడకుండ—తప్పించుకొనినాడు. శ్రీనాథుడు బ్రదికియుండగనే, రాజులకు కృతి నిచ్చిన కతన—రాజులచే సమ్మెట వేటులం బడినాడు— ఇంతే భేదము.

## తాళ్లపాక అన్నమయ్య

దివ్య తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులైన తాళ్లపాక అన్నమయ్యను విజయనగరాధీశుడగు సాళ్వ నరసింగరాయలు—తనపై పదములను చెప్పమని కోరి నాడు. అన్నమయ్య, తిరుమల వేంకటేశునిపై తప్ప నరులపై— అందును నరసింగరాయనిపై పదములను చెప్పనని తిరస్కరించినాడు. రాయ డాతనికి సంకెళ్ళు వేయించినాడు. అన్నమయ్య బాధపడి నాడు గాని—తన స్వాతంత్ర్యము వీడలేదు.

రాయల యుగమున కవులకు కనకవర్ష మన్ని ఋతువుల యందు కురిసినది. అట్టి కాలముననే— రాజదూషణ యుండుట సాహిత్య చరిత్రకారులు పరి శీలింప దగినది.

## సంకుసాల నృసింహ కవి

నృసింహకవి తన కవికర్ణరసాయనము, కృష్ణరాయలకు కృతి నీయదలచి, విజయనగరము రాగా, అల్లసానిపెద్దన మూలమున నది భగ్నమైనది. రాజులన నిరసన భావము గలిగినది. ఆతడు చేసిన రాజ దూషణ చూడుడు.

సీ. అందోళికల యందు నంతర చరులైన
  నవికృతా కృతుల పిశాచ జనులు
పర కరాళంబులై ప్రార్థింపఁ గనుగోక
  వాయెత్తకుండు జీవచ్ఛవములు
వాలవీ జనములఁ గ్రాలుచు నీగకు
  నంటీని ఖలవర్తు లాండసములు—
వేత్ర పరంపరా విల కంటకావృత్తిఁ
  జేరఁ బోరాని ఖర్జూర తరులు

గీ. శంఖ నాగ స్వరస్వర శ్రవణ సమద
విస్ఫుర చ్ఛత్ర విస్ఫారిత స్సటాక
విష్ట విష వైద్య వశవర్తి దుష్టఫణులు
ప్రభు దురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు
(1—36)

---

2. దీనికి చారిత్రక ప్రమాణము గలదు. చూ. చోడగంగుని ముఖలింగం తామ్రశాసనము— మండ నరసింహం—భారతి—నవంబరు, 1962. పుటలు 58—63 భీమకవి కాలమును నేను నిర్ణయించి యున్నాను. దానిని వాఙ్మయ చరిత్రకారు లంగీకరించిరి. చూ. కవికాల నిర్ణయము— శాసనాధారములు—అను నా వ్యాసము. (భారతి. 1949 జూన్).

## ధూ ర్జ టి

రాయల అష్టదిగ్గజములలో నొకడై, మాధుర్య కవితా ధూర్వహుడైన 3ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకమున—రాజులను తూర్పారఁ బట్టినట్లు వేఱొక కవి చేయలేదు.

శా. రాజుల్ మత్తులు వారి సేవ
నరక ప్రాయంబు వా రిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీ
భూషాదు లాత్మ వ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలు
పరితృప్తిం బొందితిం జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్ము
దయతో శ్రీ కాళహస్తీశ్వరా!

శా. రాజై దుష్కృతి చెందె చందురుండు,
రారాజై కుబేరుండు ద్వ
ఱ్గా జీవంబున గాంచె దుఃఖము
కురుక్ష్మాపాలు డా మాట నే
యాజిం గూలె సమస్త బంధువులతో
నా రాజ శబ్దంబు ఛీ
ఛీ! జన్మాంతర మందు నొల్లను
జుమీ శ్రీ కాళహస్తీశ్వరా!

శా. రాజర్థాతురు డైనచో నెచట
ధర్మంబుండు? నే రీతి నా
నా జాతి క్రియ లేర్పడున్ సుఖము
మాన్యశ్రేణి కెట్లబ్బు రూ
పా జీవాళికి నేది దిక్కు ధృతి నీ
భక్తుల్ భవత్పాద నీ
రేజంబులు భజియింతు రే తెఱఁగునన్
శ్రీ కాళహస్తీశ్వరా!

శా. రాజన్నంతనె పోవు నా కృపయు ధర్మం
బాభి జాత్యంబు వి
ద్యాజాత క్షమ సత్యభాషణము
విద్వన్మిత్ర సంరక్షయున్
సౌజన్యంబు కృతం బెఱుంగుటయు
విశ్వాసంబు గాకున్న దు
ర్బీజ శ్రేష్ఠులుగా గతంబు గలవో
శ్రీ కాళహస్తీశ్వరా!

శా. రాజశ్రేణికి దాసులై సిరుల గోరం
జేరఁగా సౌఖ్యమో
యీ జన్మంబు తరింపఁ జేయఁగల
మిమ్మే ప్రొద్దు సేవించి ని
ర్వ్యాజా చారము సౌఖ్యమో తెలియ
లేరో మానవుల్ పాప రా
జీ జాతాది మదాంధ బుద్ధులగుచున్
శ్రీ కాళహస్తీశ్వరా॥

శా. లేవో కానల కంద మూలఫలముల్
లేవో గుహల్, తోయముల్
లేవో యేఱులఁ బల్ల వాస్తరణముల్
లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తులన్మనుప
జాలింబొంది భూపాలురన్
సేవల్సేయక బోదు రేలొకొ జనుల్
శ్రీ కాళహస్తీశ్వరా!

మ. పదునాల్గేండ్లు మహాయుగంబు
లొక భూపాలుండు చెల్లించె న
య్యుదయాస్తాచల సంధి నాజ్ఞనొకఁ
డా యుష్మంతుఁడై వీరి య
భ్యుదయం బెవ్వరు చెప్పగా వినరొ?
యట్లులే మత్తులై యేల చ

3. ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతక మన గానే స్వర్గీయులైన శ్రీ శంభుప్రసాదు గారు నా తలపున సాక్షాత్కరించెదరు. ఈ శతకము వారి కత్యంత ప్రియమైనది. ఇందలి పద్యములు చాలావఱకు వారికి కంఠస్థములు — వా రీ శతకమును ప్రచారములోనికి తే దలచి, వ్యాసాంతములలో 'భారతి'లో కొన్ని ప్రక టించి యున్నారు. (చూడుడు 1963–భారతి). ఈ శతకమును కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు గారు 'శతక మంజరి'లో విపుల పీఠికతో ప్రకటించి యున్నారు. ఆ పీఠిక—వారి శతజయంతి సంచికలో పునర్ముద్రితము.

చ్చెదరో రాజుల మంచు నక్కట కటా!
శ్రీ కాళహస్తీశ్వరా!

6 శార్దూలములతో (పెద్దపులివలె) రాజులపై నురికి, ఒక మత్తేభముతో (ఏనుగుతో) నారి మదమణచిన కవి ధూర్జటి.

## మోచర్ల దత్తప్ప కవి

మధ్యయుగమున కవితా స్వాతంత్ర్యమును చూపిన మఱియొక కవి మోచర్ల దత్తప్ప కవి. దత్తప్పకవియు నాతని సోదరుడగు వెంకన్నకవియు, 4వెట్టు సంస్థానాధీశుడైన వేలెండ్ల వేంకట కృష్ణమ రాజు ఆస్థాన కవులు—వీరిలో దత్తప్ప కవి సమస్యా పూరణమున నాంధ్ర శారదకు దత్తుడు. ఆతని స్వతంత్ర భావన కొక యుదాహరణము.

వేంకటగిరి సంస్థానాధీశు డగు కుమార యాచమనాయడు, పండితులను కవులను నవమాన పఱచెడి వాడు. ఒకనాడొక షట్ఛాస్త్రవేత్తయైన పండితుడు యాచమనాయని దర్శింపగా, ఏ పాటి గౌరవము సేయక, ఏకవచనమున 'ఊరు పేరులు' తెలుసుకొని, తెలుగున సమస్యలు పూర్తి చేయగలవా' అని యడిగెను. పాపమా పండితునకు తెలుగు తెలియదు. కాబట్టి 'ప్రభూ! నేను కాశీలో చాలకాలము సంస్కృతము చదివి నాను. తెలుగులో పరిశ్రమ చేయలేదు' అని చెప్పినాడు—యాచమ నాయడు—

'తెనుఁగెఱుఁగడు సంస్కృతంబు తెన్నే మెఱుఁగున్' అని యీసడించి పంపివేసినాడు.

ఆ పండితుడా యవనీపతి యవమానము భరింప జాలక దత్తప్పకవి వద్దకు వచ్చి, తన వృత్తాంతము నివేదించెను. దత్తప్పకవి క్రుద్ధుడై సాటి పండితుని కింతయవమానము చేసిన యాచమనాయనికి ప్రతీకారము చేయదలచి ఆ పండితునితో వెంకటగిరి రాజాస్థానమునకేగి — యాచమనాయనికి తెలియజేసెను. యాచమనాయడు, తూగుటుయ్యేలలో కూర్చుండి దర్శనమునకై వచ్చిన దత్తప్పకవిని కూర్చుండుటకైన సెలవొసంగక—

'ఈతఁడేనా కవి' అనెను. అంతవారి కీ క్రింది సంభాషణ జరిగెను.

| | |
|---|---|
| యాచ— | ఈతఁడేనా కవి? |
| దత్త— | పరీక్షింపగల ప్రభువున్న ఎదుట నిల్చున్న యతడే కవి. |
| యాచ— | (నిర్లక్ష్యముగా) ఏ యూరో? |
| దత్త— | వెట్టు. |
| యాచ— | మఱో? |
| దత్త— | కుమార కృష్ణ వసుధీశ్వరనందన రాజ్యలక్ష్మికిం బట్టు. |
| యాచ— | మఱో? |
| దత్త— | ధరాంగనా రమణి పాపటబొట్టు . |
| యాచ— | మఱో? |
| దత్త— | రిపూరగాళి వాకట్టు— |
| యాచ— | మఱో? |
| దత్త— | సముజ్జ్వల ధృతికిఁ గట్టు |
| యాచ— | మఱో? |
| దత్త— | బుధాళికి వేల్పుఁ జెట్టు |
| యాచ— | మఱో? |
| దత్త— | వాగ్దిట్టల కున్కి పట్టగు |
| యాచ— | మఱో? |
| దత్త— | మదీయ నివాసము యాచభూపతీ! |

అని పద్యమంతయు నిట్లు చదివెను.

ఉ. వెట్టు కుమారకృష్ణ వసుధేశ్వర నందన
రాజ్యలక్ష్మికిం
బట్టు, ధరాంగనా రమణి పాపట బొట్టు,
రిపూరగాళి వా
కట్టు, సముజ్జ్వల ధృతికి గట్టు
బుధాళికి వేల్పుఁ జెట్టు వా
గ్దిట్టల కున్కి పట్టగు మదీయ నివాసము
యాచ భూపతీ !

## సమస్యా పూరణములు

యాచమనాయ డుయ్యేలనుండి, 'పరీక్షింపగల ప్రభు విచ్చటనే యున్నాడు. నిలువగల కవి గలడో—

4. ఇది నెల్లూరు మండలమున నున్నది.

సంశయము తీఱవలెను' అని తన వద్దనున్న సమస్యల నొక్కొక్కటి దత్తప్ప కవి కిచ్చి, పూరింపు మనెను. దత్తప్ప కవి వాని నన్నింటి నలవోకగా పూరింప, యాచమనాయ డాశ్చర్యపడియు, పైకి గనబడ నీయక— తన వద్దకు వచ్చు వారికి పరీక్షకై యిచ్చు—

'దోర్గ్రీవ ధేనువు గర్భమందు పులికందుల్ పుట్టె నుగ్రాకృతిన్' అను సమస్య నిచ్చి పూరింపు మనెను. దత్తప్ప కవి తడుముకొనకుండ యిట్లు పూరించెను.

శా. దోర్గ్రీవ శాంత తపోదయా గుణనిధీ
ధూర్ద్దండ పాపాటవీ
దగ్ధక్ష్మా ప్తి నలుండైన కశ్యపున
కుద్యద్గర్వుడై యాగ భు
గ్దోర్గ్రీవశుల్ సుతు లుద్భవించిరి
బిడౌజా వల్లి వీక్షించితే—
దోర్గ్రీవ ధేనువు గర్భమందు పులికందుల్
పుట్టె నుగ్రాకృతిన్.

దీనితో యాచమహీపతి తనకు భంగపాటు కలుగునని తనవద్ద బ్రహ్మాస్త్రముగా నుంచుకొన్న

'గుండ్రాతికి కాళ్లువచ్చి గునగున నడిచెన్' అన్నసమస్య నిచ్చెను—దత్తప్పకవి వెంటనే

క. ఉండ్రా యోరి కులాధమ!
యిండ్రా ప్రాసంబు కవుల కీయం దగునా
అండ్రాను కరుణ చేతను
గుండ్రాతికి కాళ్లువచ్చి గునగున నడిచెన్

పూరించెను. యాచమనాయ డుయ్యేల దిగి, కూర్చుండు డని వేడ, దత్తప్పకవి కోపాటోపముతో—

'తిట్టుదునా?'

అని పద్యము ప్రారంభించగా యాచమనాయడు దత్తప్పకవి రెండు చేతులు పట్టుకొని, 'మీ బోటి కవుల కిది న్యాయము కాదు. క్షమింపుడు' అని విలువ గల చీనాంబరములనిచ్చెను. వానిలో నొకటి తీసికొని యాతని యెదుటనే ముక్కలు ముక్కలుగా చింపి వేయ నారంభించెను. యాచమ నాయడు స్వామీ! అపరాధము. మన్నింపుడని వేడగా దత్తప్పకవి—

క. యాచమనాయని వలువలు
గోచులకే గాక కట్టుకోకల కగునా?
రేచెర్ల గోత్రమందున
నీచుడు జన్మించి కులము నీఱుగఁ జేయున్

అని చెప్పి తాను తీసికొని వచ్చిన పండితునిచూపి, ఈ మహావిద్వాంసుని నవమానించితివి. నీ కిదిశాస్తి. ఈతని సత్కరింపుము. ఇట్టి వికచేయకుము — అని యదలించి—రాజుగారిచ్చిన బహుమతితో తన బహుమతిని ఆ పండితున కిచ్చి పంపివేసెను.[6]

## అడిదము సూరకవి

కళింగదేశమున కవితా శూరుడైన అడిదము సూరకవి విజయనగరాధీశుడైన విజయరామగజపతిని లక్ష్యము సేయలేదు. ఆతని సోదరుని, సీతారామరాజును నెల్లప్పుడు—'ఈరా, తేరా, సీతారామా' అని ఏక వచనము ననే సంబోధించెడి వాడు. సీతారామ రాజే— రాజ్య భారమంతయు వహించిన వాడు కాబట్టి కోపముతో 'మేము రాజులమని నీ వెఱుగవా? రాజులను రాకొట్టుట యేమి' అని ప్రశ్నించినాడు—సూరకవి

క. చిన్నప్పుడు, రతికేళిని
నున్నప్పుడు, కవితలోన, యుద్ధము లోనన్
వన్నె సుమీ రా కొట్టుట
చెన్నుగ నో పూసపాటి సీతారామా?

అని ప్రత్యుత్తర మిచ్చినాడు.

సూరకవి రామలింగేశ శతకము రాజుల దుర్ణయ పాలనమును దుమ్ము ధూళిచేసి కవి గౌరవము నిలువ బెట్టినది—

సీ. మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కడు లేడు
మాన్యముల్ చెఱుప సామంతు లంద

---

5. ఇది 'తెలుగు సమస్యలు' అను గ్రంథమున గలదు. ఇంతవఱకు తెలుగు కవిత్వమున—సమస్యలను గుఱించి పరిశోధన ప్రారంభము కాలేదు. తెలుగు కవితకు పేరు తెచ్చిన శాఖలలో ఆశుకవితా ప్రక్రియ లలో సమస్యా పూరణ మొక్కటి. సమస్యలు కవి సద్యస్ఫూర్తిని పరీక్షించుటకు నికషోపలములు.

6. ఈ మోచర్ల వెంకన్న దత్తప్పకవి వంశీయులే నేడు నెల్లూరిలో అధివక్తలు, మృదు మధుర కవితా విశారదులు నగు శ్రీ మోచర్ల రామ కృష్ణయ్య గారు.

తెండిన యుూళ్ల గొడెటింగింపఁ డెవ్వఁడు
పండిన యుూళ్లెన్న ప్రభువు లంద
రితఁడు పేద యటంచు నెఱింగింపఁ డెవ్వఁడు
కలవారి సిరి యెంచ గలరు చాల
తన యాలి చీకటి తప్పెన్నఁ డెవ్వఁడు
పరకాంత రం కెన్న పెద్ద లందఱు
గీ. రిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు నన వలె గాక దుర్నయు లనంగ
నేమి పని యున్నదిక సత్కవీశ్వరులకు
రామలింగేశ రామచంద్ర పురవాస.

రాజుల సేవకంటె స్వతంత్రముగా జీవించు మనుజుడే ధన్యుడని యీ క్రింది పద్యమున సూచించి నాడు.

సీ. తెలివాట్లు గొట్టి సత్తరువు పెట్టుట కంటె
న్యాయార్జితాన్న మింతైన మేలు—
తోటలు నఱకిన దొడ్డ సొవిడి కంటె
ననఘమై తగు పంచ యరుగు మేలు
బహు ఘాతకుడు పెట్టు పాయసాన్నము కంటె
సద్వర్తనుడు పోయు జావ మేలు
అందఱు జెఱచి వెయ్యాఱు లిచ్చుట కంటె
కష్టార్జితం బొక్క గవ్వ మేలు—
గీ. గర్వపడుదురు తమపాట్లు గాన లేక
ప్రభువుల మటంచు దుర్నయోపాయ పరులు
వారి బొగడంగ మా కుత్సవంబు లేదు రామ.

..............................

సూరకవి దృష్టిలో గంగిరెద్దు మూర్ఖభూకాంతుడు నొకటే—

సీ. కడువింత యగు స్థూల కాయంబు గలుగుట
చిత్రభూషాం బరస్థితిని గనుట
తూర్యనాదంబులతో జనుదెంచుట
వాల వ్యజన సమవాప్తి గనుట
శృంగ వేత్రోద్ధతిఁ జేర రాకుండుట
చూపరుల్ పదుగురు చుట్టికొనుట
స్వ నియంతృవాదంబు విని తలయూచుట
వహౌనముద్ర వహించు మతము గనుట
గీ. గంగిరెద్దుకు మూర్ఖభూ కాంతున కును
భేదమించుక యును గానిపించ దట్టి
ప్రభువు వేడిన సత్కవి పదవి చెడదె రామ॥

ఇంకను పెక్కుపద్యముల ఎత్తుగీతులలో—

'అధిక నిందల కొడిగట్టి యులరు నట్టి
నృపున కీదృశ విభవ సమృద్ధులెల్ల
శవకృతా లంకృతులు గానె చర్చసేయ'

'ఇట్టి ప్రభు దుర్నయపు జేష్ట లెఱుఁగ లేక
వెంబడిం చెడి వాడె పో వెఱ్ఱివాఁడు'

'న్యాయ పద్ధతి నడువని యవని పతికి
నెన్ని వన్నెలు గలిగిన నేమి ఫలము?'

'పీదలను దుష్ప్రభుడు బాధపెట్టుగాని
చేవ గల వారి చెంతకుఁ జేరలేఁడు'

'అనుచుఁ దనదు చరిత్రంబు నవని జనులు
నిందసేయఁగ బ్రదుకు దుర్నీతి నృపుని
వైభవం బౌర యని మెచ్చువాఁడు జడుఁడు'

అని రాజుల గర్హించిన పట్టులు పెక్కు లున్నవి. రాజులు కేవల శూరులైన కవితాశూరుడు సూరకవి.

### కూచిమంచి జగ్గకవి

'అర్ణవ వేష్టితాఖిల మహామహి యందున నేను
బ్రాతులన్ పూర్ణుఁడ'

అని చెప్పుకొన్న జగ్గకవి—'చంద్రరేఖా విలాసము' అను కృతి రచించి చింతలపాటి నీలాద్రిరాజను ప్రభువ కంకిత మీయదలచెను. కాని అస్థాన పండితు డడ్డుపెట్టెను. అందువలన కూచిమంచి కవి కుపితుడై

చంద్రరేఖా విలా(స)మును
చంద్రరేఖా విలా(ప)ముగా మార్చినాడు.

మొదటి పద్యముననే—

శ్రీకంఠుండు (విషకంఠుడు), భుజంగ భూషణుడు (ఫణిహారుడు) భస్మీభూత పంచాస్త్రుడు (మన్మథ దహనుడు)...చింతలపాటి నీలనృపుని నేత్రత్రయిన్ వీక్షించు గాత—అన్నాడు. శివునికి మూడవ కన్ను అగ్ని. ఈ రీతిగా కృత్యాది నడచినది.

జగ్గకవి యీ విధముగా, తన భర్తయైన నీలాద్రిరాజును గూర్చి కవిత్వము చెప్పెనని, రాజు

భార్య నరసాంబ వినెను. కవి వాక్కు అమోఘమని, తన పతికి చావు తప్పదని ఆమె గ్రహించినది. జగ్గ కవిని పిలిపించి, ఒక తెర వెనుక తాను నిలువ బడి, తన యొంటిమీద నున్న నగలన్నియు నింపిన వెండి పళ్లెరమును స్వహస్తములతో నందించి—

'నా భర్తకు ప్రాణదానము చేయుడు' అని వేడు కొన్నది.

జగ్గకవి

క. ఖలుఁడైన నీల నరపతి
ఇలలో నిన్నాళ్లు బ్రదుకు నే నరసాంబా!
గళ భూషణమగు నీ మం
గళ సూత్ర ఫలంబు మహిమ గాదె కుమారీ!

అని ఆశీర్వదించి నాడు. ఈ జగ్గ కవి 'బేబదల్' బిరుదాంకితుడు. బేబదల్ అనగా బదులు లేనివాడు, సాటి లేనివాడు అని అర్థము.

## వికిృఁరాల రంగాచార్యకవి

తెలుగున రాజ దూషణ పరాకాష్ఠనందిన రచనలలో వికిృఁరాల రంగాచార్య కృతమైన శార్దూల శతకము ప్రధానమైనది. అంతేకాదు, ఆధునిక యుగమున—పూర్వులు నిరూపించిన కవితా శక్తిని ప్రత్యక్షీకరించినది.

ఈ రంగాచార్యకవి దగ్గొలు గ్రామ మాన్యములను, శిస్తుబకాయి క్రింద ఆ నాటి వేంకటగిరి ప్రభువులు— వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్రుల వారు స్వాధీనము చేసికొనిరి. అందువలన తన భార్యా పుత్రులతో అష్టకష్టములకు లోనై, పసిపిల్లలకు పట్టెడన్నం పెట్టలేని స్థితిని పొంది మిక్కుటమైన ఆక్రోశము మూలమున నీ శార్దూల శతకము రచించినాడు.

శార్దూల శతకమను పేరుకు తగినట్లిందలి పద్యము లన్నియు శార్దూల వృత్తములే—ఈ నూఱు పద్యముల యందును ప్రథమ పాదమున—ఆరింట తకారముంచి రచించి నాడు. మచ్చునకు రెండుదాహరించు చున్నాను.

కాలాకంఠ గతాసువుల్ చన హతున్
గావింపవే రాజ గో
పాలున్ వెంకటగిర్య ధీశ్వరుని విప్ర
క్ష్మాత్ర బాధాకరున్
శూలి ద్రవ్య హరున్ సమాదృత
మహా శుంఠాప్త వేగంబ శా
ర్దూలాకారముఁదాల్చి సాధు జన
సంతోషంబు వర్ధిల్లఁగాన్

ఇందు 'కాలా కంఠ గతా' అనుచోట — 'త' కార మూఱవ యక్షరము.

ముక్కంటీ జగతీ సురోత్తముల భూముల్
రాజ గోపాలుండు
చొక్కం దుర్వి ధవుండు బల్మిగొని
గర్వోద్రిక్తుడై యున్నవాఁ
డక్కుంకన్ పటుదంష్ట్రికా ఖర నఖంబైనట్టి
శార్దూలమై
యక్కుంజీల్చి వధింపు సాధుజన
చిత్తాం భోజముల్ విప్పఁగాన్

ఇందు 'ముక్కంటీ జగతీ' అనుచోట తకార మాఱవ యక్షరము.

ఆఱవ యక్షరము తకారముంచి చెప్పిన—నా పద్యమునకు సంబంధించిన వ్యక్తి మరణము నొందును.

తే. వ్యంజనా హ్వయమై యొప్పు వ్రాల లోన
షోడశాక్షర మాఱవ చోట నిలిపి
మచ్చరం బున దను జంప వచ్చినట్టి
చెడుగునకు నైనఁ బద్యంబు నుడువ వలదు.
(అప్పకవీయము 2—369)

రంగాచార్యకవి నూఱుపద్యముల నిట్లు రచించిన వెనుక మఱికొన్నాళ్లకు రాజాగారు వేటకేగి, శార్దూలము—పులివాతబడి చనిపోయిరి. ఈ శతకమును వారిళ్లవారు ముద్రించిరి. ఈ కాలము వారి యభిప్రాయము లెట్లున్నను మన ఛందశ్శాస్త్రజ్ఞులు చెప్పిన విషయములన్నియు సత్యములే యని శార్దూల శతకము నిరూపించు చున్నది.

## ఆధునిక యుగము

ఆధునిక యుగమున నాంగ్ల పాలనలో—

'స్వాతంత్ర్య పథక ప్రథమ ప్రవర్తకుడు కొక్కొండ వేంకటరత్నము పంతులు.'

ఈ యుగమున నవ్యతకు ప్రగతికి వీరేశలింగము మూలపురుషు డనియు వేంకటరత్నము పంతులు ప్రాచీనతకు ఛాందసత్వమునకు ప్రతీక మనియు నీనాటి విమర్శల, వాఙ్మయ చరిత్రకారుల యభిప్రాయము. కాని యిది యెంత మాత్రము సరికాదు. ఇది నవ్యాంధ్ర సాహిత్య పరిణామ చరిత్రకు విరుద్ధము.

కందుకూరి సమకాలీనులలో ప్రసిద్ధుడగు 7కొక్కొండ జీవితమును తెలిసికొని, ఆయన గ్రంథములను, కూలంకషముగా వ్యాసంగము చేసినయెడల, వేంకటరత్నము పంతులు నవయుగ ప్రథమ ప్రవర్తకుడే గాక—నవ్యాంధ్ర సాహిత్య జగత్తులో స్వాతంత్ర్య ప్రథమ ప్రవర్తకుడు నని నిర్వివాదముగా నిరూపింప వచ్చును.

ప్రస్తుత మీ వ్యాసమున—స్వాతంత్ర్య పథక చరిత్ర—ప్రధానము గావున—ఆయన—

(1) రాజకీయ స్వాతంత్ర్యము.

(2) మత స్వాతంత్ర్యము.

(3) భాషా స్వాతంత్ర్యము.

నెట్లు ప్రవర్తింప చేసినాడో— ఆ విషయము వివరింప బడును. ఇది నవ్యాంధ్ర వాఙ్మయ చరిత్రకు నూతనము.

## (1) రాజకీయ స్వాతంత్ర్యము

ఆంగ్ల ప్రభుత్వము వారి కొలువు చేయుచు, 'మీ కత్యంత వినయ విధేయుడైన సేవకుడు (Your most obedient servant) అన్న దాస్య భావము తాండవించుచున్న దినములలో తన వృత్తి యందు వ్యక్తి స్వాతంత్ర్యమును ప్రదర్శించిన ధీరుడు వేంకటరత్నము పంతులు. ఆయన కొంతకాలము భూమి కొలతశాఖ (Survey Department) యందు గణకుడు (Computor) గా నుండెడివాడు. ఆ వెనుక ఇనాము నిర్ణయాధికారి కార్యాలయమున (Inam Commissioner's Office) గుమాస్తాగా పనిచేసినాడు. అధికారులను ఘనులగు మీరు (your honour) అని సంబోధించెడి వాడు కాడు. స్వతంత్ర భావముతో అంటియు అంటనట్లుండెడి వాడు. ఆంగ్ల దొరతనము వారి కొలువు—'శ్వవృత్తి' అనగా నీచవృత్తి క్రింద పరిగణించి నాడు. తనకు నియతమైన పనిని సరిగా నిర్వర్తించుటచే అధికారులేమియు చేయజాలక పోయిరి.

'చ. సుఖముగ తిండి నిద్దురలు చొప్పడ
వయ్యె శ్వవృత్తి నత్తఱిన్
సఖుడు గురుండు లేడట ప్రసక్తియొ
జీవన మందె నెమ్మిన
మ్ముఖమున గ్రంథముల్గనఁగ ముఖ్యము
లైనవి యేమి గానరా
వఖిల నుతంబు గం గృతి నహా!
రచియింపఁ దరంబె లేవడిన్

(బిల్వేశ్వరీయము—ప్రథమ బింబము 102 ప.)

'నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము ఆత్మకింపయిన భోజనముయ్యెల మంచము'తో కలిమిగల కవి భావన మాత్రమే మన మెఱుగుదుము. లేమి గల కవి భావన పై పద్యము వ్యక్తీకరించును.

### హూణ భాష

మదరాసు రాజధాని కళాశాలా పండితుడైన వెనుక తన స్వాతంత్ర్యమును హెచ్చుగా ప్రకటించుటకు తగిన యవకాశము లభించినది. ఇంగ్లీషు భాష అనుపదములో నాంగ్లపదముండుటచే, ఆయన 'హూణ భాష'యని వ్యవహరించి నాడు. ఇంగ్లీషు భాషకు పర్యాయ పదముగా, 'హూణభాష' అన్న పదమును వ్యాప్తికి దెచ్చినది ఆయనే. ఆ పదము క్రీ. శ. 1889 నాటికే—కవి ప్రయోగమున కెక్కినది.

---

7. స్వర్గీయులైన శ్రీ శంభుప్రసాదు గారి యాదేశాను సారముగా నిప్పటి కిరువది రెండేండ్ల క్రిందట—భారతి 1951 జూను నుండి సెప్టెంబరు నాలుగు సంచికలలో, కొక్కొండ వారి జీవిత చరిత్రను సంగ్రహముగా తెలిపితిని. అందు వారి జీవితమున ముఖ్య ఘట్టముల నన్నింటిని పేర్కొంటిని. కీర్తిశేషులైన వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు వేంకటరత్నము పంతులు గారి ఛాయాచిత్రమును, మదరాసు రాజధాని కళాశాల యందు కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణ రావు గారిచేత—ఆవిష్కరింప జేసిన సందర్భమున నివి రచియింప బడినవి.

సీ. ప. హూణభాషనుఁ జందనోలి వమాన్యాలును
ప్రభువులు మెచ్చంగఁ బ్రబలఁజేసె' అని,

'హూణభాషాదులఁ జెలంగుచుండువాఁడు' అనియు గోపాలకృష్ణ శతకమున ప్రయుక్తమైనది.

'లాతి పనుల్ త్యజించి సకలంబు
కవిత్వము గాఁ దలంచి భూ
నేతల ప్రాపు గాంచిన ప్రణేతలు
వారల శక్తి యబ్రమే
ఈతఁడొ 'హూణభాష' పఠియించి
పరీక్షల నిచ్చి కొల్వులో
బ్రాతిగ నుండియున్ రచన వారలతో
సముడయ్యె నియ్యెడన్'

వావిలికొలను సుబ్బారావు గారికి సమర్పించిన గజమాల
(అముద్రిత గ్రంథ చింతామణి — జనవరి 1894.)

ఆ పత్రికలోనే—'ఈమె (విక్టోరియా రాణి) బాల్యయౌవన కౌమారాది ప్రతిబింబములో ముద్రింప బడిన గ్రంథములు 'హూణభాష'లో నున్నవి—అని కలదు. క్రీ. శ. 1948 నాటికి గూడ హూణ భాషా పదము ప్రయోగములం దున్నది :

ఉ. ఆయత సంస్కృతాంధ్ర కవితాంచిత
ప్రాకృత హూణ వైదుషీ
ధ్యేయుని న్యాయశాస్త్ర సము
దీర్ణుఁ గళాలయమూర్తియైన సాం
ఖ్యాయన శర్మనుం దలతు... ..

(క్రీ. శే. నందిరాజు చలపతిరావు—మంగళగిరి మాహాత్మ్యము ) అవతారిక.

## నల్లవారు - తెల్లవారు

ఆ కాలమున నాంగ్ల పాలకులు హైందవులను నల్లవారు (Black men) అనెడివారు—వారి దృష్టిలో సృష్టిలో వారే తప్ప తెల్లవారెవ్వరు లేరని—యభి ప్రాయము. ప్రజలనే గాక—వారు నివసించు భాగమును నల్ల నగరము (Black Town) అనెడివారు.[9] ఇంకొక చిత్రము. భారతదేశము నుండి ఇంగ లండు వెళ్ళిన వారి నందఱను, నల్లవారనియే యనెడు వారు—భారత పితా మహుడు దాదాభాయి నౌరోజీ బ్రిటిషు పార్లమెంటులో మొదటి భారతీయ సభ్యుడు—ఆతడు పార్సీ జాతివాడు—పార్సీ లందఱు—పాశ్చాత్యులవలె తెల్లవారే—అయినను, హిందూదేశమునుండి వచ్చిన కారణమున—ఆయనను—'The Black member'—అనెడు వారు. భారతీయులన్న నెట్టి ఏహ్య భావనయో దీనివలన తెలియ నగును.

కొక్కొండ, నల్లవారు అన్న పదమునకు ప్రతిగా 'తెల్లవారు' అను తెలుగు పదమే కాక, 'శ్వేతముఖులు' 'అర్జునాస్యులు' 'హూణులు', 'మ్లేచ్ఛులు'—అన్న సంస్కృత పదములు బాహాటముగా వాడెడి వారు.[10]

పై వానిలో 'తెల్లవారు' అనుపదమే వ్యాప్తి లోనికి వచ్చినది. చిలకమర్తి వారి ప్రసిద్ధ పద్యము లోనిది ప్రయుక్తము.

'భరత ఖండంబు చక్కని పాడి యావు
హిందువులు లేగదూడలై యేడ్చు చుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకు చున్నారు మూతులు బిగియగట్టి'
(1907)

---

8. ఇది కర్నూలు నరహరి రాజామణి సెట్టి కృతము. ఈ గోపాలకృష్ణ శతకము దైవపరము గాదు. తనతండ్రియైన గోపాలకృష్ణమ సెటి చరిత్ర. ఈతడే-'శ్రీ రంగరాజ చరిత్ర' అను నవల రచించెను. చిన్నయ సూరికి, హిందూ ధర్మశాస్త్ర సంగ్రహ రచనలో తోడ్పడెను. ఆ కాలమం దున్నత ప్రభుత్వోద్యోగి.

9. చెన్నపురిలో నేడు—జార్జి టవును (George Town) అనునది మొదట 'Black Town' అను పేరితోనే యుండెడిది. క్రీ. శ. 1905లో పంచమ జార్జి చక్రవర్తి యువరాజుగా మదరాసు దర్శించి నపుడు—Black Town అను పేరు మార్చి—George Town అని నామకరణము చేసినారు.

10. 'పిన్నపు వేల్పు' నా బరగు శ్వేతముఖాధిపు
రాక పాకు చేతన్
'మఱియుఁ దదర్జునాస్య నృపమాన్య
సమాగమ సచ్చరిత్రమున్.'
బిల్వేశ్వరీయము—ప్రథమ బింబము.

ఈ పదము నేటికిని ప్రచారములో నున్నది. 'తెలుగు నేర్చిన తెల్లవారు' అను వ్యాసములు[11]

ఈ నాటికి తెల్లనారు తెల్లనారినారు.

"నిష్ప్రభు రాజ్యము"

ఈ ప్రయోగము కొక్కొండవారి స్వాతంత్ర్యమునకు పతాక. అది విక్టోరియా మహారాజ్ఞి సువర్ణోత్సవ కాలము. (1887.) ఆ సంవత్సరమున కొక్కొండవారు తమ బిల్వేశ్వరీయ మహాకావ్యమును వ్రాసినారు. భారతదేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యముగా, రాజులై, ఆంగ్లపరిపాలకు లేలుచున్నప్పుడా గ్రంథమున వారు ప్రభుత్వమునుగూర్చి యెట్లు వ్రాసిరో చూడుడు—

మ. కవి రత్నంబులు మున్ను పన్నుగఁ
గృతులొగ్గనించి రెన్నేని యున్
కవికల్ప ద్రుములైన సత్ప్రభువు
లుండం బట్టి వారొప్పి రి
ష్టవనిన్ 'నిష్ప్రభు రాజ్య'మందు

కృతి చేయం జాలె నంచెంచి యి
క్కవి రత్నంబును గారవింప వలయున్
కారుణ్య మింపొందగన్—

(బిల్వేశ్వరీయము, ప్రథమ బింబము 164 ప.)

ఆంగ్లధ్వజము [12]ఫోర్టుసెంటు జార్జికోటపై నెగురుచుండగా ఆ శ్రేణిలోనే — సమీపమున నున్న ప్రభుత్వ రాజధానీ కళాశాలలో పండితుడై యుండి, యిట్లు నిర్భయముగా వ్రాయుట కెంత స్వాతంత్ర్య భావవ యుండవలెనో యూహింప నగును.

ఆంగ్ల పరిపాలన కాలములో నాంధ్ర సాహిత్య ప్రపంచమున-ప్రభుత్వము నింత 'ధీమా'తో నిరసింప సాహసించిన పండితుడూ లేడు. ఆంగ్ల ప్రభుత్వము నింత అలక్ష్యము చేసిన కవీ లేడు.

వీరేశలింగము - వేంకటరత్నము

వేంకటరత్నము పంతుల సమకాలీనుడైన వీరేశలింగము జీవితమే పై విషయమును విశదీకరించును. వీరేశలింగము ప్రభుత్వ కళాశాలలలో పండితుడే. అయిననేమి? అత డాంగ్లేయాధికారుల యనుయాయియై, వారి ప్రాపకము వలన—విద్యాశాఖలో విశ్వవిద్యాలయములో, పలుకుబడి సంపాదించి, తుదకు—రావుబహద్దరు బిరుదము నంది నాడు. ఇంత పారతంత్ర్య భావన గల వీరేశలింగము, మనకు స్వాతంత్ర్యము రాగానే—నవ్యయుగపురుషుడైనాడు. అతని చరిత్ర ఖండాంతరముల కెక్కినది.[13] వీరేశలింగమును గూర్చి యింత వఱకు వెలువడిన ఏ చరిత్రలలో గాని విమర్శనము లందు గాని— సమకాలికులలో నింతటి స్వాతంత్ర్యము ప్రదర్శించిన—సాహితీవేత్త ప్రసక్తియే కానరాదు. ఈ విషయమును గూర్చి తరువాత ప్రస్తావింతును—

నిష్ప్రభు రాజ్యము
రాజకీయ విచారణ

బిల్వేశ్వరీయమునకు ఆ కాలమున ప్రసిద్ధ [14]జాతీయ నాయకులు, సాహిత్య పోషకులు, విద్యావినోది పనప్పాకము ఆనందాచార్యుల వా రాంగ్లేయ భాషలో చిన్న పీఠికలో నిట్లు పంతులుగారిని గూర్చి వ్రాసినారు.

PREFACE.

Of Kokkonda Venkataratnam Pantulu Garu—the author of the work printed in the following pages- I shall have said all that one need by stating that he may be apply likened to Dr. J. Samuel Johnson, the literary dictator of the day.

---

11. వ్యాసకర్తలు డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మగారు. చూ. తెనుగు నిందు. ఈ పేరున కొన్ని భారతిలో ప్రకటితములు.

12. మదరాసున నా రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యాలయము లన్నియు నిందున్నవి. ఇంగ్లీషువారు హిందూదేశమున కట్టిన మొట్టమొదటి కోట యిదే. ఆంగ్లరాజ్య సంస్థాపకుడగు రాబర్టు క్లైవునకు వివాహ మీ కోటలో జరిగినది.

13. కేంద్ర సాహిత్య అకాడమీ వా రాంగ్ల భాషలో-నార్లవారిచే రచితమైన వీరేశలింగముకు గూర్చి గ్రంథము ప్రకటించినారు. ఆంగ్లమున నుండుట వలన అది అమెరికాలో వ్యాప్తమైనది.

14. వీరు క్రీ. శ. 1894 లో తొమ్మిదవ దేశీయ మహాసభ కధ్యక్షులైన వారు—

A Profound and Critical Scholar in Sanskrit & Telugu alike, and an ordent student of literatures in both these languages, he unites in himself, the indispensable requisites for eminent Scholarship in Telugu." (1893.)

### సాహిత్య నియంత

పై వాక్యములలో—Literary Dictator అను మాట గమనింప దగినవి. ఆంగ్ల భాషలో జాన్సను వలె—తెలుగున తన జీవితకాలమున క్రీ. శ. 1915 వఱకును—కొక్కొండయే సాహిత్య నియంత[15] — ఇది యావదాంధ్ర దేశ మంగీకరించినదే. గిడుగు వారే క్రీ. శ. 1920 లో, 'తమ కాలమున తమంతటి పండితు లింకొకరు లేరని' అనిపించుకొన్నవారు అని ప్రకటించి నారు.

### రాజకీయ విచారణ

ఈ గ్రంథము ముద్రితమై దేశమందంతట వ్యాప్తమైనను, తక్కినవా రెవ్వరును నీ 'నిష్ప్రభు రాజ్య' ప్రయోగ విషయమై పట్టించుకొన లేదు. కాని ప్రభుత్వ—గ్రంథ లేఖ్యా రూఢాధికారి (Registrar of Books).[16] ఈ గ్రంథమున 'నిష్ప్రభు రాజ్య', మన్నది రాజద్రోహము క్రింద పరిగణితమైనది కావున ప్రభుత్వమువారు చర్య తీసికొనవలెను—మీరేమందురు' అని పీఠికా కర్తలైన వనప్పాకము ఆనందాచార్యుల వారికి, వ్రాసినారు. వారు—'నేను పీఠిక వ్రాయుటయే గాదు' గ్రంథమును ముద్రించిన వాడను నేనే.' అందలి నిష్ప్రభు రాజ్య విషయమై మీరు గ్రంథకర్తలకే వ్రాసి కనుగొనుడు' అని బదులు చెప్పినారు.

గ్రంథలేఖ్యారూఢాధికారి వేంకటరత్నము పంతులు గారిని పిలిపించి, ఈ క్రింది విధముగా ప్రశ్నించినాడు—

అధి—మీరు దొరతనమువారి కొలువు చేయుచు, వారిచే నియమితులై వారి సేవకులైయుండియు, నిష్ప్రభు రాజ్యమని మీ గ్రంథమున వ్రాయుటచే, అది రాజద్రోహముక్రింద పరిగణితమైనది కావున తగుచర్య తీసికొందురు.

వేంక : నేను దొరతనమువారిచే పండితుడనుగా నియమింప బడలేదు. వారు నన్నాహ్వానింపగా నా పండిత పదవిని గైకొంటిని. కాయికమైన వృత్తిచేసెడు వాడు సేవకుడు. నాది వాచికమైన వృత్తి, నేను సేవకుడ నెట్లగుదును? ప్రభుత్వముచే నియమితులైన భాషా పండితులందఱు సేవకులేనా? అట్టిది నాకు వర్తింపదు.

అధి : ఎట్లయిన మీరు ప్రభుత్వోద్యోగము నిర్వహించు వారు. ప్రభుత్వ కళాశాలా పండితులు గదా. వారిచే మీరు పోషితు లగు నప్పుడు నిష్ప్రభు రాజ్యమన వచ్చునా?

వేంక : ఆంగ్ల ప్రభుత్వమువారు దేశమునకు మాత్రమే పాలకులుగాని భాషకు పాలకులా? రాజ్యాంగమున గాని విద్యా విధానమున గాని తెలుగు భాష లేనే లేదే. దేశమునకే గాని భాషకు వారధికారులు కానప్పుడు, నేను వ్రాసినది రాజద్రోహ మెట్లగును? చర్య తీసికొనుటకు వారికేమి యధికారము గలదు?

ఈ ప్రత్యుత్తరముతో అధికారి నిరుత్తరుడై నాడు. ఉద్యోగరీత్యా పంపిన యుత్తరువు రద్దుచేసి ఆనందాచార్యుల వారికి తెలిపి నాడు.

ప్రభుత్వము కొలువులో నుండియు తన మాతృ భాషను గూర్చి ఇంత 'ధీమాగా' అధికారులకు లొంబడక తన వ్యక్తి స్వాతంత్ర్యము— ప్రకటించిన—మఱియొక పండితు డింత వఱకు లేడు.

---

15. నా చిన్నయసూరి జీవితమున — పై వాక్యము ననుసరించి—చిన్నయసూరి 'ఆనాటి సాహిత్య ప్రపంచమున నియంతయైన మహారథుడు' అని వ్రాయగా (పుట 11). శ్రీ ఆరుద్ర— 'నియంత' అనగానే రాజకీయ నియంత—అను భావముతో 'సాహిత్య స్టాలిన్' అని విమర్శించినాడు. నియంతకు ముందు 'సాహిత్య ప్రపంచము' అన్న మాట గుర్తించ లేదు.

16. ఆ కాలమున ప్రభుత్వమువారి ఆంధ్ర భాషాంతరీకరణ కర్తయు, (Telugu Translator to the Government) గ్రంథలేఖ్య రూఢాధికారియు నొక్కడే—

రాజధానీ కళాశాల పండితపదవి

'రాజధానీ కళాశాలా పండితుడనుగా, నేనాహ్వా నింపబడితిని గాని నియమింపబడలేదు' అని కొక్కొండ చెప్పిన మాట చారిత్రక సత్యము—ఆ కాలమున రాజధానీ కళాశాలా పండితు లందఱు ఆహ్వానింప బడిన వారే గాని అధికార పూర్వకముగా నియమితులు గారు. ఆ పదవి ఖాళీయైనప్పుడు—దేశమునకు తెలిపి, ప్రాచ్య పాశ్చాత్య విద్యావేత్తలైన వారి సమక్షమున పండిత సభ జరిపి, ఆ పండిత సభలో ఏకగ్రీవముగా నెన్నుకొనబడిన వారికే ఆ పదవి నిచ్చెడి వారు. ఆ పదవికి వచ్చునాటి కా పండితునకు ఆంగ్లభాషలో మంచి ప్రవేశ ముండి తీరవలెను.[17] పరవస్తు చిన్నయ సూరి—కరాలపాటి రంగయ్య – కొక్కొండ వేంకటరత్నము, వావిలికొలను సుబ్బారావు, అక్కిరాజు ఉమాకాంతము వీరందఱు పై రీతిగా నా పండిత పదవి నలంకరించిన వారే.

వీరేశలింగము రాజధానీ కళాశాలా పండితుడే—అయినను—ఆయన—ప్రభుత్వము వారి సహాయమున రాజమహేంద్రవరమునుండి, మదరాసు రాజధానీ కళాశాలకువచ్చిన వాడే గాని పాండిత్య ప్రతిభచేత గాదు—ఆయన కావ్య పాఠములు చెప్పలేదన్న విషయము, ఆయన శిష్యవర్గమే గ్రంథస్థము చేసినారు[18].

ఉమాకాంత విద్యాశేఖరు లుపకార వేతనము పొందిన వెనుక రాజధాని కళాశాలా తెలుగుశాఖ గౌరవ ప్రతిష్ఠ లంతరించినవి.[19]

రాజకీయ స్వాతంత్ర్యమున వేంకటరత్నము పంతులెక్కడ? వీరేశలింగమెక్కడ?

ఇక, మతస్వాతంత్ర్యము నకు తరలుదము.

(సశేషం)

---

17. చూడుడు. నా చిన్నయ సూరి జీవితము పుటలు 26–30.

18. చిలకమర్తి లక్ష్మీనరసింహము స్వీయ చరిత్ర—పుట 57.

19. పూర్వోక్త భారతి వ్యాసములు సెప్టెంబరు –1951.



# నిప్పుల కోట

## డా. తంగిరాల

[1-11-1972 న ఝాన్సీ నగరంలోని వీరనారి లక్ష్మీబాయి కోటను చూచి]

గాలిలో వీరగాథల ఘుమ ఘుమలు
ఎండలో శౌర్య జ్వాలల భగ భగలు
ఊరి నట్ట నడుమ పట్టుదల గడ్డకట్టిన పాత కోట
పౌరుషం పోగుపడ్డ నిప్పుల మేట
పగవానికి తలవంచని గుండె నిబ్బరపు బురుజుల నీడలు
పోటు మానిసుల కండల బండలు పేర్చిన ఎత్తైన కోట గోడలు
భారతీయుల ఓరిమిని చాటే లోతైన అగడ్త
పారతంత్ర్యానికి ఎదురు తిరిగిన వీరులకు శాశ్వతమైన పొగడ్త
కాలం వెనక్కి వెనక్కి నడిచి 1857 కళ్లకు కడుతోంది
అలనాటి వీరనారి తలపుల్లో మెరసి గగుర్పాటు పుడుతోంది

అసిని దూసి చేతబట్టుకొని
పసిబిడ్డను నడ్డికి కట్టుకొని
ప్రచండ చండియై గర్జించి
పంచకల్యాణి నెక్కిన రాణి—
నిప్పులకోట బయట
నెత్తుటి మడుగు మధ్య
కత్తుల కెరటాల మీద
కల్హారం లా ఊగుతోంది............

ఝాన్సీరాణి విగ్రహం మీద నా చూపులు వాలగా
నరాల వీణ ఉత్సాహ రాగాలు పాడుతోంది
నా రక్తం వీరరస కల్లోలినియై ఆడుతోంది
మెదడు ఊహల కటారులు దూస్తోంది
మేను రోమాంచితాల కైజారులు తీస్తోంది.........

నాటి నారీమణి శౌర్యం
నేటి ఝాన్సీ నగరాన్ని ఎర్రశాలువలా కప్పివేసింది
కోట గోడల్లో ఎర్రటి ఇటుకల పెట్టెలుగా
వీటి వాడల్లో రెడ్ యాపిల్స్ గుట్టలుగా

చెట్ల కొమ్మల్లో చిక్కుకున్న సూర్యబింబపు గాలి పటంలా
చిట్లిన కాబూలు దానిమ్మల్లో తాంబూలపు నవ్వుల జిమ్మేడి గింజల కెంపులుగా

నేలలో,
గాలిలో,
నీలి నింగిలో,
నెలతల నిలువు పాపిట్లో—
ఎర్ర మన్నుగా,
కెంధూళిగా,
సంజ కెంజాయగా,
చిక్కని సిందూరంలా,
లక్ష్మీబాయి శౌర్యం లక్ష విధాలుగా కనిపిస్తోంది.........

వీధుల్లో టాంగా లాగే ముసలి గుర్రం
గర్వంతో విర్ర వీగుతూ పరుగెడుతోంది
లీలగా తూగుతూ హేలగా అడుగిడుతోంది
ఆ అగ్గిరాణిని వీపు మీద ఎక్కించుకొని
అమాంతంగా కోట గోడ దూకి
శత్రువుల నుగ్గాడింది తానే అంటోంది.........

ప్రతి యువతి ముఖంలోనూ
రాజ్ఞీమతల్లి నవ్వుతోంది —
అలకల ఇరులలో వెలిగే తిలకపు నెలరాజులా
పదును చూపుల్లో గుచ్చుకొనే పచ్చల పిడి బాకుల్లా
కనుపాపల చుట్టూ అల్లుకున్న ఎర్రజీరల పగడపు తీగల్లా
వీరనారీమణి వింతగా నవ్వుతోంది.........

వంటింట్లో వనితలు చేతపట్టిన గరిటె
కరవాలంలా కనిపిస్తోంది
కాలసర్పంలా జడిపిస్తోంది
ప్రతి బాలుని ముఖంలో దత్తపుత్రుని ధైర్యం
చిఱుత కూకటియై మురిపిస్తోంది......

ఈనాడు ఎత్తైన కోట బురుజుమీద మురిసిపడే మువ్వన్నె జెండా
ఆనాడు ఝాన్సీలక్ష్మి కన్న స్వప్నాన్ని బుజువు చేస్తోంది...
పోరాటాల మంటలతో పొగ చూరిన ఆకాశం
'సత్యమే జయతే' అంటూ చరిత్రల పాంచజన్యం పూరిస్తోంది.....

# తరతరాల కథ

శ్రీ గరికపాటి కృష్ణమూర్తి

జానకమ్మ కెవ్వున కేకవేసి కూర్చుంది. రాజశేఖరం కంగారుగా లేచాడు. లైటు వేశాడు. జానకమ్మకు ముచ్చెమటలు పోసినవి. కొంచెం వణకుతున్నట్లు కన్పించింది. ముఖంలో భయం గోచరిస్తుంది.

'ఏమిటి జానకీ? ఏమిటి?' కంగారుగా దగ్గర కెళ్లి అడిగాడు.

'ఏమీ లేదు లెండి. కంగారునుంచి కొంచెం తేరుకొన్నది. చెంగుతో ముఖం తుడుచుకొన్నది. కాని ముఖంలో ఆదుర్దా, బాధా భయాందోళనలు కన్పిస్తునే ఉన్నయ్.

'ఏమిటి జానకి? ఏమైంది?' మళ్లీ అడిగాడు.

'ఏమీ లేదండి...ఏమిటో పాడుకల వచ్చింది. రేపు అబ్బాయి దగ్గరకు పోదామండి.'

'ఓస్...ఇదేనా...పేద్ద కంగారు పెట్టేశావు పో' ఎంతో బరువు దింపిన వాడిలా అన్నాడు. మంచినీళ్లు తాగాడు. తీరిగ్గా సిగరెట్టు అంటించి 'ఇంతకి ఏమిటేమిటి ఆ కల'? మంచంమీద పద్మాసీనుడై అడిగాడు.

జానకమ్మకు ఆయన వరసేమీ బాగాలేదు. తనకింకా గుండెదడ తగ్గలేదు. వణుకు వదలలేదు. ఆ పీడ కల బాపతు ఛాయలు పోలేదు. తన్ను ఓదార్చాల్సిందిపోయి మంచంమీద కూర్చుని చిదానందంగా అడుగుతున్నారు. ఏం మనిషమ్మా!

'ఏం? ఇంకా కంగారు వదల్లేదేమిటి?' మళ్లీ ప్రశ్న.

'పోతుంది లెండి' విది లించింది.

'అయినా కన్నకడుపుకోత మొగాళ్లకేం తెలుస్తుంది'?

'ఆ ఎత్తిపొడుపులకేం గాని కలలో అబ్బాయికేం జరిగిందేమిటి?'

ఈ ఊరడింపుకు కొంత శాంతిల్లింది.

'ఏమోనండి. రేపు యేది యేమైనా అబ్బాయిని చూడాలండి.'

'సరే వెళ్దాం'

'రాజశేఖరానికి జానకమ్మచేత విలా చెప్పించాలో తెల్సు.

'బిడ్డ ఎలా ఉన్నాడో యేమో!' మళ్లీ కొడుకు ఆలోచనలో పడింది.

కొడుకు వందమైళ్ల దూరంలో ఉద్యోగం చేసుకుంటున్నాడు. ఒక్కగా నొక్క కొడుకు. ఎంతో గారాబంగా పెంచింది. పెద్దచదువు చదివాడు. చకచకా అన్నీ ప్యాసవుతూ వృద్ధిలోకి వచ్చాడు. చదువుతో బాటు వయస్సులోనూ పెద్దవాడయ్యాడు. కాని అంతవాడయినా 'అమ్మా అమ్మా' అంటూ చెంగు పట్టుకు తిరిగేవాడు. ఆఖరకి పిల్లని చూడటానికి వెళ్లినపుడు కూడ పిల్ల తనకి నచ్చినా' అమ్మా నీకు నచ్చితే నాకు నచ్చినట్లే నన్నాడు. వాడు మనసుపడ్డ పిల్లనే యిచ్చి వైభవంగా పెళ్లి జరిపించారు. పెళ్లయిన నెలరోజులకే ఉద్యోగమయింది. పెళ్లాన్ని తీసుకొని పట్నంలో కాపరం పెట్టాడు. కొత్త కాపరం గదాని తనుకూడ ఒక నెలరోజులుండి వచ్చింది.

'అయితే రేపు యే బండికి వెళ్దామంటావు?' నిశ్శబ్దాన్ని చీల్చాడు రాజశేఖరం.

'రేపు ఎక్స్ప్రెస్‌కి వెళ్దామండి. ఉదయం బండి అదేగా'

'ఇంతకీ ఏం జరిగింది.'

'ఏం జరిగిందేమిటండీ...అలా కన్నుమూశానో లేదో వాడు కళ్లముందున్నాడు. ఇంతలోకే యీ పాడుకల వచ్చింది...నేనూ, అబ్బాయి కోడలు సినిమాకని బయలుదేరామట. అబ్బాయేమో రెండు రిక్షా

తెప్పిస్తా నన్నాడు. కోడలు పిల్లేమో, 'ఎందుకండి. హాలు దగ్గరే కదా! సరదాగా నడచిపోదామన్నది. మనవాడు సరే నన్నాడు.'

'ఊఁ!

'ఊఁ! ఏమిటండి. అసలు దానివలనే జరిగింది యిదంతా. ఏదో నా దగ్గర పొదుపు చేస్తున్నామని మెహర్బాణి పోవటం కోసమని సరదా అని వంక బెట్టింది. అయినా దాన్ననాల్సిన పనేముంది. మన వాడు గంగి గోవైపోయి సరే అన్నాడు. ఏమిటో పిచ్చాడైపోయాడు. అది ఎంత చెప్తే అంత' నిట్టూర్చింది.

ప్రభంజనం అటు తిరిగిపోతుందని పసిగట్టాడు రాజశేఖరం.

'అలా హాలువరకూ నడచి వెళ్లారన్నమాట.' అన్నాడు. 'అబ్బే...అలా కొంతదూరం నడిచామా... కోడలు పిల్ల అలా వాడి వెనకాల నడవాల్సింది పోయి వాడి ప్రక్క ప్రక్కన నడవటం మొదలెట్టింది. ఇంతలోకే ఎదురుగుండా ఒక మోటారు సైకిలు రంయ్ మంటూ వస్తోంది. దాన్ని తప్పుకొంటానికి యీవిడ గారు యింకోవైపుకు వెళ్లింది. ఇంతలోకే వెనుక నుండి మరో కారు రంయ్‌మంటూ వచ్చేస్తుంది. ఆవిడగారు కారుమోత విన్పించుకో లేదులా ఉన్నది. ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయింది. బిడ్డ యివతల ఫుట్‌పాదున్న వాడు ఒక్క ఉదుటున పరుగెత్తికెళి దానిని అవతల తోశేశాడు...కాని...కాని... బిడ్డ...బిడ్డకి...'వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టింది... రాజశేఖరానికి కూడ వెధవ పీడకల అన్పించింది.

'ఊరుకోవే పిచ్చిదానా! కలకే అలా అదిరిపోతావేమిటి?' ధైర్యం చెప్పాడు. అయినా పెద్దదానివి ఉన్నావు గదా! కోడలిని కాస్త దారి చూచుకొని నడవమని చెప్పొదూ' మందలించాడు.

జానకమ్మ మనస్సును మళ్లించటం మినహా గత్యంతరం కన్పించ లేదు.

ఈ కాలపు పిల్లలకు ఎవరు చెప్తారండి. అయినా మన కోడలు చాలా మంచిది మంచిదంటారుగా. మెత్తని పులండి. పైకి కన్పించదు. రాత్రి పూట ఏమోమో చెప్తూ ఉంటుంది వాడికి.'

'అంత గడుసు పిల్లా!' ఆశ్చర్యం కనపరచాడు.

'ఆఁ! గడుసుదే...తర్వాత బిడ్డని హాస్పిటలకు తీసుకు పోయేటప్పుడు, అత్తయ్యా! మీారు యింకో రిక్షాలో రండి. నేను ఆయన్ని పట్టుకొని యీా రిక్షాలో తీసుకొస్తానని మాట వరసకైనా అన్నదాండి...లేదు.'

ఒక వేళ కోడలు అడిగితే నువ్వు యింకో రిక్షాలో వెళ్లేదానివేనా?'

'నేనెందు కెళ్తాను. ఒకవైపు బిడ్డకు అలా రక్తం కారిపోతుంటే'

నవ్వును పెదాలవరకే పరిమితంచేసి 'అయితే అబ్బాయిని హాస్పటల్లో చేర్పించారన్నమాట' అన్నాడు.

'లేదు.'

'అదేమిటి?' ఆశ్చర్యంగా అడిగాడు.

'ఇంకా హాస్పటల్లో కూడా బాధ పడమన్నారా బిడ్డని. ఇంతలోకే మెలుకువ వచ్చింది. వెధవ కల. పొద్దున్నే లేచి ఎవరి మొహం చూశానో యేమో?' నిట్టూర్చింది జానకమ్మ.

'ఏమైనా పిల్లల వెంట పెద్ద దిక్కు ఉండటం చాల మంచిది.'

ఈ మాటలు జానకమ్మను కొంత ఊరట కల్గించినవి.

'ఇటువంటి కలలు నీకు యెప్పుడూ వచ్చేవి కావుగా. ఎప్పుడూ అబ్బాయి పెళ్లనో, పెళ్లి చూపులనో చెప్పేదానివి.

'అప్పుడు అటువంటివే వచ్చేయండి. ఏదీ యీా మధ్యనే యీా పెళ్లయిన దగ్గరనుండి యిటువంటి యాక్సిడెంట్ కలలు తగులడుతున్నయ్.

పెళ్లి—యాక్సిడెంట్.

బిడ్డ - కోడలు.

తల్లి—ప్రేమ—ఈ మాటలకు వేరే అర్థాలు స్ఫురించినయ్ రాజశేఖరానికి.

తనకు పెళ్లయి యిరవైఆరేండ్లు. తనకు ఒక్క కొడుకు లాగానే తన తలి దండ్రులకూ తనూ ఒక్కడే. చిన్నప్పుడే తండ్రి పోయాడు. తల్లే తండ్రి గురువై పెంచింది. ఇంటిపాటున ఉండి వ్యవసాయం చేసుకోవటానికి

పిత్రార్జితం చాలినంత ఉన్నది. తన యిరవై నాలుగో యేట జానకితో పెళ్ళయింది. జానకి చాలా అందంగా ఉండేది. అమ్మకూడ అందాల రాసైన కోడలు వచ్చిందని మురిసి పోయింది. యదార్థం చెప్పాలంటే జానకి అందానికి దాసుడై పోవటమే కాకుండ చూపే ప్రేమానురాగాలకు ముగ్ధుడై పోయాడు ఎంతో అదృష్టవంతుడనని మురిసి పోయాడు. తనకు ఒకసారి జ్వరంవచ్చి వారం రోజులు లంఖణం చేస్తే ఎంత కంగారు పడిందో! ఎంత ఆదుర్దా చెందిందో! నిద్రాహారాలు మాని రాత్రింబవళ్ళు సేవ చేసింది. తను మామూలు మనిషైన తర్వాత తిరుపతి ప్రయాణం పెట్టింది. వేంకటేశ్వరస్వామి తన మొక్కును తీర్చాడట.

రాను రాను తను తనకు తెలియకుండానే జానకి ఆధీనంలోకి పోయాడు. ఏ చిన్నపనైనా జానకితో సలహా సంప్రదింపులు చేసేవాడు.

'ఏమిటండీ ఆలోచిస్తున్నారు'? జానకమ్మ అడిగింది.

'ఆఁ! ఏమీలేదూ...నాకూ ఒక కల యిటువంటిదే వస్తేను.'

'మీకా!' గుర్రుపెట్టి నిద్రపోతారు కదండి.'

రాజశేఖరానికి నవ్వు వచ్చింది.

'అయినా కలలకు భయమున్నట్లు లేదు.'

ఆ నవ్వుకు జానకమ్మకు కొంచెం కోపం వచ్చింది.

'ఆ కలయేమిటో చెప్పరాదూ' నిష్టూరంగా అని విషయాన్ని మార్చింది.

'ఏమిటో జానకి. అది ఒక రకమైన పీడకలే. కాని నా కలలో వచ్చింది మనుష్యులుకాదు. పక్షులు.'

'పక్షులా!'... అన్నది.

'అదే గమ్మత్తు. మన దొడ్డిలో చెట్టుమీద రెండు పక్షులున్నయ్యంట.'

'సరే అవీ మన దొడ్లో వేనా?'

'అవును. అవి యింకో దొడ్లోనైతే నా కలలోకి ఎలా వస్తయ్'?

'బాగానే ఉన్నది.'

'అవి చాలా అన్యోన్యంగా ఉంటూ ఉండేవి. ఆడ పక్షి గుడ్లుపెట్టి పిల్లల్ని చేసింది. కాని వాటికి మిగిలింది, ఒకే ఒక్కపిల్ల. ఆ ఒక్కపిల్లకి రోజూ ఒకటి గూటిలో ఉంటే మరొకటి బయటికి వెళ్ళి

తిండి తీసుకొచ్చి పెడుతూ ఉండేవి. సాయంకాల మయ్యేటప్పటికి ఆడుకొంటున్నాయ్యా అన్నట్లు కిలా కిలా రవాలు చేసేవి. కాని వాటి సంతోషం అట్టే కాలం నిల్వ లేదు. ఒకనాడు యముడులాంటి వేటకాడు మగ పక్షిని కొట్టాడు. అది కిలా కిలా తన్నుకుంటూ క్రిందపడి చచ్చిపోయింది. పిల్లా తల్లి ఎంతగానో విల విల్లాడి పోయినవి.

'పాపం' అన్నది జానకమ్మ.

'అయినా అంత దుఃఖాన్ని దిగ్రమింగి ఆ తల్లిపక్షి ఆ బిడ్డను సాకింది. ఎప్పుడు తిండికోసం బయటకెళ్ళే దో,ఎప్పుడొచ్చేదో తెలిసేది గాదు. ఆ పిల్ల కోసమే తను బ్రతుకుతున్నట్లు దాన్ని పెంచింది.'

'మరి తల్లి ప్రేమ ఏమనుకున్నారూ! మనిషి కైనా పశుపక్ష్యాదులకైనా తల్లికి బిడ్డ మీద అలాగే ఉంటుంది' స్వానుభవంతో చెప్పుతున్నంత ధీమగా అన్నది జానకమ్మ.

'ఔను. మాతృ ప్రేమ ఔన్నత్యాన్ని కొలవ టము కష్టమే. వత్తాసు పలికాడు రాజశేఖరం.

'తర్వాత ఏం జరిగిందండీ?' అడిగింది మళ్ళీ.

'ఆ పిల్ల పెద్దదయింది. తల్లేమో ముసలిదై పోయింది. ఆహారం తీసుకొనిరావటం పిల్ల వంతయింది. పిల్ల కూడా అమ్మ మీదున్న ప్రేమ కొద్దీ రోజూ తిండి తీసుకొచ్చిపెడుతూ ఉండేది. ఇలా కొంతకాలం జరిగిపోయింది. ఉన్నట్లుండి ఒక రోజున మరొక పక్షిని తీసుకొచ్చింది బిడ్డ. అది దాని భార్య. తల్లి చాలా సంతోషపడింది మొదట. కాని కొన్ని రోజులు గడచిన తర్వాత తగాదాలు ప్రారంభమైనవి. తల్లి రోజూ గొణుక్కోవటం మొదలెట్టింది. సూటీ పోటీగా బిడ్డ తీసుకొచ్చిన దానిని దెప్పి పొడవటం సాగిం చింది. బిడ్డ వెర్రిబాగులవాడై పోయి దాని చేతిలో కీలుబొమ్మ అయి పోయాడని వాపోయింది. తనను చూడటం లేదని తన మాటంటే ఖాతరే లేదని ఏడ్చింది. కోడలు పక్షి కూడ విసుక్కోవటం మొదలెట్టింది. మొగుడు తన వాడైతే నీ పనేమిటిలే అన్నట్లు ప్రవర్తించేది.

'రైటే. పెళ్ళాం తియ్యనని ఊరికినే అన్నారా?' అందుకొన్నది జానకమ్మ.

'పెళ్ళాం తియ్యగానే ఉంటుంది వయస్సులో. అదే చేసింది ఆ బిడ్డ కూడ. ఆడదాని ఆకర్షణలో పడి పోయింది. ఆ పరస్పర ఆకర్షణ ద్వారా ఆ రెండూ అన్యోన్యంగా అనురాగాలు పెంచుకొన్నవి. విడదీయరాని జంటగా అల్లుకు పోయినవి. అందుకనే తల్లీ పెళ్ళాం మధ్య తగాదాలు వచ్చినపుడు ఎటూ తేల్చలేని సంకటా వస్థలో పడిపోతూ ఉండేది. అటు తల్లి మీదున్న ప్రేమా అనురాగాలు చేత ఆమెది తప్పయినా తప్పని అనలేక పొయ్యేది; ఏదో చెప్పాలని, సర్దుబాటు చెయ్యా లని తప్పు చేసిన వారిని—అటు తల్లయినా, యిటు భార్య అయినా గట్టిగా చివాట్లు పెట్టాలని అనేకసార్లు అను కొనేది. కాని అనుకొన్న వాటిని ఆచరణలో పెద్ద మనోబలం లేకపోయేది. అలాగే అన్నింటిని మనసులో అణచుకొనేది.

ఇక అటుతల్లి ఒక రోదన. పెళ్ళాం బెల్లమై పోయిందని. తల్లి విషమై పోయిందని ఒకటే గొడవచేసేది.

'అవును పాపం. అడ్డాలు నాడు బిడ్డలుగాని గడ్డాలు నాడు బిడ్డలా యేమిటి'? శ్రుతి కలిపింది జానకమ్మ.

'నిజమే. పోనీ ఆ బిడ్డ భార్యయైనా భర్త కష్టాలు తెల్సు కాబట్టి సర్దుకుపోదామన్న ధ్యాసే ఉండేది గాదు. తన సుఖమేమో తనేకాని తన భర్త మనోవేదన్ని అర్థం చేసుకో లేదు. కాని మిగతా విష యాల్లో భర్తకు అన్నివిధాలా సహాయకారిగా ఉండేది. ఒకప్రక్క భర్తను ప్రేమిస్తూనే ఉండేది, మరో ప్రక్క ఆ భర్త తల్లిని సాధిస్తూ ఉండేది.

పాపం ఆ తల్లి అలాగే విలపిస్తూ కొంత కాలానికి చనిపోయింది.'

ఎంతో బరువుగా నిట్టూరుస్తూ యిదీ కథ అన్నట్లు ఆపేశాడు.

జానకమ్మ యీసారి యెలా సమర్థిస్తుందో నని చూశాడు. కాని జానకమ్మ పమిట చెంగుతో కళ్ళు తుడుచుకొనటం గమనించాడు.

రాజశేఖరం కూడా యేమీ అనలేకపోయాడు. అడగలేక పోయాడు.

ఏమంటాడు?

ఇప్పుడు తన కొడుకెంతో—అప్పుడూ తనూ అంతే.

ఇప్పుడు తన కోడ లెంతో—అప్పుడు తనభార్య అంతే.

ఇప్పుడు తన భార్య యెంతో—అప్పుడు తన తల్లీ అంతే.

ఇది తరతరాల కథ.

# తన్త్రములు - శ్రీ విద్య

శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ

(గత సంచిక తరువాయి)

త్రిపురోపనిషత్తులోని మొదటి మంత్రము బిందు చక్రమును రెండవ మంత్రము ద్వితీయ తృతీయ చక్రముల సమష్టి రూపమైన నవయోన్యాత్మక చక్రమును మూడవ మంత్రము చతుర్థ పంచమ షష్ఠ చక్రముల సమష్టి రూపమైన స్థితి చక్రమును, నాల్గవ మంత్రము సప్తమాష్టమ చక్రముల సమష్టి రూపమగు సృష్టి చక్రమును, ఐదవ మంత్రము నవమ చక్రమును బోధించుచున్నది. మొదటి మూడు చక్రములకు సంహార చక్రమని పేరు. ఇట్లు శ్రీ చక్రమును సంహార స్థితి సృష్టి చక్ర త్రయాత్మకముగా చెప్పవచ్చును. ఆఱవ మంత్రము పరదేవతయొక్క విభిన్న నామములను ఏడవ మంత్రము శ్రీ చక్ర విజ్ఞాన ఫలమును ఎనిమిదవ మంత్రము పంచ దశాక్షర మంత్రమును బీజ సంకేతముల ద్వారా చెప్పును. ఈ పంచ దశాక్షరము కామరాజోపాసిత విద్యా స్వరూపము. తొమ్మిదవ మంత్రము లోపాముద్రోపాసిత విద్యా స్వరూపమును బోధించును. కామరాజోపాసిత పంచ దశాక్షర మంత్రము లోని మొదటి మూడక్షరముల తొలగించి వాని స్థానమున దానిలోని షష్ఠ సప్తమాష్టమాక్షరముల నివేశించి కూర్చబడిన పంచ దశాక్షర మంత్రమే లోపాముద్రోపాసిత విద్య. ఈ రెండు విద్యలకు భేద మింత మాత్రమే. పదవ మంత్రము మనమున చింతింపఁబడిన సగుణ పరదేవతను బాహ్యశ్రీ చక్రమందు ధ్యానించ వలెనని బోధించును. పదునొకండవ మంత్రము పరదేవతయొక్క సగుణ స్త్రీ రూపమును శ్రీ చక్రమందెట్లు ధ్యానించవలెనో చెప్పును. పన్నెండవ మంత్రము నివేద్య పదార్థములను పదుమూడవ మంత్రము ఆయుధములను పదునాల్గవ మంత్రము స్త్రీ పుం రూపముల యైక్యమును పదునైదవ మంత్రము నిర్గుణ ధ్యాన ఫలమును పదునాఱవ మంత్రము ఈ ఉపనిషత్ప్రాశస్త్యమును బోధించును.

భావనోపనిషత్తు జగత్తును శ్రీ చక్రముగా భావించు విధానమును తెలుపు చున్నది.

శ్రీ చక్రారాధనా విధానమున ఉపాసక శరీరగత మజ్జన కాంశాస్థి మాంసాదులను అంగదేవతయైన వారాహిగా ఉపాసక శరీరగత తజ్జనన్యం శాస్థి మాంసాదులను అంగదేవతయైన కురుకుల్లగా ధర్మార్థ కామమోక్ష రూపములైన ఉపాసకుని పురుషార్థములను సముద్రములనుగా దేహమును నవరత్న ద్వీపమునుగా సంకల్పములను కల్పవృక్షములనుగా మనస్సును కల్పకోద్యానమునుగా షడ్రుచుల షడృతువులనుగా కామక్రోధ లోభమోహ మదమాత్సర్య పుణ్య పాపములను బ్రాహ్మ్యాద్యష్ట శక్తులనుగా పంచ భూత పంచ జ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియ మనోవికారములను కామాకర్షిణ్యాది షోడశ శక్తులనుగా వచనాదాన విసర్గానంద రూప పంచ విషయ సహిత హానోపా దానో పేక్షారూప బుద్ధిత్రయమును అనంగ కుసుమా ద్యష్ట శక్తులనుగా దశ ప్రాణములను సర్వ సిద్ధి ప్రదాది బహిర్దశార దేవతలనుగా అలంబుసాది చతుర్దశ నాడులను సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ శక్తులనుగా దశ జఠరాగ్ని కళలను అంతర్దశార దేవతలనుగా శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్త్వరజస్తమస్సులను వశిన్యాద్యష్ట శక్తులనుగా అవ్యక్త మహదహంకారములను కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలిను లనుగా పంచతన్మాత్రలను పంచ పుష్పబాణములనుగా మనస్సు నిక్షు ధనువునుగా రాగమును పాశమునుగా

ద్వేషము నంకుశమునుగా నిరుపాధిక జ్ఞానమును కానే శ్వరునిగా స్వాత్మను లలితా పరదేవతగా భావించుట ప్రధానమైన విషయము.

బాహ్యోపచారములతో చేయఁబడు హోమ పూజాదులు బహిర్యాగ మనబడును. అంతర్యాగమున బాహ్యోపచారముల యావశ్యకత లేదు. ఇందు జ్ఞానమే అర్ఘ్యము జ్ఞేయమే హవిస్సు జ్ఞాతయే హోత జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయా భేద భావనమే అంతర్యాగమున అత్యంతా వశ్యకము. దీనియందు నేను నీవు ఉన్నది లేదు కర్తవ్యము అకర్తవ్యము ఉపాసితవ్యము అను వికల్పముల నాత్మయందు లీనములుగా భావించుట హోమము. భావనా విషయాభేద భావనమే తర్పణము అని భావనో పనిషత్తు అంతర్యాగ విధానమును విశదీకరించును. ఈ భావనోపనిష దర్థమునే తంత్రరాజమను గ్రంథ రాజము విస్తరించును.

అరుణోపనిషత్తు ఈ క్రింది మంత్రము చేత శ్రీ చక్రమును వర్ణించును.

అష్టా చక్రా నవ ద్వారా
దేవానాం పూరయోధ్యా
తస్యాం హిరణ్మయః కోశః
స్వర్గో లోకో జ్యోతిషా వృతః

ఒక అష్టకోణము రెండు దశ కోణములు ఒక చతుర్దశ కోణము ఒక అష్టదళము ఒక షోడశ దళము ఒక త్రివలయము ఒక త్రిచక్రము అను నీ అష్టచక్రములతోడ తొమ్మిది ద్వారముల తోడను గూడిన శ్రీ చక్రము దేవతలకు లేక పంచవింశతి తత్త్వములకు అధిష్ఠానము. మంద భాగ్యులకు అది అయోధ్య. అనగా సాధింపరానిది. దానియందు సహస్రదళ కమల మనెడు హిరణ్మయ కోశము బిందు స్థానమునందు విరాజిలు చున్నది. దాని తేజస్సుచేత స్వర్గలోకము ప్రకాశించు చున్నది అని పై మంత్రము యొక్క తాత్పర్యము. ఈ అరుణోపనిషత్తులోని ఈ క్రింది మంత్రము.

'విభ్రాజమానాం హరిణీం
యశసా సం పరీ వృతామ్
పురం హిరణ్మయీం బ్రహ్మ
వివేశా పరాజితా'

శ్రీ చక్రమందు శివభక్తులు నివసించి యుండుటను చెప్పను. బిందు రూపమైన చింతా మణి గృహమున నున్న శివుని షట్చక్రముల భేదించుచు మాటిమాటికి కుండలినీ శక్తి చేరునని యీ మంత్రముయొక్క భావము.

ఋగ్వేదమునకు చెందిన బహ్వృచోపనిషత్తు ఈ శ్రీ విద్యకును బృహదారణ్యకాద్యు పనిషత్తుల లోని మహావాక్యముల ద్వారా బోధింపఁబడిన జీవ బ్రహ్మైక్యమునకును ఏక వాక్యతను కూర్చును.

పైన పేర్కొనఁబడిన త్రిపురా రుణ భావనా బహ్వృచోపనిషత్తులే కాక అద్వైత భావనా కౌలోపని షత్తులును ఈ విద్యకు ప్రమాణములై యున్నవి.

పై యుపనిషత్తులలో త్రిపురా అరుణా ప్రభృతి శబ్దముల చేత తంత్ర గ్రంథములలో కామే శ్వరీ పరదేవతా రాజ రాజేశ్వరీ లలితా ప్రభృతి శబ్దముల చేతను ప్రతిపాదింపబడిన శ్రీ దేవి స్థూల సూక్ష్మ పరములను మూడు రూపములలో వర్ణింపఁ బడు చుండును. కరచరణాదులు కలది స్థూలరూపము. మంత్రమయము సూక్ష్మరూపము జ్ఞానమయము పర రూపము. మరల సూక్ష్మ రూపము సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమములను మూడు విధము లుగ నున్నది.

సూక్ష్మరూపము పంచదశీ మంత్రము. సూక్ష్మ తరము కామకల. సూక్ష్మతమము నాదము. సూక్ష్మ మైన పంచదశి యందు మూడు కూటములు కలవు. వాగ్భవ కూటము మధ్యకూటము శక్తికూటము. సూక్ష్మతరమైన కామకలగూడ అగమము లందు త్రివిధముగా వర్ణింపఁ బడినది. (1) అహమను ఆత్మ మంత్రము (2) ఈంకారము (3) శ్రీం. వీనిలో చివరి దానికే షోడశి యని పేరు. సూక్ష్మమైన పంచ దశి యంతయు దీనియందు లీనమై యున్నది.

విశుద్ధాత్మయే పర రూపము. స్థూల రూపము స్పష్టమె నదే కావున వివరింప నక్కఱలేదు.

శ్రీ దేవీ ప్రతీకమైన శ్రీ చక్రమందలి మధ్య బిందువు పరారూపముగా దానియొక్క వికాసమైన

త్రిభుజ చక్రము పశ్యంతీ రూపముగా అష్ట కోణ చక్రము మధ్యమారూపముగా మిగిలిన చక్రముల సముదాయము వైఖరీ రూపముగా శ్రీ దేవి వాఙ్మయ స్వరూపము గ్రహింప దగినది.

అర్థప్రపంచమంతయు వాక్కునుండియే యేర్పడిన దనుట శ్రీ విద్యాతంత్ర సిద్ధాంతము. ఈ సృష్టి వృక్షమునకు శ్రీ చక్రమధ్య బిందువు బీజముగా అందలి శివశక్తిద్వయస్థితి దళద్వయముతో కూడిన అంకురముగా వర్ణింపబడినవి. బీజమునందు అంకుర మిమిడియుండుట సహజము. కావున శివ శక్తుల సామరస్యము బిందువునం దేర్పడును. ఈ బిందువు శివశక్తుల ఏకాకారమైన పరబ్రహ్మ స్వరూపము. పరారూపమైన ఈ బిందువు స్ఫుటితమై పశ్యంతీ మధ్యమా వైఖరీ రూప సంహార స్థితి సృష్టిచక్రములుగా పరిణమించినది.

సాధకుడు శ్రీ చక్రసంకేతముల నెఱిగి శరీర మందున్న మూలాధారాది సహస్రారాంత స్థూల చక్రములందు శ్రీ చక్రమును భావించుట యొక సామరస్యము. భ్రూమధ్యమునుండి యున్మన్యంతము వఱకు గల సూక్ష్మచక్రములందు శ్రీ చక్రమును భావించుట మరొక సామరస్యము. కేవల బిందువు నందు శ్రీ చక్రము నంతయు భావించుట ఇంకొక సామరస్యము. ఈ త్రివిధ సామరస్యములలో ఉత్తరోత్తరము ఉత్తమము. ఇట్లు త్రివిధ సామరస్యమును భావనోపనిషత్తు ననుసరించి భావించి ధ్యానించుట అంతర్ముఖుడై అంతరంగ విచారణచేసి సహస్రార కమలమునందు శ్రీ చక్రైక్యమును బిందుమండల మందు చిచ్చంద్రునిలో పరాశక్తి వహ్న్యైక్యమును అందు బ్రహ్మాత్మైక్యమును భావించి ధ్యానించుట అంతర్యాగము. ఇట్టి అంతర్యాగమే సమయాచార మనం బడును. ఇది ఉన్నతశ్రేణికి చెందిన దక్షిణాచార సాధకుల సమయాచారము. శ్రీ లలితా సహస్రనామముల యందు దేవి సమయాచార తత్పరయని పేర్కొనబడి నందున సమయాచార సాధకులే శ్రీ దేవీ కరుణా పాత్రులని నిశ్చయింపం బడుచున్నది.

సమయ శబ్దము తంత్ర గ్రంథములందు ప్రకాశ విమర్శలుగా పేర్కొనబడిన శివ శక్తులకు గల పంచవిధ సామ్యములను బోధించును. (1) అధిష్ఠాన సామ్యము. అధిష్ఠాన పదముచేత శ్రీ చక్ర బ్రహ్మాండ పిండములలో దేనినైన గ్రహింప వచ్చును. ఈ మూడింటిలో నేదైనను శివునకు శక్తికిని అధిష్ఠాన మైనందున వీరికి అధిష్ఠాన సామ్యము కలదు.

2. అనుష్ఠాన సామ్యము. అనుష్ఠాన పదము సృష్టి స్థితి సంహార అనుగ్రహ తిరోధానములను పంచ కృత్యములను బోధించును. శివుడును శక్తియును ఈ పంచ కృత్యముల ననుష్ఠించుట చేత వీరి కనుష్ఠాన సామ్యము కలదు.

3. అవస్థాన సామ్యము అవస్థాన పదము సచ్చిదానంద స్థితిని బోధించును. శివుడు శక్తియు సచ్చిదానంద రూపులే యగుట చేత వీరికి అవస్థాన సామ్యము గలదు.

4. నామ సామ్యము నామ పదము 'శివా శివ' 'ఈశ్వరీ ఈశ్వర' ప్రభృతి నామ ద్వంద్వముల ఏక శేషమైన శివ ఈశ్వర ప్రభృతి నామములను బోధించును. ఒకే శబ్దము లింగ భేదముచే వీరిని బోధించుటచే వీరికి నామ సామ్యము కలదు.

5. రూప సామ్యము—రూప పదము త్రినేత్ర చంద్రశేఖర త్వాది విశిష్ట రూపమును బోధించును. శివుడు త్రినేత్రుడు. శక్తియు త్రినేత్రయే. శివుడు చంద్రశేఖరుడు. శక్తియును చంద్రశేఖరయే—అందుచే వీ రిరువురికి రూప సామ్యము కలదు.

శివశక్తులకీ పంచవిధ సామ్యములను భావించుట సమయాచారము. దీని నాచరించు సాధకులు శ్రీ దేవి కరుణాపాత్రు లగుదురనుటలో సంశయము లేదు.

శక్తి పరిణామ రూపమైన శరీరత్రయమునం దభిమానముచే దుఃఖితుడగు జీవుడు పురాకృత సుకృత పరిపాకమున శ్రీ విద్యాతంత్ర పరిజ్ఞానము కలవాడై ప్రాణవాయు నిరోధాభ్యాసము కలవాడై మూలాధార

చక్రమందు సుప్తమైన కుండలినీ శక్తిని మేల్కొలుపును. అపుడా శక్తి సుషుమ్నా మార్గమున ఊర్ధ్వ ముఖముగా ప్రసరించుచు మూలాధారాది షట్చక్రము లను బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథిత్రయమును భేదించి సహస్రారమను స్వస్థానమును పొందును.

మూలాధార స్వాధిష్ఠాన చక్రద్వయ రూపమైన బ్రహ్మ గ్రంధిని భేదింపగా స్థూల శరీరాభిమానము నశించును.. మణిపూరా నాహత చక్రద్వయ రూపమైన విష్ణుగ్రంథిని భేదించగా సూక్ష్మ శరీరాభిమానము నశించును. విశుద్ధాజ్ఞా చక్రద్వయ రూపమైన రుద్రగ్రంథిని భేదించగా కారణ శరీరాభిమానము నశించును.

ప్రాణవాయు నిరోధా భ్యాసము లేకున్నను శ్రీ దేవీ యనుగ్రహమున లభించిన యాత్మా నాత్మ విచారణ చేత గూడ నీ శరీర త్రయాభిమానము నశింప వచ్చును.

కుండలినీశక్తి సహస్రారమును చేరుటతో స్వస్థానమును చేరినందున ప్రయాణము పూర్తి యగును. జీవుడు స్వస్వరూప ప్రకాశ ప్రవిష్టుడగుటచే దుఃఖము పూర్తిగా తొలగి యానందైక రూప స్వ స్వరూపావస్థితి ననుభ వించును.

ఇట్టియానందస్థితి ఆత్మానాత్మ విచారణైక గమ్యమే యని వేదాంతులు ప్రాణాయామాది యోగ సాధనచేతనే యని యోగులు ఉపాసనచేతనే యని ఉపాసకులును చెప్పుదురు. వేదాంతులు యోగసాధనలను ఉపాసనలను చిత్తశుద్ధికంగములుగా గ్రహించి యున్నారు. యోగులు హఠయోగ రాజయోగ భేదమున మార్గద్వయము నాశ్రయించియున్నారు. ఈశ్వర ప్రణిధానాద్వా అనుపతంజలయోగ సూత్రము ఈశ్వర ధ్యానము ప్రాణాయామాదులతోపాటు చిత్తైకాగ్ర్య సాధనముగా చెప్పుచున్నది. చిత్తైకాగ్ర్యహేతువైన ఈ యుపాసనము సాత్త్వికరాజస తామసభేదమున త్రివిధము (1) బాహ్యవిగ్రహములందు దేవతా భావన తామసము (2) హృదయమునందు దేవతా భావన రాజసము (3) స్వాత్మయందు సాక్షితా భావన సాత్త్వికము. అధికారి భేదమున నీత్రివిధోపాసనము క్రమోన్నతి కారణమగును. వేదాంతులకు గాని యోగులకు గాని ఉపాసకులకు గాని చిత్తైకాగ్ర్య మావశ్యకము. ఆ చిత్తైకాగ్ర్యమున కీశ్వరానుగ్రహము హేతువనియు వీరందఱును అంగీకరించెదరు. ఈశ్వరానుగ్రహము ఉపాసనా లభ్యము. కావున ఉపాసనము నిరపాయమైన నిశ్చిత ఫలమైన మార్గము. కావున శ్రీ విద్యాతంత్రమున జ్ఞానము ధ్యానము ప్రాణవాయు నిరోధాభ్యాసము మంత్రజపహోమాది క్రియాకలాపము మొదలగు ప్రక్రియలన్నింటి సమన్వయము భాసించును.

శ్రీ దేవియొక్క స్థూలకరచరణాది యుక్త రూపమును లేక శ్రీ చక్రమును బాహ్యోపచారముల చేతగాని మనఃకల్పితోపచారముల చేతగాని బాహ్యవిగ్రహమున గాని మనస్సునందలి భావనా మయ విగ్రహమున గాని పూజింప వచ్చును.

శ్రీ దేవియొక్క మంత్రాత్మకమైన సూక్ష్మ రూపమును స్థూల రూపాభిన్నముగ భావించుచు జపించ వచ్చును. లేక శ్రీ చక్రమును బ్రహ్మాండాత్మకముగ గాని పిండాండాత్మకముగ గాని మంత్రాత్మకముగ గాని ధ్యానింప వచ్చును.

ఇదంతయు ప్రతీకోపాసనా ప్రకారము. స్వభిన్న వస్తువునందు పరమాత్మ నుపాసించుట ప్రతీకోపాసనము—ఈ ప్రతీకోపాసనమున కన్న అహంగ్రహోపాసనము శ్రేష్ఠము. తన యందే పరమాత్మ నుపాసించుట అహంగ్రహోపాసనము.

జన్మాంతరోపాసనా ఫలముగ లభించిన తత్త్వ జిజ్ఞాసచే శ్రీ దేవియొక్క జ్ఞానాత్మకమైన పర రూపమును స్వా భిన్నముగ తెలిసికొని ముక్తిని పొందుటయు సాధ్యమే. అద్వైతాచార్యు లందఱును శ్రీ విద్యోపాసకులే. లలితా సహస్రనామము లందలి దక్షిణామూర్తి రూపిణీ యను దేవీ నామము శ్రీ విద్యా ప్రవర్తకులలో శివమూర్తియైన దక్షిణామూర్తిని పేర్కొను చున్నది. ఆయన జ్ఞానముద్ర జీవ బ్రహ్మైక్య

మును శివ శక్త్యైక్యమును బోధించును. హయగ్రీవు డీ విద్యను అగస్త్యుల కుపదేశించెను. పరంపరా క్రమమున గౌడ పాదాచార్యులు శ్రీ శంకరాచార్యులు విద్యారణ్యులు శ్రీ విద్య ననుసరించిన వారే యని వారి రచనలను బట్టి తెలియుచున్నది. గౌడ పాదాచార్యులు గౌడపాద సూత్రమను నొక గ్రంథమును సుభగోదయ స్తుతి యను నొక స్తోత్రమును రచించినారు. శ్రీ శంకరాచార్యులు సౌందర్యలహర్యాది శ్రీ విద్యా తత్త్వ నిరూపక స్తోత్రముల నెన్నిటినో రచించినారు. ఐదువందలయేబదియైదు సంఖ్యతో పంచదశీ విద్యాత్మకతను సూచించు బ్రహ్మసూత్రములకు భాష్యమును రచించినారు. శ్రీ విద్యారణ్యులు పంచదశీ విద్యాత్మకతను సూచించుటకై తను వేదాంత గ్రంథమునకు వేదాంత పంచదశి యని నామము నెన్నుకొనినారు. కల్యాణవృష్టిస్తవమను నామాంతరముగల పంచదశీ మంత్రాక్షరములతో నారంభింపబడిన పంచదశీ స్తోత్రమును శ్రీ శంకరాచార్యులు రచించినారని, కొందరు శ్రీ విద్యారణ్యులు రచించినారని మరికొందరు తలంచుచున్నారు. వారు స్థాపించిన అద్వైత పీఠములందలి యాచార్యులందఱును నేటివఱకును శ్రీ చక్రార్చన చేయుచు శ్రీ విద్యోపాసకులుగానే యున్నారు.

తెలుగుదేశమున షోడశియైన శ్రీకారము మట్టుటతోడనే అక్షరలేఖనాభ్యాసము బాలురచే గురువులు చేయించుట పరంపరగావచ్చిన యాచారమై యున్నది. శుభకర్మలకు సంబంధించిన వ్యవహారమంతయు శ్రీకారముతోడనే యారంభమగుట సర్వసాధారణముగా నున్నది. తొలి తెలుగు కవులందఱు శ్రీకారముతోడనే తమ గ్రంథముల నారంభించియున్నారు. నేటి కవులలోను కొందఱట్లు చేయుచునే యున్నారు. జైనాద్యవైదిక తంత్రములపై తల్సాహిత్యములపైనను శ్రీ విద్యాప్రభావము గనబడుచున్నది.



# బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము - ఒక పరిశీలన

శ్రీ యు. ఎ. నరసింహ మూర్తి

స్ఫూర్తిశ్రీగారి 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము' ఆంధ్రవాఙ్మయాంగణంలో వెలగల గ్రంథము. వారి నిశిత విమర్శనా దృష్టి, బహుగ్రంథ పరిశీలనా పాటవము ఈ గ్రంథంలో వెల్లడవుతున్నాయి. మేలు ఎక్కడున్నా గ్రహించడం వారి స్వభావము. తమ గ్రంథానికి 'సర్వస్వము' అనే పదము సమర్థము కాగలదని వారు భావించారు. ఆ సంగతి ఎలాగున్నా గ్రంథనామము, ఒకటి రెండు సంపుటాలుగా విభజించడము, రెండు సంపుటాలలోని విషయ విభాగము వీనితోపాటు ఇతర రచనా ప్రణాళికా శ్రీ వజ్ఝలవారి 'ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము'తో పోలికను కలిగి వున్నాయి. ఈ గ్రంథాన్ని పఠిస్తూ ఉండగా కొన్ని విషయాలలో శ్రీ స్ఫూర్తిశ్రీ భ్రమప్రమాదాలకు గురిఅయినట్లు తోచింది. శాస్త్ర విషయంలో సత్యాన్ని నిరూపించడం భాషాభిమాను లందరూ కోరే విషయం కాబట్టి నా అభిప్రాయాలను సహృదయుల అంగీకారాన్ని కోరుతూ ప్రకటిస్తున్నాను. ఈ నా పరిశీలన శ్రీ స్ఫూర్తిశ్రీ గారి 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము'లోని ప్రథమ సంపుటికి మాత్రమే పరిమితమై వుంటుంది.

శ్రీ స్ఫూర్తిశ్రీగారు 'ప్రథమేతర విభక్తి' (బాల. సంధి. 2) ఇత్యాది సూత్రాన్ని వివరిస్తూ 'ఇందు, ఎందు—అనునవి విభక్తి ప్రత్యయములు కావు. సప్తమీ విభక్తియగు 'అందు' అను ప్రత్యయముతో సామ్యము కలిగియుండుట చేత వానిని 'ప్రత్యయ ప్రతిరూపము' అందురు.' అని వివరించారు. కాని 'ప్రత్యయ ప్రతిరూపము'— అనే సంజ్ఞను విధించిన వ్యాకర్తను గాని, వ్యాఖ్యాతను గాని వారు పేర్కొనక పోవడంచేత ఆ విధంగా అన్న వారెవ్వరో తెలియడం లేదు. ఈ సంజ్ఞను వారే కల్పించి వుంటే 'అందురు' అనడానికి బదులుగా 'అనవచ్చును' అనిగాని, 'అన వలయును' అనిగాని వ్రాస్తే బాగుండేది.

'ఈ రెండును సప్తమీ విభక్తి ప్రతిరూపకావ్యయము లగుటంజేసి వీనియందలి యుత్తులు విభక్త్యుకారములే యను భావముతో వీనిని సూరి యుదాహరించె నంద్రు'—అను పేటికా కారుని వ్రాత పై వ్రాతకు మూలంగా కనిపిస్తూంది.

'అన్నిష్ట సఖినూఁది యున్నదాని' అనే ప్రయోగ విషయంలో ప్రౌఢ వ్యాకర్త హృదయం మన వ్యాఖ్యాతకవగతమైనట్లు లేదు. ద్రుత స్వరూప విషయంలో చింతామణి కర్త అభిప్రాయం వేరు. ప్రౌఢ వ్యాకర్త అభిప్రాయం వేరు. చింతామణి కర్త 'అపి శబ్దార్థస్యైతః' ఇత్యాదిగా కొన్ని స్థలాల్లో ఆవయవిక నకారాన్ని ద్రుతంగా అంగీకరించినట్లు వజ్ఝలవారు చెప్తున్నారు. ప్రౌఢ వ్యాకర్తకు కూడా చింతామణి కర్త విషయంలో అలాంటి అభిప్రాయమే వుంది. కాని అది తన మతము కాదు. 'సర్వాంగు నిన్నభూత—సర్వమున్నతని—చోట్లుంబలెన్నురు శోభావిభవాకరంబు లగుచున్' అనే వానిని తన ఉదాహరణాలుగా సూచించి 'అన్నిష్టసఖి' ప్రసంగాన్ని కుండలీ కరణాల్లో చూపించడంలో ప్రౌఢ వ్యాకర్త అభిప్రాయాన్ని గ్రహించవచ్చును. 'లుక్సంశ్లేషౌనాచి ద్రుతస్య' ఇత్యాదిగా సంశ్లేషమును నిషేధించిన నన్నయ తన మతానికి విరుద్ధంగా ఆవయవిక ద్రుతానికి సంశ్లేషం చేయడాన్ని ప్రౌఢ వ్యాకర్త అధిక్షేపిస్తున్నాడు. అందుచేత 'ద్రుత ప్రసంగమే లేని చోట ద్రుత విషయికమైన సూత్రము సాధకము కాదు గదా!' అని స్ఫూర్తిశ్రీ గారు ఆశ్చర్య

పడవలసిన పనిలేదు. ఇక ప్రయోగ వైరళ్య ప్రస్తావన మొకటుంది. విమర్శ విషయంలో కొందరు సౌమ్య మార్గాన్ని అవలంబిస్తారు. నన్నయ తప్పు చేసినట్లు చెప్పడం మర్యాదగా వుండదేమోననే గౌరవ భావంతో ప్రౌఢ వ్యాకర్త చేసిన సర్దుబాటు యిది. ఈ విధమైన సర్దుబాటు స్ఫూర్తిశ్రీ గారిలో కూడా కనిపిస్తుంది. పదాది యకారాన్ని గూర్చిన చింతామణి అసంగత ప్రసంగాన్ని చిన్నయసూరి కంఠోక్తిగా ఖండించి ఉండగా స్ఫూర్తిశ్రీ గారి 'చిన్నయసూరి 'యకారంబును వు వూ వొ వో లును దెలుఁగు మాటలకు మొదట లేవు' అని సంజ్ఞా పరిచ్ఛేదమున సూత్రించి మార్గాంతరమున దీనిని సాధించుట జరిగిపోయినది'—అని మృదువుగా చెప్పారు. నిజానికి శాస్త్రవిషయంలో నిజాన్ని గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు ఇలాంటి మెతకదనం ప్రదర్శించడం నిజాన్ని చీకట్లో దాచడం మాత్రమే కాగలదు. 'ద్రుతవిషయికమయిన యీ సూత్రమునకు 'అన్నిష్టసఖి' అనునది లక్ష్యము కాజాలదు'—అని స్ఫూర్తిశ్రీ చెప్పారు. నిజానికి ఇదే ప్రౌఢవ్యాకర్త అభిప్రాయము. అందుచేతనే ప్రౌఢ. సంధి. 9 వ సూత్రంచేత ఈ రూపాన్ని సాధించాడు. స్ఫూర్తిశ్రీ గారికి ఈ విషయంలో 'అను' అను చోట ద్రుతమే లేదు. కావున ప్రయోగ వైరళ్య 'సూచనమే సంభవింపదు' అనే తత్త్వబోధినీకారుల మతం మార్గ దర్శకంగా వుంది. కాని 'అన్నిష్టసఖి'—అనే స్థలంలో 'అను+ఇష్టసఖి' అనే ప్రౌఢ వ్యాకర్తమతాన్నిగాని, తత్త్వబోధిని విరుపు కాని వీరు అంగీకరించరు. వీరి మతంలో 'అన్న+ఇష్టసఖి'=అన్నిష్టసఖి' 'అన్న+అసుర+అన్నసుర 'అన్న+ఇని=అన్నిని' అనే విధంగా విడదీయాలి. ఈ విరుపు వీరికి సౌకర్యంగా వుంది. కాని ఇక్కడ కావలసింది సౌకర్యం కాదు. 'అనిన' అనే క్రియా పదమునుండి పుట్టిన 'అన్న' అనే రూపముకంటె 'అను'లో 'ఉ' లోపించిన 'అన్' అనే రూపమే ఇక్కడ ఉచితంగా వుంటుంది. 'జనవే జయుడన్ జనపాలుఁడు' 'మదీయ భాషిత మెన్నఁడున్నేని మోఘముగాదు' మొదలైన ప్రయోగాలను చూపుతూ వజ్ఝల వారు 'చింతామణి విషయ పరిశోధనము' అనే గ్రంథంలో చేసిన నిర్ణయం వ్యాఖ్యాత తెలుసుకోవడం అవసరం. ఈ సూత్రం దగ్గర పదాది యకార సంబంధమైన 'సర్వత్రాజ్యవత్ కార్యం' ఇత్యాది చిన్తామణి శ్లోక వివరణ గ్రంథసంఖ్య పెంచటానికి మాత్రమే ఉపయోగపడుతుంది.

విభాషను గూర్చి స్ఫూర్తిశ్రీ గారు కొన్ని ఆసక్తికరమైన క్రొత్తవిషయాలు చెప్పారు. ఆ విషయాలను పరిశీలించేముందు విభాషను గూర్చి వ్యాకర్తల, వ్యాఖ్యాతల అభిప్రాయాలు తెలుసుకోవడం మంచిది. మన వ్యాకర్తలు సంస్కృత వ్యాకరణ మర్యాదలనవలంబించిన వాళ్లు. తెలుఁగులో క్రొత్తగా విధింపవలసిన సంజ్ఞలు — పరిభాషలు మాత్రమే విధించి మిగిలిన సంజ్ఞలను — పరిభాషలను సంస్కృతం నుండి గ్రహించారు. అలాంటి వాటిని గూర్చి మన వ్యాకర్తలు ఎటువంటి వివరణా చేయలేదు. 'అనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః' అనేది మన వ్యాకర్తల ప్రణాళికలో వుంది. ఆ విధమైన అనుక్తకార్యంలో 'విభాష' ఒకటి. ఈ విషయంలో పాణినీయం 'నవేతి విభాషా — నిషేధ వికల్పయో ర్విభాషా సంజ్ఞాస్యాత్' అని చెప్తుంది, చిన్నయసూరి వికల్పవిధిలో విభాషను ప్రయోగించడం సర్వత్రా కనిపిస్తుంది. 'వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' అనే చోట నిషేధ ప్రసక్తి కనిపిస్తుంది. అందుచేత 'నవేతి విభాషా' అనే సంప్రదాయాన్ని చిన్నయసూరి అంగీకరించినట్లు తెలుస్తుంది.

వజ్ఝలవారు బహుళమును వివరిస్తూ '(క్వచిత్) విభాష = కొన్నియెడల వికల్పము గానగుట' అని వ్రాసారు. పేటికా కర్త 'కొన్నియెడల నొకమారు కలిగి యొకమారు కలుగ కుండుటయు' అని వ్రాసారు. స్ఫూర్తిశ్రీగారు కూడా వారి మతాన్ని అంగీకరిస్తూ 'విభాష యనగా వచ్చుట రాకుండుట యను రెండు నగుట' (101 పేజి)అని పేర్కొన్నారు.'మేనల్లుడు—మేనయల్లుడు' అనే వానిని విభాషకు ఉదాహరణాలుగా చూపించారు. ఇంతవరకు క్రొత్త విషయమేమీ లేదు.

'ఆదేశ సరళములకు ముందున్న' ఇత్యాది సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ స్ఫూర్తిశ్రీగారు 'నవేతి విభాషా' యని విభాషకు నిర్వచనము. నిషేధమును

వికల్పమును కలిసి యున్నయెడల విభాష యని యందురు' అని వ్రాసారు. ఈ సందర్భంలోనే 'రాబోవు సూత్రములందు నేను, తాను—శబ్దముల విషయమునను, ప్రొతాది కార్యములందును ద్రుతమునకు సంశ్లేషమును నిషేధింతుము. ఇట్లు నిషేధమును, వికల్పమును కూడియుండుటచేతనే సూత్రమున 'విభాష' యను పరిభాష వాడబడినది' అని చెప్పారు. ఇక్కడ రెండు తప్పులు కనిపిస్తున్నాయి. విభాష పరి భాష కాదు. 'విభాషా సంజ్ఞా స్యాత్' అనడంవల్ల అది సంజ్ఞ అవుతుంది. తరువాత—'తాను, నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు'—అనే విశేష సూత్రంచేత సూరి సంశ్లేషను నిషేధించాడు. 'ఆదేశ సరళములకు'—అనేది సామాన్య సూత్రము. వ్యాకరణ మర్యాద ప్రకారం సామాన్య విధిని — విశేషవిధి బాధిస్తుంది. అందుచేత తాను—నేను శబ్దముల విషయంలో ప్రవర్తించే సంశ్లేష నిషేధానికి 'ఆదేశ సరళములకు ముందున్న' ఇత్యాది సూత్రంలో ప్రయోగింపబడిన 'విభాష' అనే దళానికి ఎవ్విధమైన సంబంధమూ లేదు. అలాగయినట్లైతే 'తాను, నేను' ఇత్యాది సూత్రనిర్మాణం వ్యర్థమనవలసి వస్తుంది.

'ఆగమ ము, వు వర్ణంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమము విభాషనగు' అను సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ 'విభాష అని యున్నప్పుడు వికల్పమును, నిషేధమును కలిసి యుండును. కాని ప్రస్తుతోదాహరణములందు నిషేధము కలుగు తావు లేదు. అన్యత్వమునకు అవకాశము గలదు. బాల వ్యాకర్త వికల్పము, అన్యత్వము—అను రెండింటిని నిర్వహింపదలచియే యిచ్చట 'విభాష'యను శబ్దమును వాడి యుండెనని యనిపించు చున్నది—అని వ్రాసి 'బియ్యము' 'చెఱువు' మొదలైన శబ్దసిద్ధములైన ము వులకు 'అందు' పరమగునపుడు నిత్యముగా నుగాగమము ప్రవర్తించి 'బియ్యమునందు—చెఱువునందు' అను రూపము లేర్పడుట అన్యత్వంగా పేర్కొన్నారు. కాని వజ్ఝలవారు ఈ రూపాలను 'ఉకార, ఋకారంబుల కందు వర్ణకంబు పరంబగునపుడు నుగాగమంబగు' అనే సూత్రంచేత సాధింపదగినవిగా చెప్పారు. స్ఫూర్తిశ్రీ గారు ఇవి అచ్ఛిక శబ్దాలని పేచీపెట్టవచ్చును. కాని తత్సమపరిచ్ఛేదంలో అచ్ఛికాల ప్రస్తావన ఇతరత్రా ఉండడంచేత ఆ మాట నిలబడదు. అంతేకాకుండా వారు పేర్కొన్నట్లు ఇవి అన్యత్రప్రవృత్తికాదు. అన్యత్రప్రవృత్తి అవుతుంది. సూత్రంలోని 'విభాష' అనే పదాన్ని గ్రహించి, దానికొక అన్యత్వం అనే ప్రయోజనాన్ని కల్పించి, తద్ద్వారా 'ఉదంతములగు మహత్తుల కందు వర్ణకము పరంబగునపుడును నగాగమంబు కొన్నియెడలం గానంబడియెడి' అనే ప్రౌఢవ్యాకరణ సూత్రం విధించే నగాగమాన్ని బాలవ్యాకరణమే సాధించదని స్ఫూర్తిశ్రీ గారు అభిప్రాయ పడుతున్నారు. సూరి 'సమాసంబునయందు' అని నగాగమంతో కూడిన ప్రయోగం చెయ్యడంచేత, ప్రస్తుత సూత్రంలోని విభాషా సామర్థ్యంచేత నగాగమనే అన్యత్కార్యాన్ని సాధించినట్లు వీరి వాదన. ఇంకా తృప్తిలేక మరొక విధంగా చెప్పారు. 'ఉకార ఋకారంబుల కందు వర్ణకంబు పరంబగునపుడు నగాగమంబు విభాషనగు' అని సవరించినట్లయిన 'రాము+న+అందు' మున్నగు విధముగానైన నిత్యసంధియు, వనమునందు—వనమునయందు మున్నగుచోట్ల వైకల్పికసంధియు, బియ్యమునందు మున్నగు తెలుంగు శబ్దములపై నిత్య సంధియు నగు. వనమందు మున్నగుచోట్ల నగాగమప్రాప్తి లేకుండ నగు'—అంటూ తమ సూత్ర నిర్మాణ దక్షతను ప్రదర్శించారు. చిన్నయసూరి పైనుండే గాఢమైన అభిమానంచేత ఆయన విభాషకు వికల్పము-నిషేధము—అన్యత్వము—అన్యత్ర ప్రవృత్తి అనే లక్షణాలు కట్టబెటారు. తన దాకా వచ్చేసరికి విభాషా ప్రయోజనాలలో నిత్యవిధిని కూడా చేర్చారు. ఈ విధమైన వ్రాతయొక్క యుక్తాయుక్తాలు ఏవిధంగా వున్నాగాని, దీనిని అంగీకరించినట్లైతే వ్యాకరణ శాస్త్రంలో విభాష—బహుళం అనే రెండు విధులలో ఏదో ఒకదానిని మాత్రమే ఉంచి రెండవ దానిని రద్దు చేయవచ్చును. బాహుళకమున కుండే ప్రయోజనాలలో ఒకటైన విభాష చేతనే బాహుళక ప్రయోజనాలన్నీ సిద్ధించినట్లైతే బహుళవిధి ప్రయోజన శూన్యమే కదా! విభాషకు స్ఫూర్తిశ్రీ గారు నిర్దేశించిన విధులను సూరి ఎక్కడా చెప్పలేదు. ఇతర వ్యాకర్తలు కూడా చెప్పలేదు. ఇక చిన్నయసూరి కూడా స్ఫూర్తిశ్రీగా రిలాగే భావించినట్లైతే విభాషా విషయంలో ఆయన ప్రత్యేక నియమాలు చేయకపోవడం

ఒక లోటుగా మనం అంగీకరించక తప్పదు. సూర్యారాయాంధ్ర నిఘంటు నిర్మాత సూర్యారావుగారు లేక సూర్యశ్రీ గారికి ఆ విధంగా అంటే రుచించదు. వారి దృష్టిలో చిన్నయసూరి వ్యాకర్తగా లోటు లేని వ్యక్తి.

'కృతోత్కంబగు సంస్కృత నామంబు సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు'—అని సూత్రము. ఇందులో 'విభాష' అను శబ్దము వలన సంబుద్ధి డుజ్జునకు లోపము కలుగుటతోపాటు కృతోత్కము యొక్క ఉత్వమునకు లోపము కలుగ వలయును'— అంటారు సూర్యశ్రీ గారు. వారి మాట మనం అంగీకరించామే అనుకుందాం. ఆ స్థితిలో 'ఓ రాము— ఓ కృష్ణు' ఇత్యాదులలోని ఉత్వానికి లోపము రాగా 'ఓ రామ్ – ఓ కృష్ణ్' అనే రూపాలే మిగులుతాయి. కాని సూర్యశ్రీ గారు 'ఓ రామ—ఓ కృష్ణ' అని అవులాయనే నమ్ముతున్నారు. వజ్ఝలవారు డుజ్జు లోపింపగా మిగిలిన 'ఓ రాము—ఓ కృష్ణు' ఇత్యాదుల లోని ఉకారానికి 'సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారంబగు' అనే సూత్రంచేత అత్వాన్ని సాధించారు. పేటికా కర్త అభిప్రాయం కూడా యిదే. కాని మన వ్యాఖ్యాత 'ఓ రాము— ఓ కృష్ణు' అనేవి పదాలు కావనే భ్రమకు లోనై వారి ప్రక్రియ సరియైనది కాదన్నారు. ఇందుకు మూలం ఏమంటే వజ్ఝలవారు బాల. తత్సమ. 33 వ సూత్రాన్ని వివరిస్తూ 'పదంబు తుది అనుటచే 'గురు +అ = గుర, శంభుం +అ = శంభ' మున్నగు ననిష్ట రూపములు సంభవింప నేరవు' అని వ్రాయ డమే ననుకుంటాను. వజ్ఝలవారు గురు, శంభు అనే ప్రాతిపదికలను గ్రహించి అవి పదములు కాక పోవడం చేత వాని తుది ఉత్వానికి—అత్వం రాదన్నారు. 'కృతోత్కంబగు సంస్కృత నామంబు' ఇత్యాది ప్రకృత సూత్రాన్ని వివరిస్తూ 'కృతోత్కములు కామిం జేసి 'శంభుఁడు—గురుడు' మున్నగు స్థలము లందు బకృత సూత్రము ప్రవర్తింప నేరదు' అని వ్రాసారు. రెండు సూత్రాల దగ్గర ఒకే శబ్దాలను ఒకమారు ప్రాతిపదిక రూపంలోను, ఒకమారు పద రూపంలోను వజ్ఝలవారు చూపడంవల్ల సూర్యశ్రీ గారు చిక్కులో పడ్డారు. 'ప్రత్యయ లోపే ప్రత్యయ లక్షణం' అనే పరిభాష ననుసరించి 'రాముఁడు— కృష్ణుఁడు' ఇత్యాదులలోని ప్రత్యయం లోపించినా ప్రత్యయ లక్షణం మాత్రం నిలిచే వుంటుంది. అందు చేత 'ఓ రాము—ఓ కృష్ణు' అనే వానిని 'పదంబు తుది యుకారంబునకు' అనే దళం బాధించదు. సీత— హరి—తండ్రి—ఇత్యాదులలో ప్రత్యయము లేనందు వల్ల వానికి ప్రత్యయ లక్షణం లేకపోలేదు. అవి పదాలే అవుతున్నాయి. అదే విధంగా 'ఓ రాము—ఓ కృష్ణు' అనే వానిలో కూడా ప్రత్యయ లక్షణం మిగులుతుంది.

'మధ్యమ పురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు' అనే చోట విభాషా ప్రయోజ నాన్ని మరొక రకంగా వ్యాఖ్యాత చూపడం జరిగింది. 'చిన్నవారు' అనే శబ్దము మీద 'అరగాగమము వచ్చిన యెడల తచ్ఛబ్దమునకు లోపము కలిగి 'లు' ప్రత్య యము కలుగును. చిన్న+లు+అర=చిన్నలార' అని యగును' అని చెప్తూ 'తచ్ఛబ్ద లోపము' అనే అన్య ప్రక్రియను విభాషా ప్రయోజనంగా చెప్పారు. ఇక్కడ 'తచ్ఛబ్దము' అనడంలో వ్యాఖ్యాత అభిప్రాయం స్పష్టంగా లేదు. బహువచనం మీద బహువచనాన్ని విధించుకొని అందులో ఒకదానికి తిరిగి లోపాన్ని విధించుకొనేకంటె 'చిన్న +లు' అనే విధంగా మొద టనే 'లు' వర్ణకాన్ని విధించు కుంటే ప్రక్రియా గౌరవంతోబాటు, నియమ విరుద్ధమైన 'అన్యక్రియ' కూడా లేకుండా పోవచ్చును.

'లు ల న లు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు నకు దీర్ఘంబును విభాషనగు' అని బాల వ్యాకరణ సూత్రము. దీనిని వ్యాఖ్యానిస్తూ సూర్యశ్రీ గారు 'లోపంబును' అని 'దీర్ఘంబును' అని సముచ్చయార్థక ములతో విడివిడిగా వ్రాసినను ఇవి కలిసియే ప్రవ ర్తించును. విభాష యనుటచే ప్రవర్తింపక మానిన యెడల రెండును గలిసియే మానవలయును' ఇత్యా దిగా విషయాన్ని పెంచారు. ఈ వ్రాతలో ఔచిత్యం కనబడదు. రెండు విధులు ఒకేసారి ప్రవర్తించడం కోసమే సూరి సముచ్చయాన్ని ఉపయోగించడం జరి గింది. ఇక్కడ సముచ్చయం ముగాగమ లోపాన్ని— తత్పూర్వ స్వరదీర్ఘాన్ని కలుపుతున్నదే గాని విడి విడిగా చేయడం లేదు. అసలు 'తత్పూర్వ స్వరంబునకు' అనే

విధిలోనే లోపమునకు ముందున్న స్వరమునకు అనే అర్థం సిద్ధిస్తుంది. వ్యాఖ్యాత 'ములోపము వచ్చు నపుడె దీర్ఘము వచ్చును గాని రెండును బర్యాయమున రానేరవు' అనే వజ్ఝల వారి వాక్యాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడం చేత ఈ ప్రమాదం సంభవించి ఉంటుంది.

'విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబు లకు మహాత్ముల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు' అనే సూత్రంలో 'విభాష' అని విధించడం మాంధాత— మాంధాతృడు అనే రూప సిద్ధికోసమని సూర్యారాయ శ్రీ గారి అభిప్రాయం. కేవలం ఈ ఒక్క పదంకోసమే విభాష నుపయోగించడంకంటె ఆ పదాన్ని కూడా సూత్రంలో చేర్చుకుని అత్వస్త్రీవద్భావాలను వికల్పంగా విధించుకోవడం సుకరంగా వుంటుంది. ఐదు పదాలను చేర్చుకున్న సూరి దృష్టిలో 'మాంధాతృ' అనే శబ్దమున్నట్లైతే ఆరోపదంగా దానిని చేర్చు కోవడం జరిగేది. ఇదే విధంగా 'వృద్ధాదుల దుజు నకు లోపంబు విభాషనగు' అనే సూత్రంలోని విభాషచేత 'నన్నయభట్టు' ఇత్యాదులలో దుక్ లోప మునకు నిత్యవిధిని సాధించారు.

'రైగ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు'

'చెయువు బహువచన లకారంబున కలఘు రేఫంబు విభాష నగు' మొదలైన బాలవ్యాకరణ సూత్రాల్లోగాని

'బహుత్వంబున మేకు నే విభాషనగు'

'ఒక్కొక్క శబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాషనగు' ఇత్యాది ప్రౌఢవ్యాకరణ సూత్రాల్లోగాని 'విభాష' అనే విధివల్ల కలిగే ప్రయోజనాలను సూర్యారాయ శ్రీ గారు చూపలేదు. ఆ విధివల్ల ప్రత్యేక ప్రయోజనం లేనట్లైనా చెప్పలేదు. ఈ పరిశీలన వలన 'విభాష' అనే సంజ్ఞకు నిత్యవిధి వైకల్పిక విధి—అప్రవృత్తి—అన్యత్వము—అన్యత్ర ప్రవృత్తి అనే ప్రయోజనాలతోపాటు, కొన్ని స్థలాల్లో ప్రయోజనా రాహిత్యంకూడా ఉన్నట్లు సూర్యారాయ శ్రీ గారి అభిప్రాయంగా మనం గ్రహించ వచ్చును. వ్యాకరణశాస్త్రంలో ఇది మిక్కిలి ఆసక్తికరమైన విషయంగా వుంది.

'కన్దోయి' విషయాన్ని వ్రాస్తూ సూర్యారాయ శ్రీ గారు 'యథార్థమెట్లున్నను' 'కన్ను, కను, కన్' అనువానిలోని సవర్ణమును, పూర్వ ప్రయోగముల బలమును బట్టి సూరి ద్రుతముగనే నిర్ధారించి వ్యవహరించుచున్నాడనుట స్పష్టము' అన్నారు. ఇక్కడ 'యథార్థమెట్లున్నను' అనే మాట అభ్యంతరకరంగా వుంది. శాస్త్రవిషయంలో—ఈ విధమైన తప్పుకు పోయే పద్ధతి పనికిరాదు. అంతేగాక సూరిశబ్దగత నకారానికి సర్వత్రా ద్రుతత్వాన్ని అంగీకరించాడా? ఒక్క 'కన్' అనే చోటనే అంగీకరించాడా? అనే విషయాన్ని నిష్కర్షగా ఆలోచించాలి. వ్యాఖ్యాత చెప్పినట్లు సూరి ఇక్కడ 'నిర్ధారించి' చెప్పలేదు. కేవలం ఒక్క 'కన్' శబ్దంలో మాత్రమే ద్రుతత్వాన్ని విధించినట్లైతే ఆ విషయాన్ని సూత్రీకరించడం గాని లేదా ఆ రూపాన్ని నిపతించడం గాని సూరికి అలవాటు. 'తాను—నేను' అనే రెండు పదాల కోసం ఒక సూత్రం రచించిన చిన్నయసూరి ఒక శబ్దంకోసం అవసరమైతే ఒక సూత్రాన్ని రచించ డానికి వెనుకాడడు. 'ముంగొంగు—క్రొంబసిడి' అనే పూర్ణబిందువుతో కూడిన రూపాలను ప్రదర్శిస్తూ 'కందోయి' అను పూర్ణబిందువుకల రూపముండగా దానిని వదలి 'కన్దోయి' అనే నకారంతో కూడిన విశిష్టరూపాన్ని ప్రయోగించడం ద్వారా సూరి ఈ విషయంలో నిపతించడం జరిగినట్లుగా వ్యాఖ్యాత వివరించినట్లైతే సరసంగా వుండేది.

తత్త్వబోధినీకర్త 'ముంగోపము' అనే చోట 'ముందు' అను శబ్దము గాక 'మున్ను' శబ్ద సంబంధి యైన 'మున్' అనే పదాన్ని సూచిస్తూ 'మున్ + కోపము' అని విడదీయా లన్నారు. ఆ విషయంతో సూర్యారాయ శ్రీ గారు ఏకీభవించలేదు. 'మున్'లోని నకారము ద్రుతము కాదని సూర్యారాయ శ్రీ గారి అభిప్రాయము. కాని 'కన్ అను పదము వలె మున్ అను నదియు నొక పదము గలదు' అనడంలో తత్త్వబోధిని తత్త్వాన్ని వ్యాఖ్యాత గ్రహించాలి. 'కన్' అనే శబ్దంలోని నకారం ద్రుతమనే విషయాన్ని వ్యాఖ్యాత అంగీకరించారు. అదే విధంగా 'మున్' అన్న చోట ఆవయవిక నకారానికి ద్రుతత్వాన్ని అంగీకరించాలని తత్త్వబోధిని అభిప్రాయము. వ్యాఖ్యాత ఆ విషయాన్ని అంగీకరింపక పోయినా బాధ లేదు. ఎందుచేతనంటే 'మున్' అనేది

పూర్వార్థకమైన అవ్యయము — ఈ పదం మీద లింగ వచన విభక్తులు చేరవు గదా! అందుచేత దానిని అవ్యయంగా అంగీకరించడంలో ఎవరికీ బాధ లేదు. అవ్యయమనడం చేత 'మున్'లోని నకారము ద్రుతము కాగలదు. అప్పుడు తత్త్వబోధిని సూచించిన ప్రక్రియ నంగీకరింప వచ్చును.

'ఎల్ల' శబ్దాన్ని గూర్చి వ్రాస్తూ స్ఫూర్తిశ్రీ గారు చిన్నయసూరి సూత్రాన్ని వృత్తిగాను, వృత్తిని సూత్రంగాను మార్చుకుంటే బాగుంటుందని సలహా యిచ్చారు. కాని వారు చెప్పినట్లు 'సర్వపర్యాయకంబగు నెల్ల శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు'—అనే దీర్ఘసూత్ర నిర్మాణం చేయడంగాని, రెండు వాక్యాలలో ఒక సూత్రాన్ని నిర్మించడం కాని సూరి ప్రణాళికకు విరుద్ధమైన పని. సూరి సూత్రాని కనుగుణంగా 'చాల యవసరము—మిగుల యక్కఱ' మొదలైన రూపా లున్నట్లు వారే అంగీకరిస్తున్నారు. 'తాను, నేను పదములలో ద్రుతము లోపించుటయు సాధారణముగా కనుపట్టదు' అన్నారు. శాస్త్ర విషయంలో 'సాధారణముగా' వంటి మాటలు వాడదగినవికావు. వారి వ్రాతనుబట్టి ఇలాంటి రూపాలు వుండవచ్చుననే అభిప్రాయం కలుగుతున్నది. ఆగమ ద్రుతమునకు లోపమును నిషేధించే విధాన సామర్థ్యము విశేష విధి. 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు' అనేది సామాన్య విధి. కాబట్టి పై సూత్ర నిర్మాణం అవసరంగానే కనిపిస్తుంది. వజ్ఝలవారు 'ఈ సమాస ద్రుతలోప సూత్రమున కుదాహృతి లేకపోలేదు' అని వ్రాస్తూ 'కువలయంబున వారు' మొదలైన ప్రయోగాలను చూపారు. ఈ సందర్భంలోనే 'ఎల్ల' శబ్దం యొక్క అవ్యయత్వాన్ని స్థాపించడంకోసం వ్యాఖ్యాత 'కావున నియ్యది 'అందు' అను ప్రత్యేక శబ్దముతోఁ గూడిన పదమే కాని సప్తమ్యంతమగు నెల్ల పదమని తలంప రాదు' అనే తత్త్వబోధిని మతాన్ని అంగీకరించారు. కాని తత్తార్థకమైన 'అందు' శబ్దానికి సప్తమ్యర్థకానికి వుండే అర్థభేదాన్ని సమన్వయ పరచలేదు. తత్త్వబోధిని ఆమోదించిన 'ఎల్లన్ శిష్యుల' అనే శ్రీనాథ ప్రయోగాన్ని 'వ్యాకరణ దృష్టితో చూచినప్పుడు ఇది సాధు ప్రయోగము కాదని' అనడానికి సాహసించారు. ఈ అపప్రయోగంవల్ల శ్రీనాథుఁడు వ్యాసుని ఆకలిని తెలియజేస్తున్నాడన్న కొందరి విమర్శ—ఈ విషయంలో వీరికి శిరోధార్య మయింది. శ్రీనాథుని ప్రయోగము సాధువు కాదనే ఈ వాదంకన్న 'ఎల్లన్'లో 'న్' సముచ్చయావశిష్టమనే బులుసు వారి మతమే వీరు అనుసరించి వుంటే బాగుండేది.

'పెను+అదరులు=పెన్నదరులు' అనే స్థలంలో కుమారదేవ పండితీయము, సుబోధినీ వ్యాఖ్యలు 'కవిభల్లసైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే' అనే సూత్రం చేత, తత్త్వబోధిని బాల. ప్రకీ. 16 వ సూత్రం చేత 'పెను'లోని ఉత్వానికి లోపం చేసాయి. ఈ రకంగా చేయడం 'కడహల్లు అని యనగా పదము తుదినున్న హల్లు అని భావించుటవలన వచ్చిన అనర్థము'గా స్ఫూర్తిశ్రీ గారు తానొక అనర్థాన్ని కోరుకున్నారు. వారు చెప్పిన విధంగా 'కడహల్లు' అంటే హల్లులలో తుదిహల్లు అనే అంగీకరిద్దాం. ఆ పక్షంలో వారు 'పెను' అనే శబ్దాన్ని 'పెన్+ఉ' అని విడదీసి నకార ద్విత్వాన్ని సాధించి 'పెన్ను' అనే రూపాన్ని సాధించారు. కాని 'పెన్ను' అనే వ్యస్తరూపం నేడు 'ఫౌంటెన్ పెన్ను' అనే అర్థంలో మాత్రమే అన్యదేశ్యంగా కనిపిస్తోంది గాని 'పెను' అర్థంలో ఎక్కడా లేదు. ఇక్కడ ప్రౌఢవ్యాకర్త సూత్రాన్ని వ్యాఖ్యాత సరిగా అర్థం చేసుకున్నట్లు కనబడదు. 'తరచుగఁ గర్మధారయ సమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చుపరంబగు నపుడు ద్విత్వంబు గానంబడియెడి' అని సూత్రము. సమాసంలో అచ్చుపరముగా వుండడమంటే పరపదాదినున్న అచ్చు అనే మనం అర్థం చేసుకోవాలి. అలా కానినాడు 'కర్మధారయ సమాసంబునన్' అనే దళం వ్యర్థం కావలసి వస్తుంది. 'పెను' మొదలైన శబ్దములన్నిటిలోనూ చివరనుండేది అచ్చే కాబట్టి ఆ అచ్చునే వ్యాకర్త ఉద్దేశించినట్లైతే 'అచ్చుపరంబగునపుడు'

అని ప్రత్యేకంగా పేర్కొనవలసిన అవసరం లేదు. అంతేకాక స్ఫూర్తిశ్రీ గారు మరొక స్థలంలో చెప్పినట్లు 'సమాసమునందలి పూర్వపదము అంతము కాకయే ఉత్తరపదము ప్రారంభము కాదు.' (190 పేజీ) పూర్వపదానికి ఉత్తరపదానికి ఏకత్వం సిద్ధించడం సమాస మేర్పడిన విషయము. అందుచేత స్ఫూర్తిశ్రీ గారు సాధించిన 'పెన్ను' అనే రూపం సమాస విషయకం కాబోదు. ఈ విషయంలో తత్త్వ బోధిని— ఇతర వ్యాఖ్యానాలు చూపిన ప్రక్రియ ఆమోదయోగ్యంగా వుంది. వారి వ్రాతను అనర్థంగా భావించడంలో మన వ్యాఖ్యాత తొందరపాటు కని పిస్తూంది.

'ఉదంత స్త్రీసమంబులకును, బుంపులకు, నదంత గుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు' అనే సూత్రరచనలో 'తనము' ప్రత్యయ మేయే రూపములకు వచ్చునో సూచించుటయే వ్యాకర్త యభిప్రాయము' అని వీరి వ్యాఖ్య. ఈ రాత తాటిచెట్టు ఎందుకు ఎక్కావురా? అంటే 'దూడ గడ్డికి' అనే తీరుగా వుంది. 'తనము' వచ్చే స్థలా లన్నిటిలోనూ నుగాగమము ప్రవర్తిస్తుందా? రాముని తనము, పెద్దతనము, గొప్పతనము, దొరతనము, మగ తనము—మొదలైన స్థలాల్లో 'తనము' లేదా? ఆ రూపాలను గూర్చి సూరి ఎందుకు తొందర పడ లేదు? 'తన వర్ణకంబు త్వార్థంబు నందగు' అని సూత్రించడం దాటవేయడం ఎలా గయిందో తెలి యడం లేదు. అందుచేత ఇక్కడ 'నుగాగమ ప్రాప్తి ఆనుషంగికమే కాని ప్రధాన ఫలము కాదు' అనే వ్రాత తప్పగా కనిపిస్తుంది. ఒక్క 'తనము' కోసమే సూత్ర రచన ఆరంభిస్తే 'ఉదంత స్త్రీ సమంబులకును, బుంపులకు' అని వాటిని మళ్లీ పేర్కొనడం వ్యర్థమే కదా!

'తలపూవాడక యుండుము' అనే పారిజాతాప హరణ ప్రయోగాన్ని 'తలపు+ఊవాడక' 'తలపూ+ వాడక' అని రెండు విధాలుగా విడదీయడం సందర్భ సముచితమని స్ఫూర్తిశ్రీ గారు భావిస్తున్నారు. ఈ విరుపుల ప్రసంగం ఇక్కడ అనవసరమే కాక అసంగ తంగా కూడా కనిపిస్తుంది. 'ఊవాడక' అంటే స్ఫూర్తిశ్రీ గారు ఏవిధమైన అర్థాన్ని ఊహించారో, ఆ రూపం ఏవిధంగా సాధ్యమో, ఎవరైనా ప్రయో గించారో — లేవో వారు చెప్తేనే కాని తెలియదు. 'ఊగుచాడక=కదలక' అనే అర్థాన్ని వారు ఆశించి నట్లైతే 'తలపూ(వు)+అడక' అని విరిస్తే సరిపో వచ్చును. 'పూ' శబ్ద విషయంలో వీరు 'స్వర పరక పూ శబ్దమునకుఁ బ్రయోగము శ్రీనాథాద్యర్వాచీనుల కావ్యములందును గన్పట్టలేదు. భారతాది ప్రాచీన కావ్య ములలో 'పూ' అను దీర్ఘాంత శబ్దమే కానరాదు' అనే సఖ్యలవారి మతాన్ని అనుసరించారు.

'సమాసముందుఁ దత్సమంబు పరంబగు నపు డును నుగాగమాదులు గానంబడియెడి' అనే సూత్రం లోని 'నుగాగమాదులు' అనే దళాన్ని లసందర్భంగా ఆలోచించి కుశంకను కొన్ని తెచ్చుకున్నారు స్ఫూర్తిశ్రీ గారు. ఇది ప్రాతాదుల సందర్భంలోనిది. ప్రాతాదులకు నుగాగమ, వర్ణలోప, వర్ణవికారాదులను విధించడం జరి గింది. ఈ సందర్భాన్ని బట్టి ఆలోచిస్తే 'ఆది' పదం చేత వర్ణ లోపాది కార్యాలు వస్తాయని సవ్యంగా అర్థం చేసుకోవచ్చును. వ్యాఖ్యాత కావాలని 'ఆది శబ్దము చేత టుగాగమము మున్నగువాని గ్రహింపవలయునని భావమా?' అని శంకించి కొంత కుతర్కంలో గ్రంథాన్నిపెంచి చివరకు 'ఆది' పదంచేత వర్ణలోపా దులు గ్రాహ్యములని తానే చెప్పారు. ఈ పద్ధతి తానే తుమ్ముకుని తానే శతాయుష్షు అనుకున్నట్లుంది. ప్రౌఢ వ్యాకర్త ఆ సూత్రము దిగువనే 'సంధియందు వర్ణవికారము' అని వ్రాయడం 'ఆది' పదంయొక్క అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్తూంది.

'కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వ పదాంత్య డకారంబు నకారంబగు' అనే సూత్రా నికి రెన్నాళ్లు, మూన్నాళ్లు, వేన్నీళ్లు అను ఉదాహ రణల నీయడం జరిగింది. ఇక్కడ వ్యాఖ్యాత 'ఇట్టి ప్రయోగము లింకను బెక్కులు గలవు. ప్రౌఢ వ్యాకర్త వీనిని మాత్రమే గ్రహించి వానిని విడువవల సిన పనిలేదు' అని వ్రాస్తూ ఏన్నాళ్లు, పేన్నీళ్లు, ఇన్నాళ్లు, కొన్నాళ్లు, ఎన్నాళ్లు, చన్నీళ్లు—మొదలగు వానిని కష్టపడి తాను సేకరించిన ప్రయోగాలతో

చూపారు. తా నిన్ని ప్రయోగాలను ప్రదర్శించడం వ్యాఖ్యాత యొక్క బహుగ్రంథ పరిశీలనను ప్రకటించ డంతోబాటు గ్రంథ సంఖ్యనుకూడా పెంచడానికి బాగా ఉపయోగించింది. ఈ ఉదాహరణలలో రెండురకాల ప్రయోగాలున్నాయి. ఏన్నాళ్లు, పేన్నీళ్లు— అనేవి ప్రౌఢ వ్యాకరణ సాధ్యాలు. మిగిలినవి ప్రౌఢవ్యాకర్త గుర్తింపనివి. వీటన్నిటిని కలిపి 'ఇట్టిప్రయోగము లింకను బెక్కులు గలవు' అనడంలో వ్యాఖ్యాత అభిప్రాయం స్పష్టంగా లేదు. ఏన్నాళ్లు, పేన్నీళ్లు— వంటి ప్రయోగాలనన్నింటినీ చూపనందుకు ప్రౌఢ వ్యాకర్తను తప్పుపట్టడం వింతగా వుంది. ఏ వ్యాకర్త ఐనా తన విధికి అనువైన ఉదాహరణలను కొన్నింటిని ప్రదర్శించడం అలవాటులో వుందికాని దొరికిన ప్రయోగాల పట్టిక నంతటినీ చూపవలసిన అవసరం లేదు. మూన్నాళ్లు, పెన్నీళ్లు—అనే స్థలాల్లో 'ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' అనే సూత్రంవల్ల ప్రవర్తించే హ్రస్వాన్ని వారించడం వాంఛనీయమని వ్యాఖ్యాత అభిప్రాయపడ్డారు. ఈ వాంఛ సరియైనదేకాని వ్యాఖ్యాల దృష్టిలో సూరి విధించిన 'అగు' అనేవిధి నిత్యవిధి కాదు కాబట్టి వారికి ఆ విధిని వారింపవలసిన వాంఛ ఎలా కలిగిందో తెలియడం లేదు.

'అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును' అనే సూత్రం వద్ద నిషేధార్థాన్ని వివరిస్తూ, వ్యాఖ్యాత పర్యుదాసమునకుఁ 'రాముఁడు అబ్రాహ్మణుఁడు' అనే ఉదాహరణను గ్రహించారు. కాని పర్యుదాసానికి దిది ఉదాహరణం కాదు. 'రాముడు అబ్రాహ్మణుడు' అనేటప్పుడు విధేయాంశమైన 'అబ్రాహ్మణుడు' అనేపదం వాక్యంలో ప్రాధాన్యతను సంతరించుకుంది. 'ప్రధాన్యంహి విధేర్యత్ర ప్రతిషేధః — అప్రధానతా పర్యుదాసః సవిజ్ఞేయో యత్రోత్తర పదేన నఞ్' అని లక్షణము. ఈ ఉదాహరణలో 'అబ్రాహ్మణుడు' అనే దానికి ప్రాధాన్యముండడంచేత, సాదృశ్యబోధకమైన ఈ నఞర్థము ప్రతిషేధమే అవుతుందికాని పర్యుదాసం కాదు. 'అబ్రాహ్మణుడగు రాముఁడు' అనే తీరుగా ఉదాహరణముంటే అది పర్యుదాస మవుతుంది. 'ఈ పర్యుదాసమువలన అనుదంతమునకు వలెనే ఉదంతమునకును నిగాగమము అగును; ఇంతవరకును సాదృశ్యము. ఉదంతమునకు నిగాగమము వైకల్పికము;ఇది భేదము' అనే విధంగా రాయడంవల్ల పర్యుదాసాన్ని వ్యాఖ్యాత చక్కగా అర్థం చేసుకున్నట్లు కనబడదు. ఉదంతములు కాని వానికి నిగాగమము నిత్యము; ఉదంతములకు నిగాగమము వికల్పము అనే అర్థాన్ని సూటిగా చెప్తే విద్యార్థులకు ఉపయోగకరంగా వుంటుంది. అసలు 'అనుదంతము' అనే పర్యుదాసములోని నఞర్థము తదన్య బోధకమేగాని తత్సాదృశ్యార్థకముకాదు. అంటే 'అనుదంతములు'అనే పర్యుదాసానికి 'ఉదంత భిన్నములు' అనే అర్థం చెప్పాలి గాని 'ఉదంత సాదృశ్యము కలిగియు ఉదంత భిన్నములు' అనే అర్థం పనికిరాదు. సూర్యారాయశ్రీ గారి భ్రమకు 'ఇట్టి పర్యుదాసము నాశ్రయణమున మగాదులు డుక్ప్రాప్తి విషయమున నుదంత తుల్యములును, నిగాగమప్రాప్తి విషయమునఁ దద్భిన్నములును నగునని ఫలితము తేలెడి' అనే పేటికాకారుల అభిభాషణాన్ని తప్పుగా అర్థం చేసుకోవడం మూలమనిపిస్తుంది.

'వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు' అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ 'బాల వ్యాకరణము అన్యదేశ్యములను వేరుగా పరిగణింపలేదు. కావున అవియు వికృతి శబ్దములలోనే యంతర్భావింపవలసి యున్నది' అని తీర్మానించారు. జిగినీ—తనికీ అనే పదాలలో ఉపోత్తమేత్వమున కుత్వము రాకపోవడానికి అవి ఈ కారాంతము లవడం కారణంగా చెప్పారు. కాని చిన్నయసూరి గాని, ఇతర వ్యాకర్తలు గాని 'వికృతి పదాలలో అన్యదేశ్యా లున్నట్లు ఎక్కడా చెప్పలేదు. అందుచేత ఇది సరికాదు. 'హ్రస్వేకారాంత శబ్దముల యుపోత్తమేకారములకె యుత్త్వము కలుగుననియు నెఱుంగునది. ఉః—తనికీలు' అనే వజ్ఝలవారి వ్రాత ఈ అభిప్రాయానికి ఆధారంగా కనిపిస్తుంది. వికృతి పదాలతోబాటు అన్యదేశ్యా లన్నిటికీ మన వ్యాకరణాన్ని ప్రవర్తింప జేయలేము. సూర్యారాయశ్రీ గారే 'ఆచ్ఛిక'

శబ్దాన్ని వివరిస్తూ 'ప్రకృత సమములు, సంస్కృత భవములు, ప్రాకృత భవములు, దేశ్యములు' అని వ్రాసారు. కాబట్టి 'బాల వ్యాకరణము అన్యదేశ్యములను వేరుగా పరిగణింప లేదు' అనడం సబబు కాదు. అసలు అన్యదేశ్యములను పరిగణింపనే లేదు. 'ఇచ్చట వికృతి పదముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు' అని మాత్రమే సూరి పరిగణించడం జరిగింది.

'లలడోపధ నవార్థాదుల యుపోత్త్యమేత్వంబున కుత్వంబు గలుగదు' అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ మన వ్యాఖ్యాత 'రాపుడులు' అనే రూపాన్ని సాధించిన తీరు చూడండి. 'రాచు అను ధాతువునకు కృదంత రూపము 'రాపుడు' అంటారు వీరు. ఏ కృదంత ప్రత్యయము చేరినందువల్ల ఈ రూపం సిద్ధించిందో చెపితే సంతోషంగా వుండేది. నిజానికిక్కడ 'రాపు' అనే శబ్దంమీద 'రాయున కిడి పర్ణకంబగు' అనే ప్రౌఢ వ్యాకరణ విధానంవల్ల 'ఇడి' అనే కృదంత ప్రత్యయంచేరి 'రాపిడి' అనే పదం ఏర్పడింది. సూర్యారిశ్రీ గారు చెప్పినట్లు 'రాపుడు' అని కావాలంటే 'ఉడు' లేక 'డు' అనే కృత్ప్రత్యయ మేదైనా వుండాలి. వ్యాకర్తలు దానిని చెప్పలేదు. 'రాపుడు' అనే ఏక వచనంలో కూడిన ప్రయోగాన్ని ఈ స్థలంలో చూపించి వుంటే యుక్తిసహంగా వుండేది. 'రాపిడి' యనునది 'రాపిడులు' అని మాత్రమే యగుననియు, 'రాపుడులు' అని యున్నచో 'రాపుడు' అను దానికి బహువచన రూపముగా గ్రహింపవలయుననియు సూచించుటకే సూరి యీ లక్ష్యమును చూపి యుండును'అని వ్రాయడం చిన్నయసూరి పట్ల వారి కుండే గౌరవానికి చిహ్నం.

'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ 'క్ష్మ' అనే (క్—ష్—మ్—అ) నాలుగు వర్ణాలతో కూడిన అక్షరాన్ని చూపించి 'బాలవ్యాకరణము అక్షరమునకు, వర్ణమునకు గల యీ భేదమును సూక్ష్మముగా పాటించును. కావున పెటు కొనవలయును' అని వ్రాసారు. సూక్ష్మముగా అంటే నిశితంగా అనో! తక్కువగా అనో! వ్యాఖ్యాత అభిప్రాయం స్పష్టంగా తేటపడలేదు. కాని ఈ విషయంలో సూరి అంతపట్టుదల లేనివాడు కావడంచేత దీనిని గుర్తుపెట్టుకో నవసరం లేదు. 'క్ష్మ 'ఇత్యాదు లను అక్షరంగా పఠించిన చిన్నయసూరి 'ఋవర్ణము' ఇత్యాదిగా అక్షరాలనుకూడా వర్ణాలుగా పరిగణించడం కనిపిస్తోంది.

'ముదాగులకు ప్రథమైక వచన లోపంబు లేదు' అను సూత్రం దగ్గర 'సక్' శబ్దమునకు ప్రథమైక వచన తుల్యము ప్రాతిపదికగా 'సక్కు' అనురూపము రమణీయ సమీక్షాకారులు చూపిరి. అది మృగ్యము' అని సాధికారంగా వ్రాసారు. వాస్తవానికి 'సక్కు' అనే రూపాన్ని మొదట చూపిన వారు రమణీయ సమీక్షాకారులూ కాదు; మొదట కాదన్నవారు సూర్యారిశ్రీగారూ కాదు. పై వారకు 'అహో బలపతి ఉపానత్తు, సక్కు అని యుదాహరించెను. కాని వీని యగుణ వర్ణణ స్థితికి ప్రయోగములను చూప లేదు' అనే వజ్ఝలవారి వాక్యాలు మూలంగా భావించ వచ్చును. వజ్ఝలవారు కూడ 'ప్రయోగములను చూపలేదు' అన్నారు గాని మన వ్యాఖ్యాత వలె 'మృగ్యము' అనలేదు. సూర్యారిశ్రీ గారు సాధువులుగా పరిగణించిన కయులు, హోలకు, గ్లౌలకు మొదలైన అనేక రూపాలకు ప్రయోగాలు చూపలేదు. అందు చేత ఆ రూపాలన్నీ 'మృగ్యము' అని అనగలమా! 'దృక్—దృక్కు' 'దిక్—దిక్కు' 'వాక్ — వాక్కు' 'కకుప్—కకుప్పు' అనే వాని సాదృశ్యంతో 'సక్కు' అనే రూపం అంగీకారయోగ్యంగా కనిపిస్తూంది. "దీవ్యన్తీ—గచ్ఛన్తీ' మున్నగు స్త్రీ లింగ రూపములను హ్రస్వము కలిగి 'దీవ్యంతి—గచ్ఛంతి' మొదలైన తత్సమ రూపా లేర్పడతాయని సూర్యారిశ్రీ గారు వ్రాసారు. ఏదీ ఎక్కడైనా ఇలాంటి ప్రయోగముంటే చూపించమనండి. అది మణిప్రవాళంలో గాని సాధ్య మయే పని కాదు.

'అంగాదులకుం దప్ప సంయోగోపధంబులకు జీ ప్రత్యయంబు లేమిం జేసి మీన నేత్రి—పద్మ నేత్రి ఇత్యాదు లసాధువులు' అనే పఠంలో వీరు వజ్ఝలవారి ననుసరించారు. కాని వజ్ఝలవారి వ్రాతను శ్రద్ధగా

గమనింపక పోవడం చేత కొంత రసాభాస జరిగింది. 'స్త్రీలింగ రూపములలో ఈ-కారమును విధించుటకు జీప్, జీష్, జీన్— అని మూడు ప్రత్యయములను సంస్కృత వ్యాకర్తలు వాడుదురు. ఆ మూడింటిని కలియ గలుపు కొని సూరి జీ ప్రత్యయమని వాడెను' అని సాధికారంగా చెప్పారు. కాని 'జీ' అని వాడినది సూరి కాదు. 'ఙ్యాప్ప్రాతి పదికాత్' అనే సూత్రంలో పట్టి జీప్, జీష్, జీన్‌లను మూడింటిని గ్రహించడానికి పాణిని 'జీ' అని వాడినట్లు పణ్డితుల వారు వ్రాసారు. అందుచేత 'కలియ గలిపి' వాడినది సూరి అనడం భావ్యం కాదు. అంతే కాకుండా 'జీష్ ప్రత్యయంబు లేమిం జేసి' అని పాఠాన్ని సవరించుకోవాలని పణ్డితుల వారు సూచించారు. 'సాఙ్గాచ్చోప సర్జనా దసం యోగో పధాత్', 'అంగ గాత్ర కణ్ఠేభ్యో వక్తవ్యమ్' మొదలైన విధులు జీష్ ప్రత్యయానికి సంబంధించి నవి. సూరి 'అంగాదులకు దప్ప' అంటూ ఆ సందర్భాన్ని కంఠోక్తిగా స్మరించిన కారణం చేత ఇక్కడ 'జీష్' అనేదే సరియైన పాఠంగా అంగీకరించాలి. పేటేటి కర్త మొదలైనవారు 'జీష' అనే పాఠాన్నే అంగీకరించారు 'జీ' అనే పాఠం విషయంలో పణ్డితుల వారి ననుసరించిన సూర్యనారాయణశాస్త్రి గారు 'మీనన్నేత్రి ప్రభృతులును సాధువులే యనందగును' అని ప్రయోగ పూర్వకంగా పలికిన పణ్డితుల వారి అభిప్రాయాన్ని అంగీ కరించలేదు 'మీనన్నేత్రి, పద్మనేత్రి—మున్నగు అనిష్ట రూపములు కలుగ రాదు' అని వ్రాసి సూరి పట్ల తమకు గల భక్తి ప్రపత్తులను ప్రదర్శించుకున్నారు.

'వాని యంతట వాడున్నాడు'- ఇక్కడ 'వేఱుగా' అనే అర్థంలో వాడబడిన 'అంతట' అనే శబ్దం 'అంత' శబ్దం కంటె భిన్నం కాదని సూర్యనారాయణశాస్త్రి గారి వాదం. 'అంత' అనే శబ్దం మీద ఔప విభక్తిక 'టి' వర్ణము చేరి 'అంతటి' అని కాగా 'ఔప విభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనే సూత్రం చేత అత్వం సిద్ధించి 'అంతట' అయిందని వారి అభిప్రాయం. ఇక్కడ కొన్ని చిక్కులున్నాయి. 'అంతటి' అన్న చోట 'హ్రస్వము మీద టి వర్ణకంబు నకు ముందు పూర్ణ బిందువు బహుళంబుగా వగు' అనే విధి ప్రకారం పూర్ణబిందువుతో కూడిన 'అంతంటి' అనే రూపం కూడా వుండాలి. ఒక వేళ అది కాదను కున్నా తృతీయా సప్తములకు వచ్చే అత్వం బహుళం కాబట్టి అత్వం రానప్పుడు 'అంతటి' అనే రూపమే వుండాలి. ఇన్ని అరిష్టాలు దాటినా 'అంతటి' అనే దానికి 'వాని యంతటి చేత వాడున్నాడు' అనే తృతీ యార్థంలో అత్వం వస్తుందా? 'వాని యంతటి యందు వాడున్నాడు' అనే సప్తమ్యర్థంలో అత్వం వస్తుందా? ఏదీ పొసగదు. అందుచేత 'అంతట' అనేది పదమనే ప్రౌఢవ్యాకర్త మతమే సమర్థనీయంగా వుంది.

ఈ పరిశీలనవల్ల మరొక విషయం తేలు తూంది. శ్రీ సూర్యనారాయణశాస్త్రి గారు వ్యాఖ్యాన విధానంలో కొంతపక్షపాత దృష్టి అవలంబించారు. బాలవ్యాకర ణంలో వున్న లోటుపాట్లను సూరిమీదగల అభిమా నంతో సర్దుబాటు చేయడానికి అనేక స్థలాల్లో ప్రయ త్నించారు. ప్రౌఢ వ్యాకరణంమీద వీరికి తక్కువ అభిప్రాయమున్నట్లు ఈ వ్యాఖ్యానంవల్ల గ్రహించ వచ్చును. ప్రౌఢవ్యాకర్త క్రొత్తవిషయాలు చెప్పిన స్థలాల్లోకూడా ఇది బాలవ్యాకరణానికి 'వివరణము', 'పూరణము' అని అంటారే గానీ 'సవరణము' అనడానికి వీరు అంగీకరించరు. అనేక స్థలాల్లో ప్రౌఢ వ్యాకరణ సూత్రాలలో నున్న లోటుపాట్లు ఎత్తిచూపుతూ సూత్రాలను ఏ విధంగా మార్చితే బాగుంటుందో వీరు సూచించారు. ఏది ఏమైనా 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వం' సూర్యనారాయణశాస్త్రిగారి బహుముఖ కృషిని వెల్లడి స్తూంది. వారి కృషి అభినందనీయము.

నేను ముందుగా పేర్కొన్నట్లుగా ఈ పరిశీలన 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము'లోని మొదటి సంపుటికే పరిమితము. అందులోకూడా పరిశీలింప దగినవి ఇంకా కొన్ని విషయాలున్నాయి. కాని వ్యాసం ఇప్పటికే పెద్దది కావడంవల్ల వానిని ప్రస్తావించలేదు. శాస్త్రీయసత్య నిరూపణమే ప్రధానాశయంగాగల ఈ పరిశీలనలోని సామంజస్యాన్ని సహృదయులు అంగీక రిస్తారని ఆశిస్తున్నాను. అవకాశం లభించినపుడు 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము—రెండవ సంపుటి' లోని విశేషాలను గూర్చి మనవి చేయగలను.

# వాలివధ-వాల్మీకి తీర్పు

## శ్రీ శలాక రఘునాథ శర్మ

1972 అక్టోబరునెల భారతి సంచికలో శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావు గారు 'వాలి వధ—వాల్మీకి తీర్పు' అనే తమ వ్యాసంలో వాలివధ విషయంలో రామునిది ధర్మమార్గంకాదనీ రాముడు వాలిచేసిన ఆక్షేపణలకు సంతృప్తికరమైన సమాధానం చెప్పలేదనీ, రాముడివాదం ధర్మసమ్మతమని వాల్మీకికే నమ్మకంలేదనీ వ్రాస్తూ వాలి వాదమే 'ధర్మార్థ సహితమని వాల్మీకి తీర్పు' అని తీర్మానించారు. వారి తీర్పు ప్రమాద భూయిష్ఠమనీ వాల్మీకి రామాయణం లోని ఈ భాగాన్ని వారు సరిగా అర్థం చేసికోలేదనీ భావిస్తూ సామాన్య జనానికి బుద్ధిభేదం కలుగరాదనే తాత్పర్యంతో వీరు వ్రాసిన అంశాలను పరామర్శిస్తాను.

నిజానికి వాల్మీకి మహర్షి ఈ సందర్భంలో సాధారణంగా మందాధికారులకు సందేహ ముత్పన్న మవు తాయనే దృష్టితోనే మరెక్కడా రాక్షస సంహార సందర్భంలో చేయని ధర్మాధర్మ మీమాంస యీ వాలి వధ ఘట్టంలో చేశారు. అయినా కొందరు వాలి మార్గమే ధర్మమార్గమని భావించే ప్రమాదం లేక పోలేదని, నిష్ణాతులై సద్విమర్శన పాటవం గలిగిన పండితులు ఈ విషయాన్ని కూలంకషంగా చర్చించి సిద్ధాంతాలు చేసి ఉన్నారు. శ్రీ ములుకుట్ల నరసింహావధానులు గారి రామాయణ సారోద్ధారం అను గ్రంథాన్ని గానీ, ఆంధ్ర వాల్మీకులు శ్రీ వావిలకొలను సుబ్బారావు గారి మందర వ్యాఖ్యా సహిత ఆంధ్ర వాల్మీకి రామాయణాన్ని గానీ జాగ్రత్తగా పరిశీలించిన వారికి ఈ ఘట్టంలో సందేహాలు, భ్రాంతులూ ఉండటానికి అవకాశం లేదు. శ్రీ తిరుపతిరావుగారి వ్యాసాన్ని చూస్తే వారీ గ్రంథాలను పరిశీలించినటు తోచదు.

శ్రీ రావుగారు చేసిన ప్రధాన అభియోగాలు ఇవి.

(1) వాలి తన తప్పు ఒప్పుకొనటం పుత్త్ర ప్రేమతోనే కాని దోషిననే తాత్పర్యంతో కాదు.

(2) వాలి చేసిన ఆక్షేపణలకు ఒక్కదానికైనా రాముడు సంతృప్తికరమైన సమాధానా లివ్వలేదు.

(3) వాల్మీకి వాలిని మహాత్ముడనీ, లనుత్తముడనీ ఈ మొదలుగా కొనియాడాడు. అట్లాగే వాలి వాక్యాలను గూడ ధర్మార్థ సంహితమూ, హితమూ మున్నగు రీతిగా ప్రశంసించాడు. కాని రాముడి వాక్యాలకు అట్టి ప్రశంసలు లేకపోగా రాముణ్ణి గర్వితం, రణ గర్వితం మున్నగు విధంగా పేర్కొన్నాడు. కాబట్టి వాలి వాదమే ధర్మార్థ సహితమని వాల్మీకి తీర్పు.

ఈ పై అభిప్రాయాలలోని సారాన్ని రామాయణంలోని ఆధారాలతోనే పరిశీలిస్తాను.

(1) వాలి వివేకం గలిగి తప్పు ఒప్పుకున్నా, పుత్త్ర వాత్సల్యంతో తప్పు ఒప్పుకున్నా చేసిన దోషం లోనూ, పొందిన శిక్షలోనూ మార్పేమీ ఉండదు. వాలి, తన తమ్ముడు, ఏ తప్పూ బుద్ధిపూర్వకంగా చేయలేదని, పొరపాటు జరిగిందని కాళ్ళా వేళ్ళా పడి ప్రార్థిస్తే నిజా నిజాలు తెలుసుకోకుండా దేశ బహిష్కార శిక్ష విధించి, వెంటబడి తరిమి, అతడు బ్రతికి ఉండగా అతని భార్యను అపహరించి తన వశం చేసికొని చేసిన ద్రోహమంతా ఒప్పుకున్నా ఒప్పుకోక పోయినా దోషమే అవుతుంది. కాబట్టి పుత్త్ర వాత్సల్యంతో తప్పు ఒప్పుకున్నాడనేది వాలి దోషాన్ని పరిహరింప జాలదు. ఇంతకు శ్రీ రావుగారీ వాక్యాలను శ్రీ కుమారస్వామి గారి వాక్యాల నాక్షేపించటానికి వ్రాశారు కాబట్టి అంతగా పట్టించుకోటానికి వీలు లేదు. కాని ఈ సందర్భంలో వీరు తమ అభి

ప్రాయాన్ని సమర్థించుకోటానికి సుగ్రీవుడి శీలాన్ని నిరూపించటానికై రామాయణంలోని అంగదుని వాక్యాలను ఉపపత్తులుగా గ్రహించారు. ఆ అంగదుని మాటలను బట్టి సుగ్రీవుని శీలాన్ని వెల కట్టి, అట్టి సుగ్రీవుడు తన ప్రాణసమానుడైన కొడుకును తప్పక చంపుతాడు కాబట్టి వాని సంరక్షణార్థం రాముని సౌముఖ్యం సంపాదించాలనే కాంక్షతో తన తప్పును వాలి ఒప్పుకున్నాడని వీరు అభిప్రాయపడ్డారు.

సుగ్రీవుడు అంగదుడి విషయంలో క్రూరంగా ప్రవర్తిస్తాడనటానికి అంగదుడి వాక్యాలు తప్ప వేరే ఆధారా లేమీ లేవు. సుగ్రీవుడి మాటలు మాత్రమే విని వాలి దోషాన్ని నిర్ణయించిన రాముడు అధర్మ పరుడని తీర్మానించిన శ్రీ రావుగారు అంగదుడి మాటలను మాత్రమే చూపి సుగ్రీవుడి శీలాన్ని తీర్మానించటం ఆశ్చర్యము. నిజానికి కిష్కింధ 53 వ సర్గలో అంగదుడు ఒక పెద్ద రాజకీయపు ఎత్తు ఎత్తాడు. వానరులలో వాలి పక్షం వాళ్లను భేదించి తాను వారికి రాజై సుగ్రీవుని నుండి విడివడి క్రొత్త రాజ్యాన్ని స్థాపించి తండ్రి వధకు ప్రతీకారం చేయాలనే ఉద్దేశం అంగదుడి మాటలలో ఉంది. దీనికి వీలైతే బుద్ధిమంతులైన హనుమజ్జాంబవదాదులను గూడ త్రిప్పాలనే ప్రయత్నంలో బుడి బుడి ఏడుపు లేడ్చి లేనిపోని నిందలను సుగ్రీవుడి మీద మోపి ఆతని మీద తక్కినవాళ్లకు వైరస్యం ఏర్పడే ప్రయత్నం చేశాడు. బుద్ధి మద్వరిష్ఠుడైన హనుమంతుడికి అంగదుడి మాటలను వినటంతోనే కలిగిన అభిప్రాయం చూడండి.

> తథా బ్రువతి తారేతు తారాధిపతి వర్చసి
> అథ మేనే హృతం రాజ్యం హనుమా నఙ్గ దేనతత్
> బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం చతుర్బల
> సమన్వితం
> చతుర్దశ గుణం యేనే హనుమాన్ వాలినః సుతమ్.
>
> కిష్కింధ – 54 స. 1, 2 శ్లో.

అంగదు డట్లా పలుకగా హనుమంతుడు అంగదుడు రాజ్యాన్ని అపహరించినట్లుగా భావించాడు. అంగదుణ్ణి అష్టాంగ యుక్తమైన బుద్ధితోను, చతురంగ బలంతోనూ కూడినవాని గానూ, పదునాలుగు గుణములు గలవాని గానూ సంభావించాడు.

ఇట్లా భావించి హనుమంతుడు ఏమి చేశాడో ఏమన్నాడో పరికిద్దాము.

> భర్తు రర్థే పరిశ్రాంతం సర్వ శాస్త్ర విశారదః
> అభి సంపూజ్య మారే భే హనుమానం గదం తతః
> స చతుర్ణా ముపాయానాం తృతీయ ముప వర్ణయన్
> భేద యా మాస తాన్ సర్వాన్ వానరాన్ వాక్య
> సంపదా.
>
> కిష్కింధ 54 స. 5, 6 శ్లో.

అంగదుడు స్వామి కార్యంలో అలసినాడని గుర్తించి సర్వశాస్త్ర విశారదుడైన హనుమ భేదోపాయాన్ని అవలంభించి అంగదుణ్ణి వానరులనూ, భేదించటానికి ఆరంభించాడు.

హనుమంతుడన్న ఆయా మాటలను పరిశీలిద్దాము.

> త్వం సమర్థ తరః పిత్రా యుద్ధే తారేయ వై ధ్రువమ్
> దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా
> నిత్య మస్థిర చిత్తాహి కపయో హరి పుంగవ
> నా జ్ఞా ప్యం విషహి ష్యన్తి పుత్ర దారం వినాత్వయా
> త్వాం నైతే హ్యనురంజేయుః ప్రత్యక్షం ప్రవదామితే
> యథాయం జాంబ వాన్ నీలః సుహోత్రశ్చ మహాకపిః
> న హ్యం తే ఇమే సర్వే సామదానాది భిర్గుణైః
> దండేన న త్వయా శక్యాః సుగ్రీవా దప కర్షితుమ్.
>
> కిష్కింధ 54 స. 8 నుండి 11 వరకు.

నాయనా నీవు యుద్ధంలో మిక్కిలి సమర్థుడివే. నీ తండ్రిలాగా కపి రాజ్యాన్ని ధరింపగలవు. కాని ఈ కోతు లున్నవే చపల చిత్తం మూక. పెళ్లాం బిడ్డలను వదలి నీ యాజ్ఞను పాలిస్తారనుకుంటున్నావా? ఒకవేళ వాళ్లు పాలించినా ఈ జాంబవంతుడు, నీలుడు సుహోత్రుడు నేనూ నిన్ను అనుసరిస్తా మనుకోవద్దు. మమ్ములను సామదాన భేదాలతోనే కాదు దండోపాయంతో కూడ సుగ్రీవుడినుండి వేరు చేయలేవు. ఇదిగో ఈ విషయమంతా నీ ముఖం మీదనే చెప్తున్నాను—హనుమంతుని ఈ మాటలు అంగదుని

కుత్సితాన్ని వెల్లడి చేస్తున్నవి కదా! కనుక వీని నాధారంగా చేసికొని సుగ్రీవుని శీలాన్ని నిరూపించటం వ్యర్థ ప్రయత్నమే అవుతుంది.

పైగా అంగదుడు, సుగ్రీవుడు నన్నది చేస్తాడు, ఇది చేస్తాడు అని అన్నాడే కాని దానికి ప్రమాణమేమీ చూపలేదు. తండ్రిని వంచించిన విషయాన్ని ఉదాహరించాడు కాని తనకు వైయుక్తికంగా జరిగిన అన్యాయాన్ని పేర్కొనలేదు. తండ్రిని వధింపజేశాడన్న కోపంతో అంగదుడు సుగ్రీవుణ్ణి, క్రూరుడూ నృశంసుడూ అన్నాడంటే కొంత సరిపుచ్చుకోవచ్చు గాని, అవి అక్షరాలా యథార్థాలంటానికి వీలులేదు. వాలి పక్షాన్నాశ్రయించి అంగదుడి మాటలతో సుగ్రీవుని మనస్తత్త్వాన్ని నిరూపించటం న్యాయమైతే, సుగ్రీవ పక్షపాతులు హనుమంతుడన్న ఈ క్రింది వాక్యాల నుట్టంకించి అంగద వాక్యాలను ప్రత్యాఖ్యానించటమూ న్యాయమే అవుతుంది.

అస్మాభిస్తు గతం సార్థం వినీతవ దుప స్థితమ్
అను పూర్వ్యాత్తు సుగ్రీవో రాజ్యే త్వాం స్థాపయిష్యతి
ధర్మరాజః పితృవ్యస్తే ప్రీతికామో దృఢ వ్రతః
శుచిః సత్య ప్రతిజ్ఞశ్చ సత్వాం జాతు ననాశ యేత్
కిష్కింధ. 54 స. 20, 21 శ్లో॥లు.

మాతోపాటు వినయవంతుడవై అతని దగ్గఱకు వెళ్లినయెడల నిన్ను క్రమాన్ని పాటించి సుగ్రీవుడు రాజుగా చేస్తాడు. నీ పినతండ్రి ధర్మరాజు, ప్రీతికాముడు, దృఢవ్రతుడు, పరిశుద్ధుడు, సత్యప్రతిజ్ఞుడు నిన్నెపుడూ చంపడు.

ఈ మాటలు సుగ్రీవుని సుగుణ సంపదను చాటుతున్నవి కదా! కాబట్టి అంగదుని మాటలను ప్రమాణీకరించి సుగ్రీవుని తత్త్వం నిర్ణయించి, వాని భయంతో వాలి తప్పు ఒప్పుకున్నాడనటం గ్రంథ తాత్పర్యం కాదు, పైగా వాలి పుత్త్ర సంరక్షణార్థం లోపల లేకపోయినా పైకి రామునియందు విధేయత చూపించాడని శ్రీ రావుగారంటే అది అతని కాపట్యాన్ని వెల్లడిచేస్తూ ఔదాత్త్యాన్ని క్రుంగదీస్తుంది. ప్రధాన నాయకుడితోపాటు ప్రతి నాయకులను కూడ ఉదాత్తంగా చిత్రించే వాల్మీకి అభిప్రాయానికి ఇది పూర్తిగా విరుద్ధం. కాబట్టి శ్రీ రావు గారు వాలిని అయ్యవారు చేయబోయి చివరకు మాషాలు కోతిని చేసి వదలిపెట్టారు.

మానవత్వం దృష్టితో ఈ సందర్భంలో పరిశీలించవలసిన మఱియొక ముఖ్యాంశం ఒకటి ఉన్నది. వాలి బాణాఘాతానికి తట్టుకోలేక సుమారు 50 శ్లోకాలలో రాముణ్ణి నోటికి వచ్చినట్లు తిట్టాడు. (కిష్కింధ, 53 వ సర్గ). ఇన్ని తిట్లు తిట్టిన తరువాత కేవలం పుత్త్ర రక్షణార్థం తప్పు ఒప్పుకుంటే మాత్రం రాముడు క్షమిస్తాడని వాలి ఎట్లా ఊహించగలడు? కాబట్టి పుత్త్రవాత్సల్య ప్రసంగం సముచితం కాదు. ఈ విషయంలో వాలి తాత్పర్యం స్పష్టంగా ముందు పరిశీలిద్దాము.

ఈ సందర్భంలోనే శ్రీ రావుగారిట్లా అంటున్నారు. 'వాలి తాను నిజంగా దోషిని, వధ్యుడను అని హృదయపూర్వకంగానే అంగీకరించాడని మనం నమ్మితే అతడు అదే గుక్కలో పలికిన ఈ మాటను గూడ నిజమని నమ్మవలసి వస్తుంది.

త్వత్తో౽హం వధమాకాంక్షన్
వార్యమాణో౽పి తారయా
సుగ్రీవేణ సహభ్రాత్రా
ద్వంద్వయుద్ధ ముపాగతః
కిష్కింధ. 18 సర్గ. 57 శ్లో.

రామా, నాకు నీ చేతిలో చచ్చిపోవాలని కోరిక ఉన్నది. కనుకనే తార వద్దంటున్నా వినకుండా సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాను.

ఈ మాటలో నిజం ఎంత ఉన్నదో, రాముడి సమాధానంతో వాలి సంతృప్తిపడటంలో కూడ అంతే నిజమున్నది.'

వీరి యీ వ్రాతలనుబట్టి వాలి చెప్పిన మాట నిజం కాదనుకోవాలి. కాని ఎందుకనుకోవాలో తెలియదు. తార శ్రీరామచంద్రుని గుణగణాలను, ధర్మసంపదనూ 15 వ సర్గలో 6 శ్లోకాలలో (16 నుండి 21 వఱకు) వర్ణించింది. వాలి కూడ వానిని అంగీకరించాడు (16 వ సర్గ. 5 వ శ్లో). కాని నా విష

యంలో పాపం చేయడులే అన్నాడు. తార మాటలను బట్టి రామచంద్రుని మహాత్మతను భావించి ఒక వేళ అతని చేతిలో మృతి పొందినా నయమే అని వాలి సంభావించినట్లూ, దానినే యిచట భాషించినట్లూ ఎందుకు భావించ కూడదు? కనుక వీరుట్టంకించిన పై విషయం వీరి వాదనను నిలుప లేదు.

(2) ఇంక రెండో అంశానికి వద్దాము. వాలి ఆక్షేపణలకు రాముడు సంతృప్తికరమైన సమాధానా లివ్వలేక పోయాడట. దానిని పరిశీలిద్దాము.

వాల్మీకి రామాయణంలో వాలి ఆక్షేపణలూ రాముడి సమాధానాలూ శ్రీ రావు గారు చెప్పిన క్రమంలో లేవు. రాముడు తన్ను కొట్టినందుకు తీవ్రమైన దుఃఖంతో వివేకం కోల్పోయి (విచేతసా, నష్టచేతనః) వాలి రాముణ్ణి నిందించాడు. ఆ నిందలో ఎక్కువ భాగం ధర్మాధర్మ విచారణకంటె, తీవ్రమైన బాణవేదనవలనఁ గలిగిన దుఃఖోద్వేగమే ప్రస్ఫుట మవుతుంది. కాబట్టి వాలి చేసిన ఆక్షేపణలన్నీ సువ్యవస్థిత చిత్తంతో చేసినవి కావు. ఈ మాట వాల్మీకి వాక్యాలలోనే ఉంది.

ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం
ధర్మార్థ సహితం హితమ్
పరుషం వాలినా రామో
నిహతేన విచేతసా.

కిష్కింధ, 18 సర్గ. 1 శ్లో॥.

ఇట్లు కొట్టబడిన వాలి విచేతసుఁడయి (వివేకం లేనివాఁడై పరుషంగా ధర్మార్థ సహితంగా హితంగా రాముణ్ణి అధిక్షేపించాడు.) ఇచట విచేతసుఁ డంటే 'బుద్ధిమాలినవాఁడై' అనే అర్థం చెప్పాలి కాని 'స్మృతి తప్పినవాఁడై' వంటి అర్థాలు పొసఁగవు అట్టివాడు అసలు మాటలాడుటయే పొసఁగదు గదా!

ఇంక రాముఁడు వాలి చేసిన నిందకు ఏమీ కోపగించక సావధానంగా తృప్తికరమైన సమాధానం చెప్పాడు. అందులో మూడు భిన్న మార్గాలలో వాలి వధ్యత్వాన్ని రాముడు నిరూపించాడు.

(1) ధర్మ విరోధాన్ని ఫేర్కొనటం : (అ) ఈ భూమి మాది, ఇందు అధర్మపరులను శిక్షించి ధర్మస్థాపన చేయటం మా ధర్మం. కిష్కింధ. 18 స. 6 నుండి 11 వఱకు. (ఇ) నీవు సంక్లిష్ట ధర్ముఁడవు. నీచకర్ముడవు. కామతంత్ర ప్రధానుఁడవై రాజు వర్తించవలసిన మార్గంలో వర్తించలేదు. (12). (ఇ) పుత్ర తుల్యుఁడైన తమ్ముడు బ్రతికి ఉండగా కోడలివంటి అతని భార్యయందు కామంతో వర్తించావు. లోక విరుద్ధమైన ఈ నింద్య కార్యానికి దండనకంటె వేరే మార్గ మేమీ లేదు. ఇట్టి పాపానికి వధయే దండమని స్మృతి. (14, 19, 20 శ్లో.లు).

(2) లౌకికంగా నేను సుగ్రీవుడితో మైత్రి చేశాను. అతనికి జరిగిన అన్యాయాన్ని వారించటానికి ప్రతిన పట్టాను. అది తీర్చాను. నా ప్రతిజ్ఞా నిర్వహణానికి నీవు వధ్యుడవే. (26, 27 శ్లో.)

(3) ఇంకా అవసరమైతే ఇంకొక కారణం. వేట నృపధర్మం. అది నిర్వర్తించాననుకో. నీవు మృగానివి. నేను క్షత్రియుణ్ణి. క్రూరమృగాలను చంపటం ధర్మమే కదా!

(36 నుండి 41 వఱకు)

ఇట్లా రాముడు మూడు విధాలుగా వాలి ఆక్షేపణకు సమాధానం చెప్పాడు. చెప్పిన తరువాత వాలి హృదయంలోఁ గలిగిన పరివర్తనాన్ని వాల్మీకి విస్పష్టంగా చెప్పాడు, చూడండి.

ఏవ ముక్తస్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశమ్
నదోషం రాఘవే దధ్యౌ ధర్మేఽధిగత నిశ్చయః

కిష్కింధ. 18. 44.

రాముడిట్లా అంటే వాలి మిక్కిలి నొచ్చుకొని ధర్మమునందు నిశ్చయాన్ని పొందినవాఁడై రాఘవునియందు దోషాన్ని నిలుపలేదు.

ఇది కాపట్యాన్ని శంకించటానికి వీలులేని కవి వాక్యం. ఇదే కాదు. రాముడు వాలి సమాధానం చెప్పిన తరువాత వాలి అంగదుణ్ణి రక్షించమని వేడుకొన్న పిదప రాము డతనిని ఊరడించాడని చెపుతూ వాల్మీకి అన్న మాటను పరికించండి.

స తమా శ్వాస యద్ రామో
వాలినం వ్యక్త దర్శనమ్ ।
సాధు సమ్మతయా వాచా
ధర్మ తత్వార్థ యుక్తయా ॥
కిష్కింధ. 18 స. 59 వ శ్లో.

రాముడు వ్యక్త దర్శనుడైన వాలిని సాధు సమ్మతమైనదీ, ధర్మ తత్వార్థముతో కూడినదీ అగు వాక్కుతో ఊరడించాడు. ఇది కూడ కవి వాక్యమే. ఈ వాక్యాలన్నీ రాముని సమాధానం విన్న తరువాత వాలి తన వధ్యత్వ విషయంలో పొందిన ధర్మ నిర్ణయాన్ని విస్పష్టం చేస్తున్నాయి. ఇవన్నీ ఇట్లా ఉండగా రాముడి సమాధానంపై తృప్తి పొందలేని శ్రీ రావు గారు ఈ క్రింది ఆక్షేపణలు చేశారు. వాని సారాన్ని చూద్దాము. (1) ఆక్షే–'మొదటికి వధ్యత్వా వధ్యత్వ మీమాంస చేయకుండా తొందర పడి వాలిని చంపుతానని సుగ్రీవుడికి రాముడు వాగ్దానం చెయ్యటమే తప్పు. ఒక తప్పును సమర్థించుకోటానికి చేసిన తప్పుడు పని ఎలా సమర్థనీయ మవుతుంది?'

సమా : ఇది పక్షపాత దృష్టితో చేసిన ఆక్షేపణ. కిష్కింధ—అష్టమ, నవమ సర్గలలో వాలి చేసిన అన్యాయాన్ని సుగ్రీవుడు రామునికి వివరించాడు. అంతా విన్న తర్వాత రాముడు పరిస్థితులను ఆకళింపు చేసికొని (సుగ్రీవుని ప్రవాసం, భీతి, హనుమదాదుల సాక్ష్యం మున్నగు పరిస్థితులను) దోష స్థిరీకరణను ప్రతిపాదిస్తూ వధ్యత్వాన్ని నిరూపించాడని మన కీ క్రింది శ్లోకాలు చెప్తున్నవి.

అమోఘాః సూర్య సంకాశా నిశితామే శరా ఇమే
తస్మిన్ వాలిని దుర్వృత్తే పతిష్యన్తి రుషాన్వితాః
యావత్ తం నహి పశ్యేయం తవ భార్యాప హారిణం
తావత్ సజీవేత్ పాపాత్మా వాలీ చారిత్ర దూషకః
కిష్కింధ. 10 సర్గ. 32, 33 శ్లో.

దుర్వృత్తుడూ, నీ భార్య నపహరించిన వాడూ పాపాత్ముడూ చారిత్ర దూషకుడూ అయిన వాలిని అమోఘములూ సూర్య సంకాశములూ నిశితములూ కోప పూరితములూ అయిన యీనా శరములు కూలుస్తాయి.

ఈ మాటలలో సుగ్రీవుడి మీద అభిమానంతో కూలుస్తానన్న అభిప్రాయంలేదు గదా! నాలుగు విశేషాలతో వాలి దోషాన్ని ఉట్టంకించి వధ్యత్వాన్ని రాముడు నిరూపించాడు కదా!

అయితే ఏకపక్షంగా సుగ్రీవుడు చెప్పిన మాటలను నమ్మి నిశ్చయం చేయవచ్చునా? అని మళ్లీ ఆక్షేపణ.

రాముడు సుగ్రీవుణ్ణి నిష్కారణంగా, స్వార్థ బుద్ధితో నమ్మలేదు. అరణ్యకాండంలో శాప విమోచనం పొందిన కబంధుడు సుగ్రీవుణ్ణి రాముడికి పరిచయం చేస్తూ అన్న వాక్యాలను చూడండి.

శ్రూయతాం రామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః
భ్రాత్రా నిరస్తః క్రుద్ధేన వాలినా శక్ర సూనునా
వానరేంద్రో మహావీర్య స్తేజోవాన మిత ప్రభః
సత్య సంధో వినీతశ్చ ధృతిమాన్ మతిమాన్ మహాన్
దక్షః ప్రగల్భో ద్యుతిమాన్ మహా బలపరాక్రమః
భ్రాత్రా వివాసితో వీర రాజ్యహేతో ర్మహా త్మనా.
అరణ్య. 72. స. 11, 13, 14 శ్లోకములు.

రామా నా మాట విను. సుగ్రీవుడనే వానరుడు, కోపిష్ఠి అయిన వాలి అనే ఈన అన్నచే బహిష్కృతుడైనాడు. ఆ సుగ్రీవుడు సత్యసంధుడు, వినీతుడు. ఇంకా సద్గుణ సంపన్నుడు, రాజ్య కారణంగా అన్నచే వివాసితుడైనాడు.

దివ్యరూపం పొందిన కబంధుడికీ వాలి సుగ్రీవులకూ ఏమీ చుట్టరికం లేదు. అతడు వాలిని దోషిగా పేర్కొనటానికి కానీ, సుగ్రీవుడి గుణగణాలను మెచ్చుకోటానికి కానీ వైయక్తిక కారణ మేమీ కనపడదు. రాముడు కబంధునివలన విన్న వృత్తాంతాన్ని సుగ్రీవుని నుండి రూఢి చేసికొని పరిస్థితులవలన వాలి దోషాన్ని నిశ్చయించుకొని అప్పుడు సుగ్రీవుడికి మాట ఇచ్చాడు. విషయ మిట్లా ఉండగా వాలియొక్క వధ్యత్వా వధ్యత్వ మీమాంస రాముడు చేయలేదనటం

వంచన. తప్పును సమర్థించుకోటానికి చేసిన తప్పుడు పని ఎలా సమర్థనీయమవుతుందని విభ్రమం పొందటం పెద్ద తప్పుడు పని.

అయితే శ్రీ తిరుపతిరావు గారేమంటారంటే రాముడు వాలిని పిలిచి అడుగవద్దా? అని. వాలి సొమ్ముతో దొరికిన దొంగవంటివాడు. అట్టి చోట శిక్షే కర్తవ్యం కాని విచారణ కర్తవ్యం కాదు. కార్య కారణ సంబంధం చేత సునిరూపితమైన విషయంలో విచారణ చేయవలసిన అవసరం రాముడికి లేకపోయింది. వాలి సుగ్రీవుణ్ణి బహిష్కరించే ముందు దోషారోపణ చేశాడే కాని సుగ్రీవుడు చెప్పిన మాటలకు ఏమి విలువ ఇచ్చాడు? అట్లా ఇవ్వకపోవటమనే దోషం నీలో ఉంది సుమా అని చెప్పటానికా అన్నట్లు రాముడు వాలికా అవకాశం ఇవ్వలేదు. ఒక వేళ ఇచ్చినా వాలి తన దోషాన్ని కప్పిపుచ్చుకో లేడనటానికి కావలసినంత గ్రంథ సాక్ష్య ముంది.

2 వ ఆక్షే : కూతురితో సమానమైన మరదలితో నీవు కామ ప్రవృత్తుడ వైనావు. కనుక నీవు పాపివి వధ్యుడవే అని రాము డన్నదానికి వీరి ఆక్షేపణ ఇట్లా ఉంది.

'రాముడు చెప్పింది ధర్మం లాగానే కనిపిస్తున్నది పై చూపులకు. లోతుగా విచారిస్తే అందులో ధర్మం లేదు. మరదలు కూతురుతో సమాన మనేది నరజాతి ధర్మం. (నరుల్లో కూడ కొన్ని తెగల్లో మాత్రమే) వానరులకు నర ధర్మాన్ని వర్తింపచేయటం ధర్మం కాదు.'

సమా : వానరులకు నర ధర్మాన్ని వర్తింప చేయటం ధర్మం కాదో అవునో విచారించే ముందు తమ్ముడి భార్యను అపహరించటం వానర ధర్మం ప్రకారం. ధర్మమే అని శ్రీ రావు గారు ప్రమాణీకరించ గలరా? వానర స్మృతి శాస్త్ర మంటూ ఏదైనా ఉందా? ఇది అట్లా ఉంచి వానరులకు నరజాతి ధర్మం వర్తింప చేయటం ధర్మం కాదని ఒక ప్రక్క అంటూనే వధ్యత్వా వధ్యత్వ మీమాంస దోషి మాటలను గూడ విన్న తర్వాత నిర్ణయించాలనే నర ధర్మాన్ని (అది కూడ కలికాలంలో ప్రస్తుతం అమలులో ఉన్న దాన్ని) వానరుల విషయంలో వర్తింప చేయాలనటం ధర్మమా? కాబట్టి శ్రీ రావు గారి ఈ ఆక్షేపణ బాగా 'లోతుగా విచారించి' కూడ స్వవచన వ్యాఘాత దోష దూషిత మవుతోంది.

ఆక్షే : 'అవునంటె తల్లితో సమానమైన వదినను భార్యగా స్వీకరించిన సుగ్రీవుడికి కూడ ఇదే శిక్షను రాముడు విధింప వలసి ఉండెను.'

సమా : బ్రతికి ఉన్న తమ్ముణ్ణి, కావాలని వెడలగొట్టి వాడు బ్రతికి ఉన్నాడని నిత్యమూ చూస్తూ వాని భార్యను వాలి అనుభవించటమూ, దుష్టుడై శిక్షితుడై మృతినొందిన అన్న భార్యను సుగ్రీవుడు భార్యగా స్వీకరించటమూ ఒకటే అవుతుందా?

ఈ ఆక్షేపణలో రుమ పాతివ్రత్యాన్ని గురించి ప్రస్తావిస్తూ 'రుమ వాలికి స్వబుద్ధితోనే వశమైనది కాని వాలి ఆమెను బలాత్కరించిన వాడు కాడన్న మాట' అని శ్రీ రావుగారు నిరాధారమైన ఒక తీర్మానం చేశారు. రుమ గాని తార గాని వాలికి గాని సుగ్రీవుడికి గాని స్వబుద్ధితోనే వశమయ్యారనే విషయంతో మనకు పనిలేదు. వాలి సుగ్రీవులు ఒక యింట్లో కాపురం చేస్తున్నారు. వాలి సుగ్రీవుణ్ణి తరిమి నిలువ నీడలేకుండా చేశాడు. రుమ ఒకవేళ వాలికి బుద్ధి పూర్వకంగానే వశమైన దనుకుందాము. అప్పుడు ఇటు తమ్ముడికీ, అటు రుమకూ తండ్రి స్థానంలో ఉండవలసిన వాలి ఆమెను బుద్ధిచెప్పి ధర్మాన్ని కాపాడితే ఉత్తము డవుతాడా? దొరికింది గదా అని అనుభవిస్తే బుద్ధిమంతు డవుతాడా? వాలి అంత ధర్మాత్ముడైతే కనీస ధర్మంగా రుమను ప్రవాసితుడైన సుగ్రీవుని వద్దకు పంపలేక పోయాడా? అప్పుడు ప్రవాసితుణ్ణి చేసినందువలన శిక్షించినట్లా అవుతుంది, భార్యను పంపినందువలన సౌభ్రాతృత్వం నెరపినట్లా అవుతుంది గదా! కాబట్టి రుమ స్వబుద్ధితో వశమైనదనే విషయం వాదానికి బలాన్నివ్వదు. పైగా దెబ్బతీస్తుంది కూడా. తార కూడ సుగ్రీవుడికి స్వబుద్ధితోనే వశమైంది. సుగ్రీవు డామెను బలాత్కరించ లేదు. కాబట్టి శ్రీ రావుగారు చెప్పిన దాని

ప్రకారమే సుగ్రీవుడికి శిక్ష అక్కరలేదు కదా! వాలి సుగ్రీవుల ప్రవర్తనలో ఏ రకంగానూ సామ్యం లేదు కనుక తారను సుగ్రీవుడు పరిగ్రహించటం దోషం కాదు.

3 వ ఆక్షే: 'నేను సుగ్రీవుడితో ద్వంద్వ యుద్ధం చేస్తూ ప్రమత్తుడనై ఉండగా నా మీద బాణప్రయోగం ఎలా చేశావు?' అని వాలి అడిగితే 'నీవు ఒక మృగానివి వేటాడే రాజులు మృగాలను ఎలాగైనా చంపవచ్చు. కనుక ప్రమత్త స్థితిలోఉన్న నిన్ను వేటాడటం ధర్మమే అని రాముడు సమాధానం చెప్పాడు. దీనిమీద వీరి ఆక్షేపణ ఇట్లా ఉంది.

'ఇంతవఱకు రాముడు వాలిని మనుష్యుడివలె గుర్తిస్తూ ధర్మా ధర్మ మీమాంస చేశాడు. ఎప్పుడైతే వాలిని మృగంగా పరిగణించాడో అప్పుడే ఇంతవఱకు అతడు చేసి అగమ్యగమన దోషారోపణ నిస్సారమని తేలిపోయింది. తాను వాలిని చంపినది దోషమునకు శిక్షగనో, వేటగనో రాముడికి నిశ్చయ బుద్ధి లేదు.'

ఇది అంతస్సారం లేని ఆక్షేపణ. నిజానికి రాముడి సమాధానం వాలిని మాత్రమే ఉద్దేశించింది కాదు. అది పాఠకులనూ, ముఖ్యంగా తన శీలాన్ని శంకించే వారినీ, కూడా ఉద్దేశించింది. రాముని సమాధానంలో మూడు ముఖ్యాంశా లున్నాయి. (1) దోషారోపణ (2) ప్రతిజ్ఞా నిర్వహణ (3) వేట నృప ధర్మం అనేవి. ఈ మూడూ చాలా మెలకువతో చెప్పబడినవని సూక్ష్మ పరిశీలనకు తెలుస్తుంది. (1) వాలి నరు డనుకుంటే అధర్మ నిరూపణంతో వాడు వధ్యుడు. దానికోసం ధర్మా ధర్మ ప్రసంగం చేశాడు. (2) నర మృగముల సమాహార రూప మనుకుంటే ధర్మ ప్రసంగంకంటె సుగ్రీవునితో మైత్రీ, ప్రతిజ్ఞా నిర్వహణం అనే లౌకిక అంశాలు చెప్పబడ్డవి. (3) కాదు కేవలం మృగమనుకుంటే మృగాన్ని వేటాడటం రాజ ధర్మం. ఇట్లా మూడు కోణాల నుండి వాలి చేసిన ఆక్షేపణలకు మూడు సమాధానాలు తూచినట్లు రాముడు చెప్పాడు. ఇట్లా నిండైన ఆత్మ విశ్వాసంతో రాముడు సమాధానం చెపితే 'నిశ్చయ బుద్ధి' లేదని భావించటం శ్రీ రావుగారి పరిశీలనా రాహిత్యాన్ని సూచిస్తుంది. లేదా అనిమిత్త మహత్సరి వాద శీలితనైనా వ్యక్తం చేస్తుంది.

4 వ ఆక్షే: వాలి చేసిన నాలుగవ ఆక్షేపణ. తాను అభక్ష్యము. తన చర్మాదులు కూడ ఎందుకూ పనికిరావు. కాబట్టి రాముడు నిష్కారణ జంతు వధ ఎందుకు చేయాలి? అనే దానికి రాముడు సమాధానం చెప్పలేక నీవు క్రోతివి—నీకు ధర్మసూక్ష్మం తెలియదు. ఇత్యాదిగా 'బుకాయించాడ'ట.

సమా: వాలి ఆక్షేపణలో అభక్ష్య ప్రస్తావన యించుమించు చివరలో ఉన్నది. రాముడి సమాధానంలో, నీవు క్రోతివి. వృద్ధోపసేవనం చేయలేదు. ధర్మ సూక్ష్మం నీకు తెలియదు ఇత్యాదిగాఉన్న మాటలు, ప్రప్రథమంలో ఉన్నవి. ఆ ఆక్షేపణకు, ఈ సమాధానాన్ని ముడిపెట్టటం మోకాలికీ బట్టతలకూ ముడి పెట్టినట్లవుతుంది. పైపెచ్చు 'నిష్పక్షపాతమైన విమర్శనాదృష్టి' మందగించి అసంబద్ధములైన వాదములతో ఎలాగో రాముడి చర్యను సమర్థించటమే తమ ధర్మంగా పండితులు భావిస్తూ వచ్చారని ఆక్షేపించిన వీరి విమర్శనా దృష్టికి ఈ రెంటినీ ముడిపెట్టటంలో ఎంత పక్షపాతముందో సామాన్యులకైనా తెలుస్తుంది. రాముడు సమాధానం చెప్పలేక పోయాడని అనటం వీరు ప్రకరణాన్ని వాలి కనుగుణంగా మాత్రమే చూచా రనటాన్ని నిరూపిస్తుంది. రాముని సమాధానం పరిశీలిద్దాము.

శృణు చాప్యరం భూయః కారణం హరి పుంగవ
తచ్ఛ్రుత్వా హి మహద్ వీర న మన్యుం కర్తుమర్హసి
నమే తత్ర మనస్తాపో నమన్యుర్హరి పుంగవ
వాగురాభిశ్చ పాశైశ్చ కూటైశ్చ వివిధై ర్నరాః
ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ గృహ్ణన్తి సుబహూన్ మృగాన్
ప్రధావితాన్ వా విత్రస్తాన్ విస్రబ్ధానతి విష్ఠితాన్
ప్రమత్తాన ప్రమత్తాన్ వా నరా మాంసాశినో భృశం
విధ్యన్తి విముఖాంశ్చాపి నచ దోషోఽత్ర విద్యతే
యాంతి రాజర్ష యశ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః
తస్మాత్ త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర.

కిష్కింధ. 18 వ సర్గ. 36 నుండి 40 శ్లో.

వాలీ ఇంకొక కారణం చెపుతాను. అది విని నామీద కోపగించకు. నాకు మనస్తాపం కాని కోపం గాని లేవు. అనే కోపాయాలతో నరులు మాంసాశులు

కనుక మృగాలను పట్టుకొంటారు. ఇంక ధర్మకోవిదులైన రాజర్షులు కూడ వేటకు వెళ్ళటం ఉంది. ఆ కారణంగా నీవు కొట్టబడ్డావు.

ఇంత సమాధానం రాముడు చెపితే సమాధానం చెప్పలేక బుకాయించా డనటం నిష్పక్షపాత విమర్శనా దృష్టికలవా రనవలసిన మాట కాదు.

అయితే కోతి మాంసం అభక్ష్యం కదా! రాముడి కిది తెలియదు కదా! అని ఎవరూ తృప్తిపడటానికి వీలులేదు. సాధారణంగా మాంసాశులయిన నరుల విషయం ముందు చెప్పి, ధర్మకోవిదులైన రాజర్షులు కూడా వేటాడటం ప్రస్తావించిన రాముని మాటల లోని తాత్పర్యాన్ని శ్రీ రావుగారు గుర్తించ లేదు. అలా రాజర్షుల విషయం వేరుచేయటంలో సాధారణ మానవులు కుక్షింభరిత్వానికే వేటాడినా రాజర్షులు, క్రూర మృగాల వలన జనపదాలకు కలిగే ఆపదలను వారించటానికీ, సాధు మృగ సంరక్షణకూ వేటాడటం జరుగుతుందని ఆ దృష్టితో ప్రజాహితరతుడైన శ్రీరాముడు వాలి అనే మృగాన్ని సుగ్రీవాది సంరక్షణ నిమిత్తం కొట్టినట్లు చెప్పాడనీ వాల్మీకి తాత్పర్యం. కావ్యంలో అన్ని అర్థాలూ వాచ్యం చేయబడవనీ కొన్ని వ్యంగ్య రూపంలో చెప్పబడతాయనీ వాఙ్మయాధ్యయనంలో ప్రథమ కక్ష్యలో ఉన్నవారు కూడ గుర్తిస్తారు. కాదు రాజులు కూడ తినటానికే వేటాడతారంటే, జన పదాలలో కనపడే పాము, తేలు మున్నగు విషపు పురుగులను చంపేవారు కూడా తినటానికే చంపుతారని తీర్మానించవలసి వస్తుంది. కనుక వాలి ఆక్షేపణకు సముచితమైన సమాధానం రాముని వాక్యాలలో ఉన్నదని మనవి.

5 వ ఆక్షే: 'భరతుడి ప్రతినిధిగా తాను దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేస్తున్నట్లు రాముడు చెప్పుకున్నది కూడా బుకాయింపే. అంగవంగ కళింగ ది షట్పంచాశ రాజ్యాలలో కోసల మొకటి. దక్షిణ కోసల రాజుకు గానీ, రాజ ప్రతినిధికి గాని కిష్కింధా రాజ్యంలో దుష్ట శిక్షణాధికారం ఎలా ఉంటుందో రాముడికే తెలియాలి.'

సమా: రాముడిది బుకాయింపో, పై ఆక్షేపణ బుకాయింపో విచారించేముందు షట్పంచాశ రాజ్యాల ప్రసక్తి ఎప్పటినుండి ఉన్నది? అది రామాయణం నాటికి ఉన్నదా? రామాయణంలో దాని కేమైనా ఆధారాలున్నాయా? షట్పంచాశ రాజ్యాలు ఇక్ష్వాకుల సామ్రాజ్యంలో ఉన్నవా? లేవా? ఇత్యాది ప్రశ్నలు పుట్టక మానవు. శ్రీ రావుగారు దీని కేమీ ప్రమాణాలు చూపలేదు. కాగా కిష్కింధ తన రాజ్యంలో భాగమని వాల్మీకిచే సత్యసంధుడుగా కీర్తింపబడ్డ శ్రీరాముడు స్వయంగా చెప్పాడు. (చూ. కిష్కింధ. 18. 6 వ శ్లో.) శ్రీ రావుగారి మాట ప్రమాణమైతే రాముణ్ణి సత్య సంధుడుగా వాల్మీకి కూడా బుకాయించాడనే చెప్పాలి. ఇక్ష్వాకుల భూమి దక్షిణ కోసలంతో పరిమితం కాదనటానికి రామాయణంలో వేరే ఆధారా లున్నవి.

(1) దశరథుడు కోప గృహంలో ఉన్న కైకననునయిస్తూ తన వైశాల్యాన్ని వ్యంగ్యంగా చెప్పాడు. చూడండి.

కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే
యావదా వర్తతే చక్రం తావతీమే వసుంధరా
ద్రవిడాః సింధు సౌవీరాః సౌరాష్ట్రా దక్షిణా పథాః
వంగాంగ మగధా మత్స్యాః సమృద్ధాః కాశికోసలాః
తత్ర జాతం బహుద్రవ్యం ధనధాన్య మజావికం
తతో వృణీష్వ కైకేయి యద్యత్త్వం మనసేచ్ఛసి.

అయోధ్య. 10 స. 36, 37, 38 శ్లో.లు.

పై శ్లోకాలలో కనబడే దేశాలన్నీ తన యేలుబడిలో లేకుండానే కోరుకోమని దశరథుడు ఎట్లా అనగలడు? దీనినిబట్టి పై దేశాలన్నీ వారి సామ్రాజ్యంలోని భాగాలే అని నిరూపిత మవుతున్నది గదా!

(2) దండకారణ్యంలో మునులందరూ మేము నీ విషయములో ఉన్నాము. మమ్మి నీవు కాపాడాలి అని ప్రార్థించారు. చూ. అరణ్య. 1. 20, 21 శ్లో.

ఇంకా ఇక్ష్వాకుల రాజ్యపరిధిని దక్షిణ కోసలం వరకే కాదని నిరూపించే అంశాలు వీనితోపాటు పాటి మూడు ఆంధ్ర వాల్మీకుల మందరములో చూపబడ్డాయి. కవికుల గురువు కాళిదాసు కూడ ఇక్ష్వాకులను 'ఆ సముద్ర క్షితీశు' లన్నాడు. వీరందరూ బుకాయిస్తున్నారని శ్రీ రావు గారు నిరూపిస్తే అప్పుడు వీరి ఆక్షేపణ నిలుస్తుంది.

6 వ ఆక్షే: 'ఈనాడు మనం ధర్మాధర్మ నిర్ణయం చేయబూనే కంటె, అసలు రామాయణ కర్త యైన వాల్మీకి చేసిన ధర్మ నిర్ణయం తెలిసికోవటం మేలు.

'ఈ సందర్భంలో వాల్మీకి వాలిని మహాత్ముడు; అనుత్తముడు, ధర్మార్థ గుణసంపన్నుడు అని ప్రశంసించటమూ, రాముడిని గర్వితుడు, రణ గర్వితుడు అని మాత్రమే చెప్పి ఉండటమూ గమనించ దగి ఉన్నది. అలాగే వాలి వాక్యమును గురించి ఒకటికి రెండుసార్లు ప్రశ్రితము, ధర్మార్థ సంహితము, హితము అని ప్రశంసించటమూ, రామ వాక్యాన్ని గురించి ఆలాంటి పొగడ్త మాట లేమీ ప్రయోగించక పోవడమూ కూడా గమనించవలసి ఉన్నది.

'వాలి వాదనే ధర్మార్థ సహితమని వాల్మీకి తీర్పు. రాముడి వాదం ధర్మ సమ్మతమని వాల్మీకికే సమ్మతం లేదు.

'త్రేతాయుగ ధర్మం వాల్మీకి కంటె మన కెక్కువ తెలియదు.'

సమా: ఈ వాక్యాలతో వీరి వ్యాసం ముగుస్తున్నది. వ్యాసం మొత్తం మీద వాల్మీకి మాటల మీద ప్రత్యేకం చూపినా చూపకున్నా ముగింపు వాక్యాలలోనైనా చూపినందుకు శ్రీ రావు గారిని అభినందిస్తున్నాను. పై వాక్యాలు వాలి ధర్మసత్వాన్ని నిరూపించటానికి పైకి దృఢంగానే కనిపిస్తాయి. కావ్య భాగాన్ని విశ్లేషించి, తమ వాదానికి అనుగుణమైన అంశాలను మాత్రమే ఉద్ధరించి చూపితే సామాన్యుని కవి నిజమే అనిపిస్తుంది. కాని సందర్భాన్ని పూర్తిగా పరిశీలించకపోతే నిజం తేలదు. వాల్మీకి శ్లోకాలలోని ప్రశ్రితం, ధర్మ సంహితం, ధర్మార్థ సహితం హితం మున్నగు పదాలు మాత్రమే పట్టుకొని, ఆ ప్రక్కనే ఉన్న నష్టచేతసా, విచేతసా, పరుషం మున్నగు పదాలను వదలివేసి తీర్మానం చేయటం వాద లక్షణం కాదు. వాలి దెబ్బతిని, నష్టచేతనుడై (వివేకాన్ని కోల్పోయి) దుఃఖోద్వేగంతో రాముణ్ణి గూర్చి ధర్మార్థ సహితమైన, హితమైన మాటలు పలికాడని పై సందర్భంలోని శ్లోకాల భావం. అంటే వాలి చేసిన నిందలో ధర్మ ప్రసంగం, అర్థ ప్రసంగం, హిత ప్రసంగం ఉన్నదని వాల్మీకి చెప్తున్నారు. ఇందులో ఎట్టి ఆక్షేపణా ఎవరికీ ఉండదు. 17 వ సర్గ— 16 వ శ్లోకంలో వాలి ధర్మ ప్రసంగం చేశాడు.

పరాఙ్ముఖ వధం కృత్వా
కోఽత్ర ప్రాప్తస్త్వయా గుణః
యదహం యుద్ధ సంరబ్ధ
స్త్వత్కృతే నిధనం గతః

పరాఙ్ముఖుడైన నన్ను చంపితే నీ కేమి వస్తుంది. మరొకనితో యుద్ధం చేస్తున్న నన్ను నీవు చంపావు ఎందుకు?

17 వ సర్గ–31 వ శ్లోకంలో అర్థ ప్రసంగం ఉన్నది.

భూమిర్హిరణ్యం రూపంచ విగ్రహే కారణాని చ
తత్ర కస్తే వనేలోభో మదీయేషు ఫలేషు ॥

భూమి, డబ్బు రూపము మున్నగు వానిలో ఏ విషయంలో లోభపడి నన్ను చంపావు?

17 వ సర్గ. 49, 50 శ్లోకాలలో నీకు నేను హితము చేసి ఉండేవాడను గదా అన్న హితం ప్రసంగం ఉన్నది.

మామేవ యది పూర్వం త్వమే తదర్థ మచోదయః
మైథిలీ మహ మేకాహ్నే తవ చానీతవాన్ భవేః
రాక్షసం చ దురాత్మానం తవ భార్యాప హారిణం
కంఠే బద్ధ్వా ప్రదద్యాంతేఽ నిహతం రావణం రణే.

నీవు ముందు నన్నే ఆశ్రయించి ఉంటే ఒక్క రోజులో జానకిని తెచ్చి ఉండేవాణ్ణి. ఆ దురాత్ముడైన రావణుణ్ణి మెడపట్టి లాక్కునివచ్చి నీకు అప్పగించి ఉండేవాడను గదా!

ఇట్లా వాలి వాదంలో ఉన్న ధర్మ, అర్థ, హిత ప్రసంగాలను వాల్మీకి అనువదించాడే గాని వాలి చెప్పిందల్లా ధర్మమనీ, హితమనీ, అర్థయుక్తమైనదనీ చెప్పలేదే. ఒకవేళ చెప్పాడనే భావించాలంటే హితమనే మాటకు సందర్భశుద్ధి ఉండదు. హితమంటే ఎవరికి? ఏది? అనే ప్రశ్నలకు తృప్తికరమైన సమాధానాలు దొరకవు.

ఇంతేకాక వాలి ఎంతవరకు ధర్మ, అర్థ ప్రసంగాలు, హితప్రసంగం చేశాడు కాని అసలు తన దోషమంతా నిరూపించే కామ ప్రసంగం చేయలేదు. రాముడు తన సమాధానంలో దాన్ని పేర్కొన్నాడు.

ధర్మ మర్థం చ కామంచ సమ యం చాపి లౌకికమ్
అవిజ్ఞాయ కథంబాల్యా న్మా మిహాద్య విగర్హసే.

కిష్కింధ. 18. 4 వ శ్లో.

'నాయనా నీవు ధర్మార్థాలను గురించి ఎంత మాటాడినా అది ధర్మమూ కాదూ, అర్థమూ కాదు. నీకు కామ పురుషార్థ తత్త్వం, తక్కినవాని లాగానే తెలియదు. సాధారణమైన లౌకికమైన కట్టుబాటు కూడ నీకు తెలియదు. ఆ విషయంలో కేవలం బాల స్వభావం నీది. నన్నెందుకు నిందిస్తావు' అని రాముడంటున్నాడు. అసలు వాలి దోషమంతా ఈ కామ పురుషార్థం మీద ఆధారపడి ఉన్నది. రాముడు దాన్ని ధర్మార్థాలతో పాటు ఇక్కడ ప్రస్ఫుటం చేసి చూపాడు. కనుక వాల్మీకి 'ధర్మార్థ గుణ సంపన్నం' ఇత్యాదిగా వాలిని ప్రశంసించా డనుకోవటం కావ్యార్థాన్ని సరిగా అవగాహన చేసికోనందువలన కలిగిన ప్రమాదాన్ని సూచిస్తుంది.

మరొక విషయం కూడ ఇక్కడ కావ్యదృష్టితో సంభావించవచ్చు. కవి కేవలం నాయక పక్షపాతి కాకుండా ఉన్న విషయాన్ని ఉన్నట్లు నిరూపించే ప్రయత్నం మనకు సర్గాల్లో గోచరిస్తుంది. వాలి వధార్హుడైనంత మాత్రాన కవి అతణ్ణి నిందించటం గానీ, అతని గుణగణాలను కప్పిపుచ్చటం గానీ, జరుగదు. ఆ దృష్టితోనైనా ఇచటి వాలికి, అతని మాటలకూ వేసిన విశేషణాలు సామాన్యార్థంలో గ్రాహ్యాలౌతాయి. అంతేకాని అవి వాలిని రామునికంటె గుణోత్తరుణ్ణి చేయజాలవు.

'గర్వితం, రణ గర్వితమ్' అనే మాటలలో రామాశ్రయమైన దోషోద్ఘాటనం ఏమీలేదు. అతడు తాను నిర్వహించిన దుష్ట శిక్షణకు, తన బాణపు అమోఘత్వానికి గర్వపడ్డాడంటే అది దోష మెట్లా అవుతుంది? 'రాముడి వంటి పుత్త్రుణ్ణి పొందినందుకు దశరథుడు గర్వపడుతున్నాడు' మొదలగు వాక్యాలలో

గద్య పదం దుష్టార్థదూషితం కానట్లే ఇక్కడ కూడా దుష్టం కాదు.

ఇంక రాముని కేమీ విశేషణాలు వేయని సంగతి ఆలోచిద్దాము. అసలు రామాయణ మహాకావ్యం రాముని ఉత్కృష్ట గుణాలను నిరూపించటానికి ఉద్దేశింప బడింది. అతని గుణ పరంపరను కావ్యారంభంలో వాల్మీకి తన్మయత్వంతో వర్ణించాడు. 'రామో విగ్రహ వాన్ ధర్మః' అని వాల్మీకి సూక్తి. వానియందు శ్రీ రావు గారికి లేని ప్రామాణ్యం ఏకదేశంలో, ఒక ప్రత్యేకార్థంలో ప్రయోగింపబడిన ధర్మార్థ సహితం మున్నగు పదాల యందు ఉన్నదంటే అది వారి పక్షపాతాన్ని నిరూపిస్తుంది. ఈ ఘట్టంలో కూడ రాముని ప్రశంస లేకపోలేదు. పై పెచ్చు దెబ్బతిని, దోషోద్ఘాటనం చేసిన వాలియే రాముని మాటలు విన్న తర్వాత ఏమంటున్నాడో పరిశీలించండి.

త్వం హి దృష్టార్థ తత్త్వజ్ఞః ప్రజానాంచ హితే రతః
కార్యకారణ సిద్ధౌ చ ప్రసన్నా బుద్ధి రవ్యయా
మామప్య వగతం ధర్మాద్ వ్యతి క్రాంత పురస్కృతం
ధర్మ సంహితయా వాచా ధర్మజ్ఞ పరిపాలయ.

కిష్కింధ. 18. 47, 48.

శ్రీరామా నీవు సర్వవిషయముల తత్త్వము నెఱిగిన వాడవు. ప్రజల హితమునందు రతుడవు. నీ అవ్యయమైన బుద్ధి కార్యకారణ సిద్ధియందు నిరంతరము ప్రసన్నమై ఉంటుంది. నేను ధర్మభ్రష్టుడను. ఓ ధర్మజ్ఞా నన్ను ధర్మసంహితమైన నీ వాక్కుతో పరిపాలించు.

ఇంతేకాదు వాల్మీకి స్వయంగా అన్న మాట లివి.

సతస్య వాక్యం మధురం మహాత్మనః
సమాహితం ధర్మ పథాను వర్తితమ్
నిశమ్య రామస్య రణావ మర్దినో
వచః సుయుక్తం నిజగాద వానరః

కిష్కింధ. 18 సర్గ. 65.

తన్ను రణములో అవమర్దించిన మహాత్ముడైన శ్రీరామచంద్రుని మధురము, సమాహితమూ, ధర్మపథానువర్తితమూ అయిన వాక్యం విని వాలి మిక్కిలి యోగ్యమైన మాట ఇట్లా అన్నాడు.

సర్గాంతంలో వాలి, రాముడు తన పుత్రుణ్ణి కాపాడుతానని మాట యిచ్చిన తర్వాత రాముణ్ణి ఉద్దేశించి అన్న మాట లివి.

శరాభి తప్తేన విచేతసా మయా
ప్రభాషితస్త్వం యద జానతా మయా
ఇదం మహేంద్రోపమ భీమ విక్రమ
ప్రసాది తస్త్వం క్షమమే నరేశ్వర !

అయ్యా! దెబ్బతిని, బుద్ధి కోల్పోయి, తెలియక నిన్ను చాలా నిందించాను. ఓ మహారాజా నా యందు ప్రసన్నుడవై నా మాటలను క్షమించు.

ఇన్నివిధాల కవి, అపకారం పొందిన వాలీ నోరారా రాముణ్ణి ప్రశంస చేస్తుంటే రామునికి ఏమీ ప్రశంసించక పోవటం గమనించదగిన విషయమని శ్రీ రావు గారు ఎట్లా అనగలరు. వారు గ్రంథాన్ని చక్కగా అనుశీలనం చేయలేదు. చేస్తే వారికి వాలి ధర్మాత్ముడనే అభిప్రాయం గానీ, రాముడు అధర్మపరుడనే అభిప్రాయం కానీ కలుగదు. ఒక మహా కవి కావ్యాన్ని అనుశీలించేటప్పుడు విరుద్ధ బుద్ధితో పూనుకుంటే సత్యం గోచరించదు. స్థూల దృష్టికి కనపడినదంతా సత్యమే అని తాము నమ్మి ఇతరులను నమ్మించే ప్రయత్నం చేయటం కంటే ఉదాసీనభావం మంచిది. లేకపోతే సాధారణ మానవులకు అపకారం చేసినవాళ్ళ మవుతాము. అందుకే శ్రీ కృష్ణ పరమాత్మ 'న బుద్ధి భేదం జనయేత్' అంటారు.

# జానపద సేకరణలో పాశ్చాత్యులు వహించిన పాత్ర

శ్రీ కర్ణ రాజ శేషగిరిరావు

సాహిత్యము మానవ జీవిత ప్రతిబింబము. జానపద సాహిత్యములో జాన పదుల జీవితము ప్రతిబింబించు చుండును. జాన పదుల సుఖ దుఃఖములు, అనురాగ విరాగములు, ఆకర్షణ వికర్షణలు, ఆనంద విషాదములు జానపద సాహిత్యమునందు విలసిల్లు చుండును. ఈ సాహిత్యమును స్థూలముగా నాలుగు వర్గములుగా విభజింపవచ్చును. (1) జానపద నాట్యములు (2) జాన పద గీతములు (3) జానపద కథలు (4) సామెతలు, నానుడులు, పొడుపు కథలు మొదలగునవి. ఈ సాహిత్య మంతయు జాన పదుల నోనోట నేటికిని నానుచున్నది. ఈ సాహిత్యపు విలువను మొన్న మొన్నటివఱకు గమనించినవారే లేరు. సనాతన పండితు లీ సాహిత్యము నుపేక్షించి నారు. అందువలన ఈ సాహిత్యమును శ్రీ మల్లంపల్లి సోమ శేఖర శర్మ అనాదృత సాహిత్యమనినారు. జాన పద సాహిత్యపు విలువలను గమనించి సేకరించినవారు పాశ్చాత్యులు. వారే భారతీయ జాన పద సాహిత్యమును సేకరించి నాశనము గాకుండా పరిరక్షించినా రనుటలో అతిశయోక్తి లేదు. ఈ విషయములో వారి కెంతో మనము ఋణపడి యున్నారము. వారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదము లర్పించుట మన పరమధర్మము. ఈ వ్యాసమునందు జాన పద సాహిత్య సేకరణమునందు పాశ్చాత్యులు వహించిన పాత్రను గుఱించి సంక్షిప్తముగా వివరించు చున్నాడను.

## ఏషియాటిక్ సొసైటి :

విలియము జోన్సు ప్రయత్నమువలన బెంగాలులో క్రీ. శ. 1784 లో ఏషియాటిక్ సొసైటి స్థాపింపబడినది. అప్పుడు విలియము జోన్సు కలకత్తా సుప్రీముకోర్టు న్యాయాధీశుడు. ఈయన ఈ సంస్థకు తొలి యధ్యక్షుడు. ఈ సంస్థ ముఖమున వెలువడు పత్రికలో సంస్థా స్థాపనోద్దేశ్యములు వివరింపబడినవి. ఆసియా చరిత్ర, ప్రాచీన సంస్కృతి సంరక్షణ, కళా శాస్త్ర వాఙ్మయ పరిశోధనయే దీని ప్రధాన లక్ష్యము.

క్రీ. శ. 1804 లో బొంబాయిలో లిటరరీ సొసైటి స్థాపింపబడినది. 1829 లో బ్రిటనులో రాయలు ఏషియాటిక్ సొసైటి స్థాపింపబడినది. కలకత్తా, బొంబాయి, శాఖలు పై సంస్థకు అనుబద్ధములు. 1845 లో సిలోనులో ఒక శాఖ స్థాపింపబడినది. ఈ రాయలు ఏషియాటికు సొసైటీ అధ్యక్షులుగా మొట్టమొదట యూరోపియనులే వ్యవహరించు చుండెడివారు. భారతీయ విద్వాంసుల కెట్టి యవకాశ మిచ్చెడివారు కారు. రాయలు ఏషియాటికు సొసైటీ ద్వారా జాన పద సాహిత్య సేకరణ విషయములో విశేషించి చెప్పదగిన ప్రయత్నములు జరుగలేదు. ఆనాడు జానపద సాహిత్య శాఖను పురాతన మానవ వంశ శాస్త్రమునందు చేర్చెడివారు. 19 వ శతాబ్దములో పలువురు ఆంగ్లేయ సివిలియనులు భారతదేశమును పరిపాలించుటకు వచ్చిరి. వీరిలో పెక్కుమంది పరిపాలనాదక్షులే గాక ఉద్దండ పండితులు గూడ. వారికి భారతీయ సంస్కృతి యనిన మక్కువ యెక్కువ. భారతీయ సాహిత్య మనిన వారికి గౌరవాభిమానములు గలవు. అందువలన వీరు ప్రాచీన చరిత్ర, సంస్కృతిని గుఱించి చేసిన పరిశోధనా కృషి పండితుల మన్నన అందుకొనిన దనుటలో సందేహ యను లేదు.

సేకరణ :

భారతీయ జానపద సాహిత్యమును మొట్ట మొదట సేకరించ పరిశోధించిన వారు రెండు వర్గము లకు చెందిన వారు : (1) ఆంగ్ల సివిలియను అధి కారులు (2) క్రిస్టియను మిషనరీలు. సివిలియను అధికారులు మన దేశమును పరిపాలించుటకు వచ్చిరి. క్రిస్టియను మిషనరీలు క్రైస్తవ మత ప్రచారమును గావించుటకు వచ్చిరి. కాని ప్రజలతో సన్నిహిత సంబంధ మేర్పరచుకొనుటకు భారతీయ భాషా సాహి త్యముల పర్యవేక్షణ మొనరించవలెనని పై రెండు వర్గములవారు గ్రహించిరి. మత ప్రచార మొనరించు టకు ఆయా భాషలను నేర్చుకొని ఆయా భాషలలో మాట్లాడుట అవశ్యకము. ఇట్టి ప్రయోజనమును గమనించి పై రెండు వర్గములవారు భారతీయ భాష లను నేర్చుకొన దొడంగిరి. ఆంగ్ల సివిలియను అధి కారులు భారతీయ జానపద సాహిత్యమును సేకరించి మొదటి సేవ నొనరించినారు.

పరిశీలకులు

కర్నలు జేమ్సు 'టాడు' మొట్ట మొదట ఈ పవిత్ర కార్యము నారంభించెను. ఈయన రాజస్థానము లోని సంస్థానము లందు రెసిడెండుగా నుండెడివారు. అందువలన రాజస్థాన ప్రాంతములోని ప్రజల ఆచార వ్యవహారములను ఆటపాట విహారములను, వేషభాషలను గురించి తెలిసికొనగల్గిరి. కొన్ని యేండ్ల తరబడి కష్టించి 1829 సంవత్సరములో 'ఏనాల్సు అండ్ యాంటిక్విటీస్ ఆఫ్ రాజస్థాన్' అను పుస్తకమును వెలువరించిరి. ఇందు రాజస్థానమునందలి భిన్న భిన్న స్వదేశ సంస్థానములను గురించిన వివరణము పొందు పరుప బడినది. ఇందు జానపద గీతములను గూర్చి గాని, జానపద కథలను గూర్చిగాని వివరించలేదు. కాని జానపద గాథలనుబట్టి, జానపద గీతముల నాధా రముగా గైకొని టాడ్ ఈ గ్రంథమును విరచించి రనుట నిస్సందేహము. భారతీయ జానపద సంస్కృ తిని గురించి మొట్టమొదట తెలిసికొని వివరించిన వాడు 'టాడు'.

సి. పి. బ్రౌను శిష్ట సాహిత్యోద్ధరణమునకు బూనుకొని చెదలు తినుచున్న సాహిత్య సంపదను పరిరక్షించినారు. ఈయన మన తెలుగు భాషను 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని భాషించినారు. ఈయన కన్ను జానపద సంపదపై పడినది; కాని సేకరించుట యందు ప్రత్యేక శ్రద్ధను జూపలేదు. బ్రౌను ఏషియాటికు జర్నలు వాల్యూము 34 లో 1841 లో యక్షగానములను గురించి చెప్పుచు జానపద సాహిత్య మహిమను గొనియాడినారు.

జె. బీమ్సు సివిలియను 1868 లో బెంగాలు ఏషియాటిక్ సొసైటీ పత్రికలో భోజపురీభాషను గూర్చి వ్రాసినారు. ఈయన భోజపురీ వ్యాకరణ వేత్త. ఈయన వ్రాసిన హిందీ (భోజపురీ) వ్యాక రణము ప్రామాణిక గ్రంథ మనవచ్చును. భోజపురీ భాషను గూర్చి వ్రాయుచు అనేక జానపద గీతములను సోదాహరణముగా కూర్చినారు.

జె. ఐబట్ 1854 లో 'ఆన్ ది బేలడ్స్ అండ్ లి జెండ్సు ఆఫ్ ది పంజాబ్' అను వ్యాసమును ప్రకటించిరి. ఇందు పంజాబు వీరగాథలను గురించి తెలిసికొని ఆయా వీరులను గురించి వ్రాసినారు. రెవరెండు ఎస్. హిస్లపు అను పాదరి మధ్యప్రదేశమున నివసించు ఆటవిక జాతులను గురించి వ్రాసినారు. 1866 లో హిస్లపు వ్రాసిన వ్యాసములను సేకరించి సర్ రిచర్డ్ టెంపుల్ పుస్తక రూపమున వెలువ రించినాడు. 1868 లో మిస్. ఫ్రేయరు అను ఆంగ్ల వనిత 'ఓల్డ్ డక్కన్ డేజ్' అను పుస్తకమును ప్రచు రించినది. ఇందు దక్షిణ భారతదేశమునందలి జాన పద కథలు జోడింపబడినవి. 1871 లో ఛార్లెస్ ఈ. గోవర్ 'ఫోక్ సాంగ్సు ఆఫ్ సదర్న్ ఇండియా' అను పుస్తకమును ప్రచురించిరి. ఇది భారతీయ జానపద గీతముల ప్రథమ సంకలనము. ఈ సంకలనమందు కన్నడ జానపద గీతములను, బడగ గీతములను, కూర్గు గీతములను, తమిళ గీతములను, కురల్, మళ యాళము, తెలుగు జానపద గీతములను సేకరించి వాని యనువాదము రూపొందింప బడినది. భారతీయ జానపద గీత సంగ్రహ, అనువాద కార్య మీ గ్రంథ ముతో నారంభింప బడినది. ఈయన వేమన పద్యము లను జోడించినాడు; తెలుగు పాటలను జోడింప లేదు. 1872 లో డాల్టను 'డిస్క్రిప్టివు ఏంథాలజీ ఆఫ్ బెంగాల్' అను గ్రంథమును తయారుచేసిరి. ఇందు

బెంగాలులో నివసించు విభిన్న జాతులను గురించి వివ రింపబడినది. 1872 లోనే ఆర్. సి. కాల్డ్వెల్ 'తమిల్ పాపులర్ పొయిట్రి' అను వ్యాసమును ఇండియను ఆంటిక్వెరీ భాగము 1, పే 97–103 లో ప్రచురించిరి. ఇందు తమిళ జానపద గీతములను గురించి వివరించిరి. 1874 లో జె. ఏ. బాయిల్ రాయలసీమలో రాజకీయోద్యోగి. వీరు 'తెలుగు బేలడ్ పొయిట్రీ' అను వ్యాసమును 'ది ఇండియన్ ఏంటి క్వెరీ' (భా 3, పే 1) వ్రాసిరి. ఈయన మొత్తము ఆరు పాటలు సేకరించి ప్రకటించిరి. ఇందు ఒకటి చారిత్రక గేయము; తక్కినవి శృంగార గేయములు. చారిత్రక గేయము సర్వాయిపాపని వీరగాథ. దీనిని బళ్లారి వాస్తవ్యుడగు నొక బోయనుండి సేకరించిరి. ఈయన తెల్లదొర. కాని జాన పద గేయ ప్రథమో ద్ధారకుడు. 1876 లో ఎఫ్. టి. కోల్ రాజమహ లులో నివసించు కొండజాతులను గురించి 'ది రాజ మహల్ హిల్ మెన్స్ సాంగ్సు' అను వ్యాసమును ఇండియను ఆంటిక్వెరీలో (భా 5, పే 222–222) ప్రచురించిరి. జి. హెచ్. డెమెంట్ 'బెంగాలీ ఫోక్ లోర్ ఫ్రమ్ది నాజ్‌పూర్' అను పుస్తకమును రచిం చిరి. ఇందు బెంగాలీ జాన పద కథలు పొందుపఱుప బడినవి. ఈయన 1879 లో చనిపోయిరి. నాటి వఱకు ఇండియన్ ఎంటిక్వెరీలో జాన పద సాహిత్య సంబంధమైన వ్యాసములు వ్రాయు చుండిరి.

హ్యూజ్ ఫ్రేయరు (1883) ఆంగ్ల సివిలి యను గోరఖ్‌పూరు జిల్లా మేజిస్ట్రేటు. బెంగాలు ఏషియాటిక్ సొసైటీ పత్రికలో ఈయన గోరఖ్ పూరు జిల్లాలో లభించిన భోజపురీ గీతములను ప్రచు రించినారు. మొత్తము గీతములు పదమూడు. ఇందు ఆరు గీతములు శృంగార గీతములు; ఒకటి విసురు రాయి పదము; మిగిలినవి విభిన్న విషయములకు సంబం ధించినవి. ఈ గీతములు ఆంగ్ల భాషలో ననువదింప బడినవి. గ్రియర్సను ఈ గీతములను సేకరించి వెలువ రించినారు. ఇందు అనేక విషయములను గురించి వివ రించినారు.

1884 లో ఆర్. సి. టెంపుల్ 'ది లెజెండ్ ఆఫ్ ది పంజాబు' అను పుస్తకమును ప్రకటించిరి. ఇందు పంజాబు వీర గీతములు సేకరించి పొందుపఱుప బడినవి. పంజాబీ జాన పద కథలను సేకరించు ప్రథమ ప్రయత్న మిది.

1885 లో శ్రీమతి స్టీల్ 'వైడ్ ఎవేక్ స్టోరీజ్' అను పుస్తకమును వ్రాసెను. ఈ సేకరణ కార్యమునందు ఆర్. సి. టెంపుల్ తోడ్పడిరి. ఈ కథల సంపుటి విశేషించి పేర్కొనదగినది. ఆ నాటికి నోనోట నానుచున్న కథలు పల్లెటూరి పిల్లలు సేక రించిరి. అయా సంఘటనలనుబట్టి కథలను ఏర్చి, పేర్చి, కూర్చిరి.

ఈ. జె. రాబిన్సను 'టేల్సు అండ్ పోయమ్స్ ఆఫ్ సౌత్ ఇండియా' అను గ్రంథమును వెలువరించిరి. ఇందు దక్షిణ భారతదేశములోని జాన పద గీతములు, జానపద కథలు ఆంగ్ల భాషలోనికి అనువదించబడినవి.

## గ్రియర్సను :

భారతీయ జానపద సాహిత్య సేకరణలో ప్రముఖ పాత్రను వహించిన వారు సర్. జార్జి గ్రియర్సను. భాషా శాస్త్రమునందాయన చేసిన సేవ మరువలేనిది. 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' ఆయన సంపాద కత్వమున వెలువడిన మహా గ్రంథము. జానపద సాహి త్యమును సేకరించి దాని పరిరక్షణకు వెంతయో తోడ్పడినవారు గ్రియర్సను.

1884 లో 'సమ్ బిహారీ ఫోక్ సాంగ్స్' అను వ్యాసమును రచించినారు. ఇందు బిహారీ జాన పద గీతము లుదాహరింప బడినవి. 1886 లో గ్రియర్సను 'సమ్ భోజపురీ సాంగ్స్' అను బృహద్ వ్యాసమును ప్రచురించిరి. ఇందు భోజపురీ ప్రేమ గీతములు, విసురు రాయి పదములు, జన్మ గీతములు సేకరింపబడి నవి. ఇందు మూల గీతముల నిచ్చి గ్రియర్సను ఆంగ్లానువాద మొనరించినారు. వ్యాసము చివర భాషా శాస్త్ర సంబంధమైన టిప్పణిని జోడించినారు. భోజ పురీ జాన పద గీత సంకలన కార్యమున కిది నాంది యన వచ్చును.

1884 లోనే గ్రియర్సను 'విజయమల్లు జానపద గాథను' సేకరించి నారు. ఇది బెంగాలు ఏషియా టిక్ సొసైటి పత్రికలో ప్రచురింప బడినది.

1885 లో వీరు 'ది సాంగ్ ఆఫ్ ఆల్హాస్ మారేజి' అను వ్యాసమును 'ఇండియన్ ఎంటిక్వెరీ'

పత్రికలో ప్రచురించిరి. ఇందు ఆల్హా వివాహ వర్ణనము వివరింపబడినది. దీని మూలగీతము గూడ ప్రచురింపబడినది. అంతియే గాక 'టూ వర్షన్సు అఫ్ ది సాంగ్ అఫ్ గోపీచంద్' అను రూపమున గోపీచందు కథకు సంబంధించిన భోజపురీ, మగధీ భాషలలోని వేర్వేరు రూపములను సంకలన మొనరించి ప్రచురించిరి.

1889 లో జర్మనీలోని సుప్రసిద్ధ పత్రికలో గ్రియర్సను 'నయకాబన్ జరవా' అను గీతమును ప్రచురించిరి. ఇది ఒక కథాత్మక గీతము. భోజపురీ ప్రాంతము నందు బహుళ ప్రచారమునందున్న గీత మిది. డాక్టరు గ్రియర్సను సంకలన కార్యమునందు పేర్కొనదగిన విశేషము లనేకములు గలవు. గ్రియర్సను మూలగీతమును పొందుపఱచెడి వారు; తర్వాత దాని కాంగ్లానువాదమును జోడించెడి వారు. అంతియే గాక ఆ గీతమునకు గల చారిత్రక ప్రసిద్ధిని పేర్కొనుచు భాషాశాస్త్ర సంబంధమైన టిప్పణిని గావించెడి వారు. వీరు 'బీహార్ పీసెంట్ లా ఇఫ్' అను గ్రంథమును రచించిరి. జానపదములందు నోనోట నానుచున్న పదములిందు సేకరింపబడినవి.

విలియమ్ క్రూక్ :

భారతీయ జానపద సంస్కృతీ సంరక్షణమునకు, సాహిత్య సంకలనమునకు తోడ్పడిన మహనీయుడు విలియమ్ క్రూక్. ఈయన బ్రిటిషు సివిలియను మీర్జాపూరు కలెక్టరుగా పనిచేసినారు. ఈయన ఉత్తరప్రదేశ్‌లోని జానపద గీతములను సేకరించిరి; భారతీయ జానపద సంస్కృతిని గురించి దీక్షతో ఆపోశనము పట్టినారు. 1891 లో భారతీయ జానపద సంస్కృతీ సాహిత్య పరిరక్షణకు 'నార్త్ ఇండియన్ నోట్సు అండ్ క్వైరీస్' అను పత్రికను స్థాపించిరి. ఈ పత్రికా ముఖమున భారతీయ జానపద సాహిత్యమున కెనలేని సేవ నొనరించి నారు. ఈ పత్త్రిక అయిదారేండ్లు నడచినది. ఈ పత్రికలో అమూల్యములైన జాన పద గీతములు, కథలు ప్రచురింపబడినవి. 1896 లో క్రూకు 'పాపులర్ రిలిజియన్ అండ్ క్ లోర్ అఫ్ నార్త్ ఇండియా' అను మహత్తర గ్రంథమును రచించిరి. ఇందులో వివిధ విషయములు వివరింపబడినవి. గ్రుడ్డి నమ్మకములు, మందుమాకులు, భూతవైద్యము, గ్రామ దేవతలు, భూత పిశాచములు, ఆచార వ్యవహారములు, మొదలగు విషయములను గురించి చర్చింపబడినది. భోజపురీ ప్రజల ఆచార వ్యవహారములను గూర్చి విశేషించి యీ పుస్తకము నందు క్రూకు వివరించినాడు. ఇంకను 'కాస్ట్ జ్ అండ్ ట్రైబ్స్' ఆఫ్ నార్త్ వెస్ట్ ప్రావిన్స్' అను పుస్తకములు నాలుగు భాగములు గలవు. ఇందు క్రూకు ఉత్తర భారతీయ జాతులను గురించి వివరించినారు. క్రూకు ప్రోద్బలముతో పండిత రామ గరీబ్ చౌబే అను ప్రైమరీ స్కూలు అధ్యాపకుడు ఉత్తరప్రదేశ్ జాన పద గీతములను సేకరించెను. 1893 లో ఈ గీతములు 'నార్త్ ఇండియన్ నోట్సు అండ్ క్వైరీజ్' అను పత్రికలో ప్రచురింపబడినవి.

జె. డి. అండర్‌సన్ 1895 లో అస్సాము రాజ్యములోని కఛారీ జాతివారి జానపద కథలను, శిశు గీతములను సేకరించి 'కలెక్షన్ ఆఫ్ కఛారీ ఫోక్ టేల్స్ అండ్ రైమ్స్' అను పేర వెలువరించిరి. 1899 లో ఆర్. ఎమ్. ల్యాఫెనెస్ 'సమ్ సాంగ్స్ ఆఫ్ ది పోర్చుగీస్ ఇండియన్‌జ్' అను వ్యాసమును ఇండియన్ ఎంటిక్వెరీ అను పత్రికలో (భాగము 30, పుట 400-406) ప్రచురించిరి. ఇందు గోవా నివాసుల జానపద గీతములు పొందుపఱుప బడినవి.

1903 లో స్విన్నర్టను పంజాబీ జానపద కథలను సేకరించి 'రోమాంటిక్ టేల్స్ ఫ్రమ్ ది పంజాబ్' అను పుస్తకమును ప్రచురించిరి. ఇందు 'రసాలూ' రాజు కథ కూడ జోడింప బడినది.

1905 లో ఎఫ్. హాన్ 'కురుఖ్ ఫోక్ లోర్ ఇన్ ఒరిజినల్' అను పుస్తకమును వెలువరించిరి. ఇందు ఉరవల జాన పద గీతములు మొత్తము రెండు వందలు సేకరింప బడినవి.

1905 లో ఇంథస్టన్ 'ఎంథోగ్రాఫిక్ నోట్స్ ఇన్ సదర్న్ ఇండియా' అను పుస్తకమును వెలువరించిరి. ఈయన దక్షిణ భారతీయ జాతులను గురించి క్షుణ్ణముగా తెలిసికొని నారు. వీరే 1909 లో కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సదరన్ ఇండియా' అను పుస్తకమును ప్రచురించిరి.

1908 లో 'ఇండియన్ ఫోక్ టేల్' అను పుస్తకమును ఇ. ఎమ్. గోర్డను ప్రచురించిరి. 1909 లో సి. హెచ్. బాంపాస్ 'ఫోక్‌లోర్ ఆఫ్ ది సంథాల్ పరగణాజ్' అను పుస్తకమును ప్రకటించిరి.

క్రో ఫోర్డు అర్థరు 'లిజెండ్సు ఆఫ్ ది కొంకణ' అను పుస్తకమును వెలువరించిరి. ఇ. థర్స్టన్ 1912 లో 'ఒమన్స్ అండ్ సూపర్ స్టిషన్సు ఆఫ్ సదర్న్ ఇండియా' అను అమూల్య గ్రంథమును వెలువరించిరి. దక్షిణ భారతీయుల ఆచార వ్యవహార ములు, శకునములు, అంధవిశ్వాసములు, తంత్రములు, మంత్రములు, చేతబడులు మొదలగునవి వివరింప బడినవి.

1907 లో డబ్లు. టి. డేమన్సు 'పాపులర్ పొయిట్రీ ఆఫ్ ది బలోచీజ్' అను పుస్తకమును ప్రకటించిరి. ఇందు వీరగాథలు, ప్రేమగీతములు, పొడుపు కథలు మూలరూపమున నున్నవి. అనువాదము ఆంగ్ల భాషయం దున్నది.

1908 లో ఈ. స్టేక్ అస్సాము ప్రాంతము లోని మికిరజాతి ఆచార వ్యవహారములను గురించి 'ది మికిర్స్' అను పుస్తకములో రూపొందించిరి.

సి. హెచ్. బోంపస్ 1909 లో బోడింగ్ ద్వారా సేకరింపబడిన సంథాలీ కథలను ఇంగ్లీషులోని కనువదించిరి.

1911 లో సెలిగ్‌మాన్ 'వేద్దు' జాతిని గురించి వివరించిరి.

1912 లో షేక్‌స్పియరు అను ఫాదరీ అస్సాము ప్రాంతమునకు జెందిన 'లుశా కూకీ' జాతి సాంఘిక వ్యవస్థను గురించి వివరించిరి.

ఎం. జి. అగర్‌కర్ బరోడా స్వదేశ సంస్థాన ములో నివసించు జాతులను గురించి 'ఏ గ్లాసరీ ఆఫ్ కాస్ట్స్, ట్రైబ్స్, అండ్ రేసెజ్ ఇన్ బరోడా స్టేట్' వ్రాసిరి.

ఎంకుక్ 'బెంగాలీ హౌస్ హోల్డ్ టేల్స్' అను పేర జానపద కథలను సేకరించి ప్రకటించిరి.

1916 లో రసెలు, డా॥ హీరాలాలు కలిసి మధ్యప్రదేశ్‌లోని జాతులను గురించి 'ది ట్రాయిబ్స్

అండ్ కాస్ట్స్ ఇన్ సెంట్రల్ ప్రావిన్స్ ఆఫ్ ఇండియా' అను పేర నాలుగు భాగములు వెలువరించిరి. ఇందు మధ్యప్రదేశ్ జాతుల జాన పద గీతములు, జానపద కథలు పొందుపఱుప బడినవి.

1917 లో సి. ఏ. బక్ 'ఫైథ్స్, ఫేయర్స్ అండ్ ఫెస్టివల్స్ ఆఫ్ ఇండియా' అను పుస్తకమును రచించిరి. ఇందు జానపదుల పండుగలు, పబ్బములు, నమ్మకములు మొదలగువానిని గుఱించి వివరింప బడినది.

1918 లో బిహారు గవర్నమెంటు డాక్టరు గ్రియర్సను పుస్తకము 'బిహార్ పిసెంట్ లా ఇఫ్'ను మఱల ప్రచురించినది. ఈ పుస్తకమును ప్రచురించిన తర్వాత భారతీయులలో నోనోట నానుచున్న పలుకు బళ్లను సేకరింపవలెనను కుతూహలము జనియించినది.

ఆర్. ఇ. ఎంధోవిను 'ది ఫోక్‌లోర్ ఆఫ్ బాంబే' (1924), ట్రాఇబ్స్అండ్ కేస్ట్ ఆఫ్ బాంబే (1926) అను పుస్తకములను ప్రచురించిరి.

1930 లో 'డాన్సు అండ్ డ్రామా ఇన్ బలీ' అను గ్రంథమును డిజోట్ మఱియు స్పైన్‌వాల్సరు ప్రచురించిరి.

ఎ. జి. శరీఫ్ ఆంగ్ల సివిలియను జౌన పూరులో జిల్లా మేజిస్ట్రేటు (1936). పండిత రామనరేశ్ త్రిపాఠీగారితో పరిచయ మేర్పడిన తర్వాత భోజపురీ జానపద గీతములపై ఈయన దృష్టి మరలినది. వీరు హిందీ 'ఫోక్‌సాంగ్సు' అను పుస్తకమును ప్రచురించిరి. గీతములన్నియు గేయ రూపమున ననువదింప బడినవి. 1938 లో డెక్స టరీ విలియన్సు 'మరాఠీఫోక్ టేల్స్' అను పుస్తకమును లండనులో ప్రచురించిరి.

ఎల్విన్ వెరియరు 1944 లో 'ఫోకు టేల్సు ఆఫ్ మహాకోశల' అను గ్రంథమును, 'ఫోకు సాంగ్సు ఆఫ్ ఛత్తీస్‌గఢ్' అనుపుస్తకమును 1946లో ప్రచురించిరి. 1944 లో ఎల్విన్ మఱియు హైవెల్ అనువారు 'ఫోక్ సాంగ్సు ఆఫ్ ది మైకెల్ హిల్స్' అను పుస్తకమును వెలువరించిరి.

ఎల్విన్ వెరియర్ మధ్యప్రదేశములో ఆటవిక జాతులమధ్య నివసించి వారి యాచార వ్యవహారములను కూలంకషముగా పరికించిరి. వీరి సలహా ప్రకారము శ్రీ నెహ్రూ ఆదివాసుల సంస్కృతిని పరిరక్షించుటకు కంకణము కట్టుకొనిరి.

పత్రికలు :

ఈ సందర్భమున కొన్ని ముఖ్యపత్రికలను పేర్కొనవలసి యున్నది.

ఇండియన్ ఆంటిక్వెరీ (1872—1933) బొంబాయిలో 1872 లో 'ఇండియన్ ఆంటిక్వెరీ' అను పత్రిక స్థాపింపబడినది.

ఇందు ప్రాచీన సంస్కృతి, అచార వ్యవహారములకు ప్రాధాన్యమీయబడినది. క్రమక్రమముగా జానపద సాహిత్యమునకు స్థానమీయబడినది. ఇది 1933 వఱకు నడచినది. 1938 లో 'న్యూ ఇండియన్ ఎంటిక్వెరీ' అను పత్రికను కొన్నినాళ్లు డాక్టరు ప. కృ. గోడే నడిపినారు.

1886 లో బాంబే ఆంత్రొపోలాజికల్ సొసైటీ స్థాపింపబడినది. దీనికి అధ్యక్షులుగా వ్యవహరించినవారు:—

సర్ రిచర్డు టెంపుల్ (1887)
సర్ డెంఝిల్ ఇబెట్‌సన్ (1889)
సర్ హర్బర్టు రిసలే (1891)
విలియమ్ క్రూకు (1895)
ఆర్. వి. ఆంథోవెన్ (1909, 1911)

మైన్ ఇండియా (1921) అనుపత్రిక శరచ్చంద్ర రాయ్ సంపాదకత్వమున వెలువడినది. క్రుక్, రిహర్స్, ఎల్విన్, అర్థర్ మొదలగువారి సహకారము సంపాదకునికి లభించినది. ఇందు అనువాదములు ప్రకటింప బడుచుండెడివి. మూలరూపము నీయనిదే

జానపద సాహిత్యములోని సొబగులను గ్రహించుట కష్టమని పలువు రభిప్రాయపడిరి.

కలకత్తా సొసైటీ ద్వారా వెలువడిన పత్రికలో ఈ క్రింది వ్యాసములు పేర్కొనదగినవి.

ఎబ్బెట్‌జేమ్సు—అన్‌ది బాలడ్స్ అండ్ లిజెండ్స్ ఆఫ్ ది పంజాబ్ (22, 50) ఫ్రేజరు హ్యూజ్ : ఫోక్‌లోర్ ఫ్రమ్ ఈస్టరన్ గోరఖ్‌పూర్ (3, 1)

గ్రౌస్. ఎఫ్. ఎస్. ది ఎటిమాలజీ ఆఫ్ లోకల్ నేవ్స్ ఇన్ నార్తరన్ ఇండియా.

మాసన్ రివరెండు ఫ్రాన్సిస్ : రిలిజియస్ మైథాలజీ, ఎస్ట్రానమీ అమాంగ్ ది కారెన్స్.

(35, Part II 95)

స్మిత్ విన్సెంట్—పాపులర్ సాంగ్స్ ఆఫ్ ది హామిర్‌పుర్ డిస్ట్రిక్టు ఆఫ్ బుందేల్‌ఖండ్.

స్విన్నర్ టన్‌రే — ఫోక్‌టేల్స్ ఇన్ అప్పర్ పంజాబ్.

బొంబాయి శాఖ తరపున వెల్వడు పత్రికలో ఈ క్రింది వ్యాసములు పేర్కొనదగినవి :

మాక్మిలన్—నాథ్‌రన్ ఫోక్ సాంగ్సు.

మాండ్లిక్. వి. ఎన్—సర్పెంట్ వర్షిప్ ఇన్ వెస రన్ ఇండియా.

గ్రేట్ బ్రిటను, ఐర్లండు సొసైటీల తరపున వెల్వడిన పత్రికలలో ఈ క్రింది వ్యాసములు పేర్కొన దగినవి :

కోల్ స్ట్రీమ్. డబ్లు — లేబర్ సాంగ్సు ఇన్ ఇండియా (1919—43)

గ్రియర్సన్ — సమ్ బిహారీ ఫోక్ సాంగ్స్ (1886)

సమ్ భోజపురీ ఫోక్ సాంగ్స్ (1886)

ఫోక్ ఎటిమాలజీ అండ్ ఇట్స్ కాన్సిక్వెన్సు (1909)

హౌయలు. ఇ. డబ్లు—సమ్ బోర్డర్ బాలడ్స్ ఆఫ్ ది నార్త్ వెస్ట్ ఫ్రాంటియర్ (1909)

మన కర్తవ్యము :

ఇట్లు భారతీయ జానపద సంస్కృతిని పరిరక్షించుటకు పాశ్చాత్యులు భారతీయ జానపద సాహిత్యమును సేకరించినారు. వారు మన ముపేక్షించిన పెన్నిధిని సేకరించి నిలువ బెట్టినారు. వీరి శ్రమ, శ్రద్ధ కొనియాడదగినది. వీరి ప్రోద్బలముతో భారతీయులు భారతీయ జానపద సాహిత్యమును సేకరించుచున్నారు. నోనోట నానుచున్న సాహిత్యమును పరిరక్షించు బాధ్యత నేడు మన భారతీయులపై బడినది. నాగరకత ప్రబలుచున్న ఈ రోజులలో జానపద సాహిత్య సంపదను భద్రపఱచుట మన పరమ ధర్మము. పాశ్చాత్యుల వేష భాషలను మన మనుకరించు చున్నారము. వారి దీక్షను, కార్య నిర్వహణ శక్తిని జూచి మనము గుణపాఠము నేర్చుకొనవలెను. భారతీయ ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వములు తోడ్పడిన నాడు మన మీ సంపదను రక్షించుకొనగలము. లేనిచో ఉన్న సంపదను పోగొట్టుకొని బికారుల మగుట తథ్యము.



# కోటేశ్వర దాసుగారి అముద్రిత రామ కీర్తనలు

శ్రీ 'గిరీంద్ర'

"సంగీత జ్ఞానము, భక్తివినా సన్మార్గము గలదా— మనసా!'' అని తనను తాను ప్రశ్నించు కొంటూనే భగవత్సాయుజ్యం కావాలనుకొనే మానస్సులను కూడా భక్తిమార్గంవైపు మళ్లించే ప్రయత్నం చేశారు భాగవతోత్తములు శ్రీ త్యాగరాజస్వామి వారు. సంకీర్తనా సాంప్రదాయాన్ని వరవడిగా నెరపుతూ వచ్చిన శ్రీ అన్నమాచార్య. క్షేత్రజ్ఞ, సిద్ధేంద్ర, రామదాసాది భక్తకవులెందరో తమ అమూల్య కవితా శక్తిని భక్తిమార్గం పట్టించి, తాము తరించారు. విశ్వ కళ్యాణానికి వేదికను నిర్మించి, పచ్చతోరణాల నలంకరించి సహృదయాల నలరించడం మనకు తెలుసు. శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, పాలపర్తి నరసింహదాసు, తూము నరసింహదాసు, బొమ్మరాజు సీతారామదాసు, కూర్మదాసుల వంటి మహానుభావులెందరో ఆ వేదికమీద సత్య శివ సుందరమైన భగవల్లీలను మధురంగా గానం చేశారు; మరెందరో నేడూ గానం చేస్తున్నారు. ఆ గాన స్రవంతి అవిచ్ఛిన్నం. అపరిమితం. పుష్పకం లాంటి ఆ వేదిక మీద ఎందరైనా వుండవచ్చు. అయినా మరొకరికి స్థానం వుండనే వుంటుంది. అయితే కొందరు ముందున్న దీపం వెలుగు పరిధిలోకి రాక, అలా కొంచెం 'కాలాన్ని చాటుచేసుకొని, తన శాఖలు వాయిస్తూ, సంకీర్తనంచేస్తూ, పరమపదాన్ని చేరుకుని మరుగైపోతారు. అట్టివారిలో కోటేశ్వర దాసు గారొకరు.

పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరార్థం క్రీ. శ. 1870 ప్రాంతం. వెలుగోటి ప్రభువులేలిన వెంకటగిరి జమీందారీలోని పెళ్లూరుసీమ (1870) (నేటి ప్రకాశంసీమ)లో ఒక చిన్నవూరు. ఆ వూరి రామాలయంలో నిత్యం సాయంవేళ ప్రొద్దుపోయేవరకూ రామ భజన జరుగుతూండేది. పిల్లలందరూ చుట్టూ చేరి ఉత్సాహంతో పల్లవి పాడుతుండగా మధ్యను కూర్చున్న నల్లని అయ్యవారు రేగుప్తి రాగంలో ఆదితాళంతో 'రామ నా మొరాలకించరా — ఏమయ్యా—సీతారామ— నా మొరాలకించరా!' అని దీనంగా గానంచేసి, భారమనుచు మదికి దోచెనా—వరుడనుచు నీ భావమునను దలచె యోచనా?' అని కన్నీటితో ప్రశ్నించే వారు. అంతలో కీర్తన మార్చి 'చూచినా నమ్మా—రాముని కనులా చూచినా నమ్మా!' అని పాడుతూ ఆనంద పారవశ్యంతో మోదబాష్పాలు రాల్చేవారు. ఊర్ధ్వ పుండ్రాలతో, వెలుగుల కళ్లతో, సుదృఢ గాత్రంతో కూర్చున్న ఆ నల్లనయ్యగారే కోటేశ్వరదాసు గారు. అలా ఆ భజన బృందంలో సంకీర్తనం నేర్చుకున్న నా అవ్వ తన చివరి రోజుల్లో చెప్పినదీ పద చిత్రం.

ఈయన బ్రహ్మచారి, తత్త్వవేత్త. వేదాంతాన్ని, యోగాన్నీ శిష్యుల కుపదేశిస్తూ దేశికేంద్ర స్వామిగా గౌరవింపబడుతూండే వారు. కాశీ ప్రయాగాది పుణ్యక్షేత్రాలు దర్శించి వచ్చి, స్వగ్రామంలో శివాలయాన్ని నిర్మించి, శివప్రతిష్ఠ చేసి, ఉత్సవాదులు జరిపించారు. ఈ తిరునాళ్ల సందర్భంగానే ప్రదర్శించడానికి అనువుగా తన ప్రియ శిష్యుడు మన్నేపల్లి కోటేశ్వరకవి చేత శివకృతి గావింప జేశారు. అది భల్లాణ రాజచరిత్రమనే యక్షగానము. ఈ అముద్రిత కృతిని గూర్చి లోగడ (అక్టోబరు 72) 'భారతి'లో మనవి చేసియున్నాను. ఇందులో కవి గురు

స్తుతి చేస్తూ దేశికులను సుగుణ వంతుడనీ, పరమ పావనమూర్తి యనీ, భక్తవత్సలుడనీ, పరతత్త్వవేది యనీ ప్రశంసించాడు.

కోటేశ్వర దాసుగారి రచనలలో రామ కీర్తనలు, శివ కీర్తన లున్నాయి. కృష్ణలీలలు. (శృంగార పదములు), తత్వములు కూడా వున్నాయి. ఇవన్నీ దాదాపు శతమానంవరకూ వుండక పోవనిపిస్తున్నది కానీ నాకు దొరికిన వ్రాత ప్రతిలో షుమారు ఏబది వరకూ కన్పిస్తున్నాయి. కొన్నిటిని యిక్కడ పొందు పరుస్తాను.

రామకీర్తనలలో యీ క్రిందివి కొన్ని ఆ నాడు ఎక్కువగా పాడబడేవిగా తెలుస్తున్నది. ఈ కీర్తనలో జీవుని వేదనను దేవునికి ఎలా నివేదిస్తున్నాడో చిత్తగించండి :

రామనా మొరాలకించవా—
ఏమయ్యా సీతారామ, నా మొరాలకించవా!

ప॥ రామ నా మొరాలంకించవేమి—
నేరమేమొ తెల్పు—
కోరవేడితేను కరుణ జూడకున్న
వాడవయ్య ॥రామ॥

భారమనుచు మదికి దోచెనా—
పరుడనుచు నీ
భావమునను దలచు యోచనా—
ఘోరమైన పాతకములు
పాఱద్రోలు వారీ భువిని
వేరెలేరు గదర ఎవరివాడ నౌదు
సారసాక్ష! ॥రామ॥

నిన్నె చాల నమ్మినానురా
నన్నేల నీకన్నవరులు
యిలను నున్నరా!
మున్ను తలచుకొన్న వారలెన్న
రాని సుఖముల—చే
కొన్నవారితోడ గూర్చుమన్నవాడ
కన్నతండ్రి! ॥రామ॥

ఏమిసేతు ఏమనందురా
శ్రీనాథ మనసు
కేమి దోచకున్న దేమిరా!

మోదమలర నీదుపాద సేవ చేసెదను
ఇనకులాధి నాథ—ఆదరించు వాడ
వీవే వేదవేద్య! ॥రామ॥

దాసజనుల గాసిమాన్పవా—
యిలపావులూరి వాస శౌరి
మోసగింతువా!
భాసురముగ నేలు మనుచు—
దోసిలొగ్గినాడ—శ్రీని
వాస—చిద్విలాస—కోటయ
దాసపోషక—భూసుతాధిప!
రామ—నా మొఱాలకించవా!!

*  *  *

నదులకూ, నదాలకూ పరుగిడి మునిగినంత మాత్రాన దురితాలు పోవనీ, మదిలో పతితపావనుని రాముని స్తుతిచేయక సద్గతి గలుగుట సున్నయనీ యీ కీర్తనలో విశదం చేస్తున్నాడు. 'ఏకం సత్ విప్రా— బహుధా వదంతి'—యన్న వాక్యార్థాన్ని వివరిస్తూ రాముడొక్కడే నని యెక్కడ చూచినా పరమ పురుషు డొకడే యనీ వర్ణించాడు. రేగుప్తిరాగంలో ఆదితాళంలో వున్న యీ కీర్తన దాశరథీ శతకంలోని 'చిక్కని పాలపై...' అనే పద్యంలో రామదాసు కీర్తించిన 'విమలమేచక రూప సుధారసాన్ని' మనకు స్ఫురింప చేస్తున్నది.

ఎక్కడ చూచిన రాముడొక్కడే
నిక్కముగను మనసా, మనసా!
మక్కువతో శ్రీ హరిపద భజనము
ప్రుక్కజేయు మనసా, మనసా!

పల్లవి॥ చక్కని శ్రీ రఘువీరుని దలచిన
చిక్కులెల్లదీరు
నీ వెక్కస పడకను గ్రక్కున
సామిని మ్రొక్కి మదినిగోరు ॥మనసా॥

మందరధరు నకు వందనమని
యానందించవె మనసా—
సందేహము లేకను గోవిందుని
పొందు గనవె—మనసా, మనసా ॥ఎ॥

సతతము మదిలో పతిత పావనుని
స్తుతి చేయకయున్నా

మతిహీనులకును నతులితముగ
సద్గతి గల్గుట సున్నా ॥ఎ॥

మురియుచు నదులకు పరుగిడి
మునిగిన దురితము విడలేదు
పరమ పురుషునకు ప్రణమిల్లిన భువి
తిరుగుట పనిలేదు ॥ఎక్కడ॥

సరసిజోదరుని వరకథ లెప్పుడు
మరువక వినరాదా—
అరమర లేకను సిరివరునకు
దాసోహం బనరాదా ॥ఎక్కడ॥

పంకజనాభుని సంకీర్తన
యమకింకరులను కొట్టు—
శంకలేక భవసంకటములు
మొదలంట కొట్టు—మనసా—మనసా ॥ఎక్క॥

అలవైకుంఠుని వలగొని పలుమరు
విలసిల్లగ రాదా—
యిలలోపల యిలపావులూరి
శ్రీ నిలయుని గనరాదా—మనసా! ॥ఎక్కడ॥

అండపిండ బ్రహ్మాండములన్నియు
నిండియున్నవాడు
ఖండితముగ కోటేశ్వరు కభయము
లిచ్చి బ్రోచినాడు—మనసా—మనసా!!
ఎక్కడ చూచిన రాముడొక్కడే॥

*    *    *

శహనరాగంలోని యీ కీర్తనను మా పుల్లయ్య తాత బాగా పాడుతూండే వాడు. ఇందులో రాముని సేవకై ఎంతగాఢమైన కోరిక వుందో గమనించ వచ్చు.

రామా నీ సేవచేయ కోరినవాడనురా—
ప్రేమమీరగ ముద్దు మోము జూపవేమిరా
॥రామా॥

రవికోటి తేజ దశరథ రాజసుతా—నీదు
ప్రవిమల పాదకమలములె మరువలేదు! ॥రామా॥

యిభరాజవరద నా కభయ మివ్వగ రారా—
సభలో ద్రౌపదికి శుభస్కర మొసంగి తివౌర
॥రామా॥

పతిత పావనుడని నుతి జేసితిని—రామ
అతులితమైన సద్గతిని దయసేయుమా
॥రామా॥

ధరను యిలపావులూరి పురమున వెలసిన శ్రీధర
కోటేశ్వరదాసుని కరుణింప రావేమిరా! ॥రామా॥

*    *    *

ఆనంద భైరవి రాగంలో చేయబడిన యీ సంకీర్తనంలో పరులను కావమని కోరలేని తన నిర్ణయాన్ని విన్నవించుకోవడం జరిగింది.

రామా—నీ సేవ జేసెదను
పరంధామ—పరుల గావుమని వేడలేను!

దశరథ తనయ—నీవేనా—దుర్దశ
బాపకున్న నే దరిజేరగలనా ॥రా॥

పరుడని విడనాడితేను—నన్నరసి బ్రోచేటి
వారలెవరూ యీ ధరను ॥రా॥

దురితము లెడ బాయలేను—ఘోర నరకములో
బడి భరియింపలేను ॥రా॥

వెరపు మరపు దీర్పలేవా—భక్తవరుల
రక్షించేటి దొరవీవే కావా ॥రా॥

లలిత సద్గుణ దివ్యా భరణా
యిల్పావులూరి పురవర సీతారమణా! ॥రా॥

నిటల తటాక్ష సన్నుత—కోటేశ్వరదాస
పాలక—ఘనపుణ్య చరితా!

రామా—నీ సేవ జేసెదను—
పరంధామ—పరుల గావుమని వేడలేను!

*    *    *

నాదనామ క్రియలో ఆదితాళంతో రామ దర్శన లాభాలను యిలా విశదీకరించడం జరిగింది :

దరిశన మాయెగదా—శ్రీరామ—
మీ దరిశనమాయె గదా—శ్రీరామ!
దరిశన మాయెను విరిసెను దురితము—
అరి షడ్వర్గము అంటవు మాకిక ॥ద॥

పంచభూత మయమంచు ప్రపంచము
నంచు తెలిసి నిరసించగ యిపుడె ॥ద॥

దుర్భరమగు సంసార వార్ధికి-నిర్భయుడై
విని అబ్జ గర్భ—మీా ॥ద॥

గర్భ నరకములో బడి మునగని సందర్భము
దెల్పే సద్గురు కృపచే ॥ద॥

హద్దు లేకయే ప్రొద్దున తిరిగే
బుద్ధిని మర్దించి ప్రసిద్ధిగా ॥దరి॥

సుదతులపై భ్రమ వదలని మనసును
పదిల పరచితే—మదన జనక—మీా ॥ద॥

తండ్రి వనుచు యిలపావులూరి యఖండ
తేజ—మీా దండ చేరిన-మీా ॥ద॥

ధాటిగా కోటేశ్వర దాసుని మది వేసట
బాపిన నాటకధర—నీ ॥దరి॥

* * *

ఆశలను వీడలేక, మాయను తెలియరాక మనసు పడే పాట్లను చూచి నవ్వుకొన్న కోటేశ్వర దాస జాగృతి యిలా మందమందంగా ముఖారి రాగాలావన చేస్తూ 'మనసు' మీాద ఆదితాళంతో హెచ్చరికలు వాయిస్తోంది :

విచార పడనేలా మనసా—
పిశాచ మననేలా—
నిశాచరను వలె దిశలు దిరిగేవు—
శశి కోనరము అనలే తలచెదు! ॥విచార॥

వేసటలను మాని శ్రీశుని—వశము
చేసుకొని, హసాయమున
మదవశము గాక, సుర శిఖామణికి
మ్రొక్కోని—(అపో) కృశించకు! ॥విచార॥

మాయలు విడరాదా—రాముని
బాయక మనరాదా!
కాయము నిల్కడ కాదని తెలియును
పాయము లెరుగవు
ఛీ—కూయకుమా! ॥విచార॥

ఆశలు మానవుగా—యీా జగదీశుని
దలచవుగా—నీచ శరీరము
కోసము నీ విటు గాసి చెంది
బల్ మోసపోయితివి ॥విచా॥

రోస మేల నీకు—భద్రగిరీశు
కొలచి బ్రతుకు!
శవదేహము చూచుక భ్రమసేవు—
లేశము నంటదు రోసి—
భ్రమించకు ॥విచార॥

జారి చెందబోకు—హరి పద
జోళి మరువ బోకు—
మేలు గల్గు యిల పావులూరి
కోటేశ్వర దాసుని కూరిమి విడువకు !

విచార పడనేలా—మనసా—
పిశాచ మవనేల !!

* * *

'హరిదాస వరు ఉల్లసిల్ల, కోటేశ్వర దాసు డీ రామ నామ మెదజల్ల'డం మాత్రమే గాదు. తన హరి హర పూజాసక్తిని ప్రకటించడంలోనూ సమరస దృక్పథాన్ని పాటించడం యీాయన శివకీర్తనలను పరికిస్తే తెలుస్తుంది.

'నా మొర వినరా విధి యేమిరా—
సాంబశివా !'

అంటూ ప్రశ్నించి,—

'భారము అన్నిటికి నీవే నాపాలి భాగ్యదేవుడవై
వెలసి యుండరా—వేరు శాయ వలదురా—
కోటేశ్వర దాసుని బ్రోచుట ఘనమయిన కీర్తిగా—
సద్గురు మూర్తివిగా—' అంటూ శివ గురువును ప్రస్తుతించడం కానవస్తుంది. మరికొన్ని కీర్తనలలో శృంగార రసం పోషింప బడింది. కొన్ని తత్త్వాలలో ముక్తి కాంతను వర్ణించి ఆమె కేలుపట్టే మార్గం సూచింప బడినది. వీటిని గూర్చి మరొకసారి యథావకాశంగా మనవి చేస్తాను.

ఈ రచన లన్నిటినీ పరికించి చూస్తే కోటేశ్వర దాసుగారి భక్తహృదయం ప్రత్యక్షరంలోనూ ప్రత్యక్షం అవుతూనే వుంటున్నది. సరళ సుందరంగా నున్న యీా కీర్తనలు సరియైన సంప్రదాయ సంగీతపు బాణీలలో పాడుతూన్నప్పుడు ఆవేశానందాలు తప్పక కలుగుతా యనడం నిస్సందేహం. రసరమా సమేతులైన సహృదయులు అముద్రితాలైన యీా కీర్తనల్లోని ఆర్తినీ, ఔచితినీ పరిశీలించి, భక్తి భావాన్ని సంభావించగలరని నా మనవి.

కలగూరగంప :

# ఆంధ్ర భాష-ఆశ్చర్యార్థకములు

ఏ భాషయందైనను శబ్దములు పరస్పర సన్నికర్షములైనపుడు శబ్దరూపమునందే గాక యర్థమునందును మార్పు గోచరించుట సామాన్య లక్షణము. సంబంధార్థక సంజ్ఞా వాచకములు వ్యస్తముగా నున్నపుడును, పరస్పర సన్నికర్షము లేనపుడును, ద్విరుక్తాద్విరుక్తము లేనపుడును, ఒ, రె, రో (హ్రస్వము గాని దీర్ఘము గాని)లతోఁ గూడునపుడును గలుగు పరిణామములను దెలుపుటయే యీ వ్యాసోద్దేశము. ఈ కార్యము లన్నిటిలోను గడపటి రూపములు అవ్యయములుగా రూపొంది యాశ్చర్యార్థమును బ్రకటించును. కొండొకచో సంబంధార్థక సూచకములును నగును.

ఒక మాట రెండు మారులు గాని అంతకు మించి గాని యవ్యవధానముగాఁ జెప్పఁబడినపుడు రెండవ సారి చెప్పఁబడిన శబ్దమును గాని, ఆ కూటమిని గాని యామ్రేడితముగ వ్యవహరించుట వైయాకరణ సంప్రదాయము. శబ్దములు దీర్ఘాంతములైనను, హ్రస్వాంతములైనను ఆమ్రేడితమున నిత్యముగా సంధి జరుగును. అది ఈ భాషలోఁ గల ఒక విలక్షణత. తెలుగులో మఱి దీర్ఘాంత శబ్దముల కెచటను సంధి జరుగదు.

అమ్మ, అయ్య, అబ్బ, అక్క, అప్ప, అవ్వ, అన్న—ఇవి తెనుఁగు భాషలోని కొన్ని సంబంధార్థక వాచకములు. వీని కన్నిటికిని ద్విత్వరహిత రూపములు గలవు. ఇట్టి రూపములకు ప్రత్యేక ప్రయోగము లేదు. ఆమ్రేడితమున ద్విత్వము లోపింపదు. వ్యస్త రూపము లాశ్చర్యార్థకము లగుచో నవి యవ్యయము లగును.

1. <u>అమ్మ</u>: సంస్కృతము అంబా; ప్రాకృతము. అమ్మా; తెలుగు—అమ్మ. 'అమ' యనునది రూపాంతరము. దీనికి తల్లి, పూజ్యురాలను అర్థములు గలవు. ప్రశంసాశ్చర్య సంతాపాదులను దెలుపును.

<u>పూజ్యతకు</u>: చెలికత్తె సత్యభామతో ననిన మాటలు.

అమ్మా! యేమని చెప్పుదు (పారి. 1—75)

<u>ప్రశంసకు</u>: అమ్మా! యీ రాజు ప్రతి గానమమ్మ యెచట (విజయ విలాసము 2—73)

ఈ శబ్దము ద్విరుక్తమగునపుడు అమ్మ+అమ్మ>అమ్మమ్మ యగును. ఇది సంబంధార్థకమగు నామ వాచకముగాఁ గ్రహింపఁబడినపుడు తల్లి తల్లి అని యర్థము నిచ్చును. అవ్యయమై ఆశ్చర్యార్థకమును దెలియఁజేయును.

ఉదా:—ఈమె మా అమ్మమ్మ (ఇది నామ వాచకము. సంబంధార్థము)

అమ్మమ్మ! వాడెంత పని చేసినాడు (ఆశ్చర్యార్థకము)

1 (a) అమ్మ+రో (రో) > అమ్మరో (రో). ఇది యవ్యయమై యాశ్చర్య ప్రశంసాదులను దెలుపును. తల్లిని సంబోధించుటకును నుపయోగింతురు. కేవల మిట్టి సంబోధనములు గ్రంథములందే గాని వాడుకయందుఁ గలుగవు. అవియును ఛందస్సౌకర్యమునకై యేర్పడి యుండును.

అమ్మరో! ధర్మరాజుఁ గొనియాడఁగఁ జెల్లదె యెల్లదేశము (పాంచాలీ పరిణయము 5—76.)

(b) 'అమ్మ' శబ్దము ఒ (ఓ) తోఁ జేరి అమ్మొ (మ్మో) యగును. ఈ రూపమును వీని ఆమ్రేడిత రూపములును అవ్యయములై ఆశ్చర్యార్థమును బ్రకటించును.

అమ్మ+ఓ (ఒ)>అమ్మో (మ్మొ)

అమ్మో(మ్మొ)+అమ్మో(మ్మొ)>అమ్మమ్మో(మ్మొ). ఇవి వ్యవహారములో నున్న ఆశ్చర్యార్థకములు.

(2) అయ్య: సంస్కృతము ఆర్యః, ప్రాకృతము: అయ్యఓ; పాళీ—అయ్య, తమిళ—అయ్య—'తండ్రి' అని అర్థము.

ఈ శబ్దమునకు తండ్రియని అర్థము. అయ్య, అయ్యా; అయ, అయా— అనునవి రూపాంతరములు.

తండ్రి యనుటకు: మా యయ్యయు బాయక బనిచేయుచు (ఆది 3–137).

అన్నయు దమ్ములుం గనుచు నయ్య పగం బిలువేడి (ద్రోణ 5–32).

ఆమ్రేడింపగా అయ్య + అయ్య>అయ్యయ్య అగును. దీనికి 'అమ్మమ్మ' (శబ్దము)వలె సత్తముండదు. తండ్రి(కి) తండ్రియను నర్థము చెప్పుటకు ఈ భాషలో 'తాత' యను నొక శబ్దము గలదు. తల్లి తండ్రికిని 'తాత' శబ్దమే వ్యవహృతము.

ఈ శబ్దము ద్విరుక్తము పదినను రూపమున గాని, అర్థమున గాని మార్పు గలుగును. ఇది వ్యస్తముగ నున్నను, ఆమ్రేడింపబడినను అవ్యయముగ మారి ఆశ్చర్యార్థమును ప్రకటింపదు. శబ్దరూపమున మార్పు కనబడకుండుటకు రెండుగున హల్లులమధ్య సంధి జరుగదు. ద్విరుక్తియందలి 'తాత'లోని ప్రథమాక్షరము 'తా' హల్లు. ఆమ్రేడితము నందలి 'అయ్యయ్య' రూపమును సంధి చేసియు, చేయకయు పొందును. వ్యసనమునకు ప్రార్థనార్థమున వాడుదు నవచ్చును.

'అయ్య' శబ్దమునకు ఓ (ఒ) చేరినపుడు అయ్యో (య్యొ) అని యగును. ఇది యామ్రేడింపబడినపుడు అయ్యో+అయ్యో>అయ్యయ్యో. వీని ద్విత్వా ద్విత రూపములకు వ్యవహారమున వాడుక గలదు. ఇవి అపవాద రూపములు.

అయ్యో=అయో: ఉదా:— కటిక నేల గండ్లు లొత్త నిద్రవోయెడు నయ్యొ (ఆది 6).

(2) అయ్యో (మను. 3—36).

(3) మీదన్ వియోగసాగర మీదం గలవా లతాంగి యేమగుదువయో (విజయ విలాసం 2–192)

ఇటులనే రె (రే); రొ (రో) లతోఁ గూడినపుడు 'అయ్యా' శబ్దమునకు అయ్యా+రే (రె)>అయ్యారే (రె); అయ్యా+రో (రొ)>అయ్యారో (రొ). హ్రస్వమగు 'అయ్య'తో గూడి

అయ్య రే (రె)>అయ్య రే (రె); అయ్య+రో (రొ)>అయ్య రో (రొ) అను రూపములను బొందును. ఇట్టి ద్విత్వరహిత రూపములును.

అయ్యరో (రొ) శబ్దమును తండ్రిని సంబోధించుటకు 'అమ్మరో' అని నట్లు ప్రయోగింప వచ్చును. ఏమైనను నిట్టి రూపము అరుదుగనె యుండును.

'అమ్మో, అయ్యో' అను రూపములు—వాని ఆమ్రేడిత రూపములు అమ్మమ్మో; అయ్యయ్యోలు నిత్య వ్యవహారములో నున్నవి.

ఉదా:—అయ్యారే! చెలువెక్కుడ! నయ్యారే గెలువఁ జాలు నంగన నాదిన్ (విజయ విలాసము—)

అయ్య రే (రె) = అయ్యా రే (రె). ఉదా: చంద్రికా పరిణయము (2–97)

తల్లి, తండ్రి సూచకములగు అమ్మ, అయ్య శబ్దములు రెండును సన్నికర్షములైనపుడు అమ్మ+అయ్య>అమ్మయ్య రూపమును బొంది కష్టమును గడచుటను సూచించును.

ఉదా:—అమ్మయ్య! ఈ వ్యవహార మిప్పటికిఁ దేలినది.

కాగా 'ఈ' 'అమ్మయ్య' రూపముపై 'ఓ' చేరి అమ్మయ్య+ఓ>అమ్మయ్యో అను రూపమును బొంది 'సంతాపము'ను ప్రకటించును.

ఉదా:—అమ్మయ్యో! అదేమి రూపే!

(3) అప్ప: కన్నడము అప్ప: తమిళము అప్పన్. ఈ శబ్దమునకు అమ్మ, అయ్య (తల్లి, తండ్రి) అక్క అను అర్థములు గలవు. 'అప్ప' యనునది రూపాంతరము.

తగడ: తల్లి, తండ్రి యను అర్థములకు

అప్ప యానతిఁ బూని కానల కరిగి
తొమ్ముల వెలుపు దీర్చి చుప్పనాకను
ముక్కు చెవులు సోరిదిఁ గోసి
(అచ్చతెనుగు రామాయణము—యుద్ధకాండ)

'అక్క' యనుటకు :

అప్పయుఁ బరిజనములు దప్పకఁ
దను కనుగొనుచుండగ (విరాటపర్వం 2-)

ఈ యర్థముననే భారత ప్రయోగములు గలవు.

'అప్ప శబ్దము ద్విరుక్తము నొందగా అప్ప + అప్ప> అప్పప్ప' యగును.

దీనికి 'ఆహోహా' యని గాని, 'ఔర' యని గాని అర్థము.

ప్రశంసకు, ఆశ్చర్యమునకు నీ రూప ముపయోగింపఁ బడును.

ప్రశంసకు :

అప్పప్ప! భవత్ప్రతాప విభవాఢ్యత
యేమని సన్నుతింపఁగన్
(సారంగధర చరిత్ర)

(2) ముప్పది మూడుకోటుల సమూర్తుల
వేల్పులనేలు వజ్ర యప్పప్ప
యనార్య శౌర్య కరుణాదుల పట్టున
(పంచతంత్రం—వేంకటకవి 3—340)

'తండ్రి' యనుటకు 'అప్ప' శబ్దము.

అప్ప! జగములు మూడును, విప్పారెడుకడిమి గెలిచి
వెలసిన నీవీ చొప్పన నొక కోతికినై,
తప్పక పలుమఱు గలంగఁడగవే చెప్పుమా
(అచ్చతెనుఁగు రామాయణము).

అప్ప! యప్పరిఁ జెప్పనొప్పదురు
రూపా జీవికా రత్నముల్
(రాజవాహన విజయము—కాకుమాను మూర్తి కవి)

సందర్భము తెలియని నిఘంటు ప్రయోగమగుటచే నిందలి 'అప్ప' కర్థము నిర్ధారింప వీలుపడలేదు)

(4) అబ్బ : సంస్కృతము : అంబః దీనికిని తండ్రియని అర్థము. దీని న్యామ్రేడింపఁగా అబ్బ + అబ్బ> అబ్బబ్బ. విసుగుదలను, ఆశ్చర్య ప్రశంసా సంతాపములను దెలియఁజేయును.

(a) విసుగుదల : అబ్బబ్బ! పదగదె గబ్బియంచు
నదల్చు తరళాక్షి క్రొవ్విరి దండఁగొట్టి
(రసికజన మనోభిరామము. 5-160)

(b) ఆశ్చర్యము : అబ్బబ్బ! యిదేమి
శౌర్యమని వాలాడన్
(పార్వతీ పరిణయము 2—175)

(c) ప్రశంస : అబ్బా! యెంతవాడివైతివి.

(d) సంతాపము : అబ్బబ్బ! నితాంతకంతు
విశిఖాగ్ని శిఖాపరితాపమారునే
(రసికజన మనోభిరామము)

'అబ్బ'యను శబ్దముపై 'కాఁడు' ప్రత్యయము చేర్చినచో 'అబ్బకాడు' అగును. అబ్బ + కాడు> అబ్బకాఁడు. మూఢుఁడు, అదృష్టహీనుఁడని అర్థము. దీనిని విశేషణముగా నుపయోగింతురు.

అని చిందరేగినట్లచ్చెనఁటి ధరామరుఁడు
వెంత చేపడిన నిధిన్
మునిఁగాలఁ దన్ని చనుగతి ఘనజఘన సన్
బాసి యబ్బ కాఁడుగఁ బోయెన్.
(పంచతంత్రము—వేంకటకవి 4 ఆ)

(5) అవ్వ: సంస్కృతము అంబా: కన్నడః అవ్వ. తమిళము : అవ్వై. ఈ శబ్దమునకు తల్లి. తల్లితల్లి; తండ్రితల్లి; పూజ్యురాలు అను అర్థములు గలవు. వృద్ధస్త్రీ, ప్రపితా మహాద్యర్థములను సూచించును.

(a) తల్లికి : అవ్వల నెఱుగక ముప్పుర,
కవ్వల వెలుగొందు పరము డర్భకుఁడై
(భాగవతము 10 పూ. 294)

బువ్వఁబెట్టు మవ్వాయనుచున్
(భాగవతము 10—303)

(b) తల్లితల్లి : తండ్రితల్లి యనుటకు:—

అవ్వయంచును ప్రేమ నివ్వటిల్లఁగఁ జేరి
మురిపెంపు మనుమఁడు ముద్దుగురియ
(దశావతార చరిత్రము. 3—49)

(c) పూజ్యస్త్రీ :

అవ్వ! నీవ వేల్పవగుదని
కొందఱు మొగిన కేలు మొగిచి మ్రొక్కిరంత
(భారతము. అరణ్య. 2—102)

(d) వృద్ధస్త్రీ :

అవ్వ విధంబున వంగి లేచుచున్
(వేంకటాచల మహాత్మ్యము—
తరిగొండ వెంకమాంబ. 5—4)

(e) ప్రపితామహి :

వుహ్వారు బోడివైనరి, యెవ్వారన
భీష్మ గాంచి యింపొందితి వీ
వవ్వాని యెఱుగుదువె మా యవ్వా!
పోషింపం బాడి యగునను నీకున్
(విజయ విలాసము. 1—116)

అవ్వ శబ్దమునకు ఆమ్రేడిత రూపము.

అవ్వ+అవ్వ> అవ్వవ్వ.

అవ్వవ్వ! ఎంత దుర్మార్గప్పని చేసినాడు!

(6) అన్న : పెద్ద సోదరుఁడు : జ్యేష్ఠుఁడు. తమిళము. అణ్ణాన్; కన్నడ, మళయాళములు: అణ్ణ; తుళు : అణ్ణె. ఆశ్చర్య ప్రశంసా సంతాపములను దెలుపును. దీని యామ్రేడిత రూపము అన్న+అన్న> అన్నన్న.

జ్యేష్ఠుఁడు : విూ యన్నను నన్నుఁ జూడుము (ఆది 6—202)

ప్రశంసకు : అన్నన్నా
నే డన్నన్నా : నలకూబరుండె
ప్రబలుం డనుచున్
(ఉత్తర రామాయణము)

అన్నన్న : ప్రశంసకు.

అన్నన్న! మొగము వెన్నుని యన్నన్న
జయించు కన్ను లన్నన్న వినాసన్నములు
నడుము మిక్కిలి సన్నము మాటలు
సుధా ప్రసన్నము లెన్నన్
(విజయ విలాసము 1—83)

ఆశ్చర్యము :

అన్నాతియు నొడయఁడు నటు
లున్నారని నీవు కోన కరుదెంచిన
చో నన్నాయన్నడి కనాయన్నా సాకు
కొనఁ జాలినట్టిదె చెప్పవూ!
(అచ్చ తెనుఁగు రామాయణము—
ఆరణ్య కాండము. నాడీకదేశము)

సంతాపమునకు :

కన్నుల బాష్పములు రలఁగ
నన్నరవరుఁ జేర నరిగి యతి దైన్య
ముతో నన్నన్న ఆకలయ్యెడి నన్నము
నా కిపుడు పెట్టుమని యడుగుటయున్
(మార్కండేయ పురాణము. 1—203)

(7) అక్క : సంస్కృతము. అక్కా=అమ్మ; అర్కా=జ్యేష్ఠ భగిని.

ప్రాకృతము : కన్నడము. అక్క : తమిళము—అక్కాళ్.

'అవ్వ' శబ్దమును 'అక్క' అను అర్థమునఁ బ్రయోగింపఁబడుచున్నది.

'అక్క' శబ్దము వ్యస్తముగను బ్రయోగింపబడి ఆశ్చర్యార్థమును బ్రకటించును. 'అక్క' శబ్దమునకుఁ బూజ్యస్త్రీయను అర్థమును గలదు.

వండలేనక్కకు వగపులు మెండు;
తేనేర నన్నకుఁ దిండిమెండు
(వేణుగోపాల శతకము 17)

పూజ్యస్త్రీ:

అంతఃపుర దాసియౌదాసీన్య
గర్భంబై వైదర్భి తలంపెటింగి వేజూ
క్కదెసఁజూపి యక్క
యిటుగనుంగొనుము
(నైషధము 5—127)

అవ్వ=అక్క :

అప్పుడు కుంభకుఁ డెదురుగా నరుగుదెంచి
యక్కకును బావకును మ్రొక్కి
(నీలాసుందరీ పరిణయము 53)

ఆశ్చర్యమునకు :

మెల్లనె కళావతీ సతిమేలుకాంచి
ప్రక్కవేఱొక్క మగఁడున్న

అంతేగాక 'చెల్ల'పై 'పో' ర్గా, రే లు ను చేరి ప్రశంసాశ్చర్య సంతాపార్థములు తెలుపునట్లుగఁ గవులు ప్రయోగించిరి.

(సూ. రా. వి. 3 rd Volume. చ—త్ర. పుటలు 274—275)

అటులనే సి. పి. బ్రౌన్ దొర గారు తమ ఆంధ్రాంగ్ల నిఘంటువున 'చెల్ల' శబ్దముకడ నీ విధముగ వ్రాసిరి. (Page 389)

చెల్ల లేక చెలా ! Alas! It is all over, he is dead; It is past.

చెల్ల : The herb asparagus race mosus Heyne - కాలసేయ వృక్షము. (ఇది ప్రస్తుత మవసరము గాదు)

కావున అమ్మచెల్ల : అమ్మకచెల్ల శబ్దముల విభాగములో కడపటి శబ్దము 'చెల్ల'యే గాని చెల్లెలు కాదు.

చెల్ల : సంతాపమునకు (అయ్యో)

చెల్ల : పనులకుఁ బోవలెఁ జేల విడువు :
అతడు రావేళ యయ్యో నటంచుఁ బెనఁగ
(దశావతార చరిత్ర 7—144)

ఆశ్చర్యమునకు : దగడ :

వెల్లియై తొరగె గురివెందల మరందములు
చెల్ల విరుల నెగనిరి చెలులు
(ఉత్తర రామాయణము. 6—61)

'అమ్మచెల్ల'కు అమ్మనేఁ జెల్లగా; అమ్మ చెల్లగా అనునవి రూపాంతరములుగాఁ బేర్కొన వచ్చును. పరిహాసమునకు, ఆక్షేపమునకుఁ గూడ నుపయోగించిరి శబ్దములను.

అమ్మచెల్లగా (అమ్మ+చెల్ల+కా)
కనుగొని మౌనికాంతలు కకావికలై
మదినమ్మ చెల్లగా ననుచు
(కువలయాశ్వ చరిత్ర 2—31)

అమ్మనేఁ జెల్లఁగా (alas! ah! Oho!)

పరిహాసమునకు (Joking : Satire)

అబలలము మూడు మాటల
కాలు తప్పు లమ్మనేఁ జెల్లగాఁ
బరిహాసకంబు చేసె దీవిట్టి
పనులు మాచేత నౌనె
(దశావతార చరిత్ర 2—330)

ఆక్షేపమునకు :(Censure, Blame)

ఇట్టి విూ వారి నడతలు గట్టిపెట్టి
యమ్మనేఁ జెల్ల న్యాయంబు లాదె దొర
(శశాంక విజయము. 3-81)

కాఁగాఁ బై శబ్దముల కన్నిటికిని ప్రాతిపదిక 'అమ్మయే'.

గారు : An honorific title of Women. It is often added to proper names as Sitamma garu.(Sita+amma+garu). 'amma' is also an honorific title of women and it is often added to proper names as Sita+amma> Sitamma.

Similarly 'ayya' also.

(b) An honorific plural affix to singular nouns as 'dora' dora+garu> doragaru. tandrigaru - tandri+ garu. My honoured father.

The honorific words 'amma' ayya admit of an additional Plural suffix 'garu' as Sita+amma+garu etc.

(C. P. Brown. Dic. P. 59)

గౌరవ వాచకములైన 'వారు' 'గారు' చేరిన అయ్య, అమ్మ శబ్దములు ఆమ్రేడింపఁబడినపుడు సంధి నిత్యముగా జరుగును. ఇట్టి రూపములు ఆధుని కాంధ్రమునందే కనఁబడును. వీని ఆమ్రేడిత రూపములు వ్యవధానము కలిగియు, లేకయు సంబోధనమున, ప్రార్థనార్థమున వాడుకొన వచ్చును. ఇట్టి ఆమ్రేడితములు 'వక్త' ఆందోళనాది స్థితులను వ్యక్తము చేయును.

'అమ్మ' పై 'వారు' చేరగా 'దేవత' యర్థము ను 'గారు' చేరినపుడు పూజ్యురాలను అర్థమును నిచ్చును. అటులనే 'అయ్య' పై వారు చేరగా 'గురువు'ను 'గారు' చేరినచో పూజ్యుడను అర్థమును నిచ్చును. అయగారు, అమగారు అను ద్విత్వరహిత రూపములును గలవు.

దండముపెట్టి సేమమె కదా!
యని మే పరియయ్యా వారికెం
దుం డిపుడెందుఁ బోయెదరో
(ఉత్తర రామాయణము)

అరయవేల్పులకెల్ల నయగారనం బగు నుడుగు
తేనికిఁ గూర్మి కొడుకుఁ గుఱ్ఱ
(యయాతి చరిత్ర)

(c) అయవార్లై చరియింపవచ్చుఁ దన పాదాంభోజ
తీర్థంబులన్ దయతోఁ గొమ్మనవచ్చు.
(కాళహస్తి శతకము. 73)

ఇటులనే అమ్మగారు; అమ్మవారు శబ్దములును.

ఈ రీతిని తెలుగు బాసలో సంబంధార్థక సంజ్ఞా వాచకములు ఆశ్చర్యార్థకములను వ్యక్తము చేయుచున్నవి.

(ఇందలి ఉదాహరణము లన్నియు శబ్ద రత్నాకర, సూర్యరాయాంధ్ర నిఘంటువులనుండి సంగ్రహింపఁ బడినవి.)

శ్రీ అయ్యగారి నరసింహ మూర్తి.



# గ్రంథ విమర్శలు

## చిత్తూరుజిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘంవారి రెండు ప్రచురణలు

### (1) సమాజము సాహిత్యము

(వ్యాససంపుటి. రచన: శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం, క్రౌను సైజు 8+4+183 పుటలు. వెల. పాపులర్ ఎడిషను రు. 4—00. లైబ్రరీ ఎడిషను రు. 6—00. ప్రతులకు—చి. జి. ర. స. ప్రచురణ సంఘం, చిత్తూరు.)

దీనిని రచించిన సుదర్శనంగారు పాశ్చాత్య విద్యా నిష్ణాతులు. తత్త్వశాస్త్రంపైనీ, ఆంగ్లాంధ్ర సాహిత్యాలపైనీ ఎక్కువ అభిమానం గలవారు. చాలా గ్రంథాలను రచించి ప్రకటించి ఉత్తమనవలా రచయితలుగానూ, కథకులుగానూ విమర్శకులుగానూ పేరు తెచ్చుకున్న వారు. అయన రచించిన విశిష్ట విమర్శన గ్రంథం యిది. ఇందులో సమాజము—సాహిత్యము, నవలా విమర్శనము, సాహిత్య విమర్శ స్వరూపము' అనే మూడు శీర్షిక లున్నాయి. మొదటి శీర్షికలో ఉన్న నాలుగు వ్యాసాలలో మొదటిది తెలుగు సాహిత్యంలో సామాజిక చైతన్యాన్ని గురించి నది ఇది వ్యాసాలన్నిట్లోకీ పెద్దది. సామాజిక చైతన్యానికి సాహిత్యం ఎలా సాధనమైనదీ, ఏ విధంగా పనిచేసినదీ ఇందులో విపులంగా వివరించబడినది. 'సమాజంలో నడిచే ఉద్యమాలకూ, సాహిత్యానికీ గల సంబంధం మనిషిచేతనలో తెలిసిన భాగానికీ, తెలియని భాగానికీ ఉన్నటువంటి సంబంధమే! ఈ రెండింటి మధ్యా యిచ్చి పుచ్చుకోవడమూ, సామరస్యమూ ఉన్నప్పుడే స్పష్టత. ఒకటి రెండవ దానిమీద దాడి చేసినా, ఒకదానికి రెండవదానికి మధ్య ప్రతిష్టంభన ఏర్పడినా అది అస్పష్టత లక్షణం' అని వ్యాసం చివర సంగ్రహంగా తెలుప బడింది. తెలుగు సమాజం కాల్పనిక వాదంవల్ల ఎలా ప్రభావితమైనదీ వివరించేది రెండవ వ్యాసం. ఇందులో ఆంగ కవుల కవిత తెలుగు రచయితలపై ఎలా పనిచేసినదీ, కాల్పనికత ఎవరి రచనలలో కానవస్తున్నదీ నివరించబడింది. 'విప్లవము—సాహిత్యము' అనే మూడవ వ్యాసంలో తిరుగుబాటుకూ, విప్లవానికీ ఉండే వ్యత్యాసం, మార్క్సిజానికీ, నవ్య కవిత్వానికీ గల సంబంధం, విప్లవ కవిత్వం ఉండవలసిన పద్ధతి సప్రమాణంగా వివరింపబడ్డాయి. 'మానవత్వము, ఆధునికత' అనే నాల్గవ వ్యాసం చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థ కామ మోక్షాల ననుసరించి ధార్మిక మానవుడు, ఆర్థిక మానవుడు, శృంగార మానవుడు, ఆధ్యాత్మిక మానవుడు అనే మానవ విభేదాలను నవ్యతా సమన్వయ దృష్టితో వివరిస్తున్నది.

'నవలా విమర్శన' శీర్షికలో సాహిత్య ప్రక్రియగా నవలకు ఉండే స్థానం, వ్యక్తుల జీవితాలు ఆధారంగా నవలల్లో పరిణామం కలుగుతున్న విధం, పాత్ర చిత్రణ, అధీరనాయకుని స్వభావం, అతనికి యిప్పటి నవలల్లో ఉన్న స్థానం కొన్ని నవలలు ఆధారంగా చేసుకుని చర్చించబడినవి. కథాసంవిధానం, పాత్రోన్మీలనం నవలకూ, కథకూ ముఖ్యాలని వ్యాస కర్త ఆశయం సముచితమైనది: కాని కొన్నిచోట్ల కథా సంవిధాన వైచిత్రి లేకపోయినా సంభాషణ చమత్కృతి పాఠకులను ఆకర్షించడం ఉన్నది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి రచనలు ఇందుకు తార్కాణం. ఈ శీర్షికలోని చివరి వ్యాసాల్లో మనోవైజ్ఞానిక నవలలైన 'చివరకు మిగిలేది, అల్పజీవి' అనే వాటి యొక్కయూ, గాంధీ దృక్పథం ప్రధానంగా రచించబడిన 'మాలపల్లి'యొక్కయు విశిష్టత వివరించబడింది. నవలా విమర్శన శీర్షికలో వ్యాస కర్త ఆ యా సందర్భాలలో సుప్రసిద్ధ నవలలోని లోపాలనూ, అనౌ

చిత్యాలనూ వివరించారు. నవలను చదివి ఆనందించే వారికి అవి తెలియకపోవచ్చు. సామాన్య పాఠకుడికి నవల హృదయాన్ని ఆకర్షిస్తున్నదా, లేదా అనే దృష్టి కాని దాని లక్షణాలపైని దృష్టి ఉండదు. సాహిత్య ప్రక్రియలో కవితకు ఉన్న స్థానం వేరు. నవలకు ఉన్న స్థానం వేరు. నవలా రచన పేలికగా ఉండవలసినదే.

సాహిత్య విమర్శ స్వరూపాన్ని చర్చిస్తూ రచయిత చివరకు 'సాహిత్య విమర్శ స్వభావము కావ్యార్థ ప్రకాశము; దాని స్వరూపము సత్యాన్వేషణము' అని తెలియజేయడం ఎంతో ఉచితంగా ఉన్నది. ఈ పద్ధతిలో జరిగిన విమర్శ ఉత్తమశ్రేణికి చెందక తప్పదు.

శ్రీ సుదర్శనం గారు పాశ్చాత్య విద్యావేత్త. ఆధునిక పద్ధతులపైని ఎక్కువ ఆదరం ఉన్నవారు. వారి పరిశీలన కూడా పాశ్చాత్య విమర్శ పద్ధతిలోనే జరిగింది. పారిభాషికాలయిన కొన్ని పదాలను వివరించే టప్పుడు పాఠకులకు సులభంగా గ్రహించడానికి వీలుండే టందుకు వాటి ప్రక్కనే ఆంగ్లపదాలూ వ్రాయబడి ఉన్నవి. కాల్పనికత, స్వస్థత, ప్రతిష్టంభన, హేతు వాదం, జాగరితం, వ్యక్తి చైతన్యం మున్నగు పదాల అభిప్రాయం సామాన్య పాఠకులకు తెలియదు. వీరి విమర్శనలు చాలా విలువైనవే. రచయిత తత్త్వశాస్త్రంలో సమర్థులైనందున తాత్త్వికదృష్టిని సాహిత్య విమర్శతో మేళవించి దీన్ని వ్రాసినట్లు తెలుస్తుంది. పాశ్చాత్య సంప్రదాయాన్ననుసరించి ఉత్తమశ్రేణికి చెందిన సాహిత్యవేత్తలకు మాత్రమే ఇందలి విషయం సులభంగా అవగాహన కాగలదు.

## (౨) ఈ రేడు లోకాలు

(కథా సంకలనం. క్రౌనుసైజు 12+231. పాపులర్ ఎడిషన్ వెల రు 5. లైబ్రరీ ఎడిషన్ వెల రు 7. ప్రతులకు—చి. జి. ర. స. ప్రచురణ సంఘం, చిత్తూరు.)

విభిన్నాలయిన లోకాలు పద్నాలుగు, అలాగే విభిన్న కథకులు చెప్పిన పద్నాలుగు కథల సంకలనం యీ 'ఈ రేడు లోకాలు.' ఈ కథలు రచించిన వారిలో ప్రసిద్ధులూ ఉన్నారు, కొత్తవారూ ఉన్నారు; తమ చిత్తూరు జిల్లాకు చెందిన వర్ధమాన రచయిత లను ప్రోత్సహించడమే. ఈ ప్రచురణ ప్రధానోద్దేశ మని సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులూ, బహుగ్రంథ కర్తలూ అయిన ఆర్. ఎస్. సుదర్శనంగారు తమ 'పరిచయం'లో తెలుపుతున్నారు.

ఇందులోని కథలను గురించి చెపుతూ ఆయన 'ఈ కథల్లో వైవిధ్యం ఉన్నది. ఇవి 'అమ్మాయి-అబ్బాయి' కథలు కావు. నిత్యజీవితాన్నీ, జీవితంలో విషాదాన్నీ ప్రతిబింబించే (ప్రతిబింబింపజేసే?) కథలు. నేడు వీస్తున్నగాలికి తగినట్లే ఆర్థిక వ్యవస్థలోని హెచ్చు తగ్గుల్నీ, సమాజంలోని దురన్యాయాన్నీ, వింత ధోరణుల్నీ విపరీత పరిణామాల్నీ ఈ కథలు వ్యక్తిపరంగనూ, సన్నివేశపరంగానూ చిత్రిస్తున్నాయి' అని మొత్తంమీద కథలన్నిటిని గురించీ తమ అభిప్రాయాన్ని వెల్లడిస్తూ ఆయా కథల వైశిష్ట్యాన్ని కూడా వెల్లడించారు.

'అస్తిత్వ వాద ధోరణిలో, చైతన్య స్రవంతి పద్ధతిలో వ్యక్తిత్వం రూపుకట్టని మానవుణ్ణి (Faceless man), అధీరుడైన నేటి సామాజికుణ్ణి వర్ణించడం ఉన్నది. 'తివాసీ, రామదాసుచెర, న్యాయం, ఎవరీ మనిషి' వైరీతుల్లో ఎన్నదగిన కథలు. 'సుడిగాలి, కుక్క చచ్చింది—కోడికూసింది' అనే కథల్లో ప్రత్యేకంగా చిత్తూరుజిల్లా ప్రాదేశిక వాసనలూ, పలుకుబళ్లూ కథల్లో వస్తువైన సామాజికతకు మరింత వన్నె తెచ్చేలా వున్నాయి. రాజకీయాలు గ్రామీణ జీవితంలో తెచ్చిన సరికొత్త పరిణామాన్ని నిశితంగా పరిశీలించే కథలు 'రాణి సాహేబా రంగయ్యమ్మారావు, గాయపడిన దేవత?. 'స్త్రీల సమస్యలకు ప్రాధాన్యం యిచ్చిన కథలు 'పునాదిరాయి, దుఃఖభాగుడు, హాలాహలంలో అమృతభాండం' ఇందులో వివాహవ్యవస్థ, కుటుంబ వ్యవస్థ చర్చకు వచ్చాయి. రచయితలు ఊహాపథంలో విహరిస్తూ కాక, తమకు తెలిసిన వాస్తవికతనే చిత్రించే ప్రయత్నం చేశారీ కథల్లో. 'అరిటాకు'లోని సంఘటన కొంత విడ్డూరంగా కనిపించవచ్చు. కాని అ సహజం కాదు. వ్యక్తుల్లో ఒక్కోసారి అలాంటి ఆవేశాలు ప్రకోపిస్తూనే ఉంటాయి - ముఖ్యంగా బడిపంతుళ్లల్లో. 'జీవన

మాధుర్యం' కథాకథనంలో వాచ్యంగా చెప్పిన దానికంటె పాఠకుల ఊహకూ, అవగాహనకూ రచయిత వదలిపెట్టిన అంశమే ఎక్కువ. అదే కథలో ప్రధానాంశం కూడా. 'అరచేతిలో గీత' కథలో భానుకు డైన యువకుడు స్వప్నానికీ యాథార్థ్యానికీ మధ్య చిక్కి, అటూ యిటూ దరిగానక పడే అవస్థ విస్తృతంగా విశిష్టంగా చిత్రింపబడింది' అని సుదర్శనం గారు ప్రతీ కథలోని విషయాన్నీ సంగ్రహంగానూ, చక్కగానూ చూపారు.

ఇందులో సుప్రసిద్ధుల కథలతోపాటు అప్రసిద్ధుల కథలూ చాలావరకూ బాగున్నాయి. కొన్ని కథల్లో కొన్నిచోట్ల అస్వాభావికతా, కథా చిత్రణంలో ఏదో కొంత లోపం ఉన్నట్లు తోస్తుంది.

అత్యున్నతోద్యోగి తన ఆఫీసులో అతి తక్కువ గుమస్తాతో ఎంతో స్నేహంగా ఉండడం, కలిసి తిరుగుతూ ఉండడం సహజంగా లేదు. మగవాళ్ల కిది సహజమైనా ఆయన భార్య గుమస్తా భార్యను గౌరవంతో చూడడం, తమ భవనానికి ఆహ్వానించడం అసహజం. గుమస్తా భార్య సీత చెప్పులు విడిచి భవనంలో ప్రవేశిస్తూ కాళ్లు తుడుచుకునే ముదురు నీలంరంగు తివాసీపై కాళ్లు తుడుచుకుంటే దానిపైని ఆమెకాలి మరక స్పష్టంగా కానబడడం అస్వాభావికం. ఇది 'తివాసీ' కథలోని సంఘటనం 'దుఃఖ బాగుడు' కథలో జీరయ్యపంతుల క్రౌర్యమూ, 'అరిటాకు'లో తాను ఎంతో అభిమానంగా చూచుకుంటున్న శిష్యుణ్ణి—ఆ శిష్యుడు పెంచిన అరిటిచెట్టు ఆకును కోసినందున అంధుణ్ణి చేసిన శంకరం విపరీత ప్రవృత్తీ విచ్చిట్టుగానే కానవస్తాయి. ఇలాగే మరికొన్ని కథల్లో కూడా. ఇందులో 'రామదాసు చెర, సుడిగాలి, కుక్క చచ్చింది—కోడికూసింది'వంటివి ఉత్తమ కథలు. కథలన్నీ పాఠకులను ఆకర్షించేవే.

జిల్లా స్థాయిలో తమ ప్రాంతం రచయితలను ప్రోత్సహించడానికి మొదలుపెట్టి చిత్తూరు వారు ఇతరులకు మార్గదర్శకులైనారు. కేవలం వార్షిక సభలతోను, సంచికా ప్రకటనలతోనూ తృప్తిపడకుండా రచయితల సహకార ప్రచురణ సంఘాన్ని స్థాపించడం మిక్కిలి సరియైన పద్ధతి. ధనార్జన ప్రధానంగా పెట్టుకుని ఆశ్రయించిన వారి రచనలనే ప్రకటిస్తూ. ఇతర రచయితలను తమ వెంట తిరిగేటట్లు చేస్తూ నిరుత్సాహపరిచే ప్రకాశకులకంటె ఇట్టి సంఘాలే సరియైన వాఙ్మయసేవ చెయ్యగలవు; రచయితలకు మంచి ప్రోత్సాహాన్ని ఇయ్యగలవు. చిత్తూరు జిల్లా రచయితలు ఈ విషయంలో విజయం సాధించ గలరనే నా నమ్మకం. ఈ సంఘానికి అధ్యక్షులు శ్రీ రాజగోపాలనాయుడు గారూ, ఉపాధ్యక్షులు శ్రీ సభా గారూ పేరుపడిన రచయితలు! వారి పర్యవేక్షణలో వెలువడే రచనలు ఆకృతిలోనే కాకుండా ఆంతరంగికంగా కూడా ఉత్తమరీతిని వెలువడగలవని ఆశిస్తున్నాను.

## మీరాబాయి

(ఆంగ్లమూలం. శ్రీమతి ఉషా యస్. నిల్సన్. ఆంధ్రీకరణ. డాక్టర్ సి. నారాయణరెడ్డి, డెమ్మీ 68 పుటలు. వెల రూ. 2–50. ప్రకాశకులు—సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ 1, ప్రాంతీయ కార్యాలయములు, మద్రాసు 9, కలకత్తా, బొంబాయి.)

కేంద్ర సాహిత్య అకాడెమీవారు భారతీయ భాషలలోని సాహిత్య కార్యక్రమాలను ప్రోత్సహించి సమన్వయపరచేందుకూ, ఒక భారతీయ భాషలోని ఉత్తమ సారస్వతాన్ని అనువాద రూపంలో ఇతర భాషలవారికి అందించేందుకూ పూనుకొని, కొన్ని గ్రంథాలను తెలుగులోకి అనువదింప జేసి, ప్రకటిస్తున్నారు. అలాటి గ్రంథాలలో ఈ 'మీరాబాయి' ఒకటి.

ఈ గ్రంథాన్ని అంగ్లంలో డాక్టర్ శ్రీమతి ఉషా నిల్సన్‌గారు రచించారు. ఆమె హిందీలో ఎన్నో కథానికలు, నవలలు రచించి పేరుప్రతిష్ఠలు సంపాదించారు. ఆంగ్లంలో నిష్ణాతులు. అట్టి విద్యావేత్తల రచనను సమర్థులైన డాక్టర్ నారాయణరెడ్డి గారు తెలిగించడం ఎంతో ఉచితంగా ఉన్నది.

మహాభక్తురాలైన మీరాబాయి రాజస్థాన్‌లోని ప్రభువులైన రాణాల కుటుంబానికి చెందినది. ఎండ

కన్ను ఎరుగకుండా అంతఃపురంలో ఘోషాలో ఉండ వలసిన యువతీమణి. గొప్ప సౌందర్యవతి. ఉత్తమ మైన శీలం కలది. తాను రాజసౌధాన్ని విడిచి జన సామాన్యంలో సంచరిస్తే అపవాదాలకు పాలుకావలసి వస్తుందని ఆమెకు తెలుసును. అయినా, అపవాద భీతిని విడిచిపెట్టి, సాంసారిక బంధాలను త్రెంచు కొని ఆ గాయకయోగిని తన జీవితాన్ని కృష్ణుణ్ణి స్తుతించడానికీ, కృష్ణభక్తిని ప్రచారం చెయ్యడానికి ధారపోసింది. సహజకవితాధురీణురాలైన ఆమె రచించిన గేయాలు ఎందరో గాయకులను ఆకర్షించాయి.

మీరాబాయి జీవితాన్ని గురించీ, గేయాలను గురించీ అభిప్రాయభేదా లున్నాయి. Annals and Antiquities of Rajasthan అనే బృహద్గ్రంథాన్ని రచించిన టాడ్ దొర ఈమె కుంభరాణా భార్య అని వ్రాశాడు. మీరాబాయి తాత దూదాజీకి కుంభరాణా సమకాలికుడనీ, అతడు 1467 లో మరణించాడనీ, మీరాబాయి 1498 లో జన్మించినదనీ, ఈమెకు 1516 లో సంగరాణా జ్యేష్ఠ పుత్రుడైన భోజ రాజుతో వివాహం జరిగిందనీ శ్రీ హరివిలాస్ శారదా, శ్రీ గౌరీశంకర్ హీరాచంద్ర ఓఝా మున్నగు సుప్రసిద్ధ చరిత్రకారులు నిర్ణయించారు. ఈ కాల నిర్ణయాన్నే సర్వసాధారణంగా అందరూ అంగీకరిస్తున్నారు. ఈ విషయం అవతారికలో చక్కగా వివరించబడినది.

మీరాబాయిని గురించిన కట్టుకథ లెన్నో ఉన్నవి. అవన్నీ విశ్వసనీయాలు కాకపోయినా, ఆమె భక్తి మాహాత్మ్యాన్ని తెలిపిన కొన్ని మాత్రం వాస్తవాలని ఆమె రచించిన గేయాలవల్లనే తెలుస్తున్నది. భర్త మరణించాక—ఆమె బావగారైన రతన్‌సింగు ఈమెను తుదముట్టించడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, అవన్నీ వ్యర్థమైనాయి.

పల్లవి. హరిగుణ గణముల గానము చేసి
పరవశించినది మీరా.

చరణం 1. సర్ప పేటికను రాణా పంపగ
చల్లగ మీరా గ్రహియించె.
స్నానమాడి ఆ పేటిక విప్పగ
సాలగ్రామమె అగుపించె.

చరణం 2. విషపాత్రను రాణా పంపగ అది
విమలామృతమై విలసించె.
ఆ విషమును తా నారగించగా
అమృత రూపమే సిద్ధించె.

చరణం 3. శూలశయ్యపై పవళింపగ ఆ
సుదతిని రాణా శాసించె.
శూలశయ్యపై మీరా చేరగ
పూలశయ్యగా భాసించె.

చరణం 4. ఆశ్రితావనుడు మీరా ప్రభువే
అంతరాయముల తొలగించె.
మేఘ సుందరుని గానము లోనే
మీరా నిరతము పులకించె.

[14—వ గేయం]

మీరాబాయి కృతులను గురించి కూడా అభిప్రాయభేదా లున్నవి. గీతగోవింద్‌కీ టీకా, నర్సీజీరో మాహెరో, పదావళి మున్నగునవి ఆమె రచనలని ప్రసిద్ధి. గీతగోవిందానికి ఆమె టీక వ్రాయలేదని విమర్శకుల అభిప్రాయం. ఆమె పేరిట చెలామణి అవుతున్న గేయాలు చాలా ఉన్నవి. వాటిలో సుప్రసిద్ధాలైన 50 గేయాలు మాత్రం యిందులో చేర్చబడినవి.

రసధునులైన మీరాబాయి గేయాలను గేయ రూపంగా తెలిగించడం సులభమైన పని కాదు. అది గేయ రచనలో సిద్ధహస్తులైన శ్రీ నారాయణ రెడ్డి గారివంటి వారికే తగును. ఆయన ఎంతో మధురంగా వాటిని అనువదించారు. అనువాదానికి తగిన వారిని ఎన్నుకొన్న సాహిత్య అకాడెమీవారు ఈ విషయంలో అభినందనీయులు. అనువాద మాధుర్యాన్ని తెలుపుటకు ఇందులో ఉదాహరించిన 14—వ గేయం చాలును.

ఈ పుస్తకంలో 33 పుటలు అవతారికయే ఆక్రమించింది. మూలాన్ని రచించిన శ్రీమతి ఉషా

నిల్సన్ ఆంగ్లంలోనూ, హిందీలోనూ ఉన్న 25 ప్రామాణిక గ్రంథాలను ఆధారం చేసుకుని ఇందులో చాలా విషయాలను వివరించారు. మీరాబాయి జీవితం, ఆమెకు సంబంధించిన కట్టుకథలు, ఆమె భక్తి భావన, గీతాలు, నాటి ఛందోరూపం, ఆమె గీతాలలోని భాషా స్వరూపం అనే శీర్షికలలో వాటివాటికి చెందిన విషయాలు వివరింపబడినవి. మీరాబాయి కవితనూ, భక్తి భావాన్నీ గురించి తెలుసుకొనుటకు ఈ అవతారిక ఎంతో ఉపకరిస్తుంది.

శ్రీ నారాయణరెడ్డిగారు 'నా అనువాదాన్ని గూర్చి నాలుగు మాటలు' అంటూ దీన్ని తెలిగించడంలో వారు అనుసరించిన పద్ధతినీ, పడిన శ్రమనూ తెలియజేశారు. అనువాదం అనువాదమని అనిపించుకోకుండా స్వతంత్ర గానే కానవస్తున్నది. కాని, ఆంగ్లమూలంలోని కొన్ని పేరు తెలుగులో మారిపోయాయా? అనే సందేహం కలుగుతున్నది. Harivilas Sarda-హరి విలాస్ శారదాగా ప్రసిద్ధులు. అనువాదంలో 'శారదా'కు బదులు 'సర్దా' అని ఉన్నది. అలాగే—Maharana Sanga మహారాణా సంగ—లేక సంగరాణాగా ప్రసిద్ధుడు. అనువాదంలో 'సాంగా' అని ఉన్నది. విశేష్య పదాల్ని ఆంగ్లంనుండి అనువదించేటప్పుడు ఇలాటివి సంభవిస్తాయి. ఇవి పొరపాట్లలో చేరకపోవచ్చు.

మహాభక్తురాలయిన మీరాబాయిని గురించీ, ఆమె గేయాలను గురించీ తెలుగువారందరూ తెలుసుకొనుటకు అనుకూలంగా ఈ గ్రంథాన్ని ప్రకటించిన సాహిత్య అకాడెమీవారూ, చక్కగా అనువదించిన డాక్టర్ నారాయణరెడ్డిగారూ అభినందనీయులు.

## ప్రబంధ మణిభూషణము

(పూర్వకవి సంచితము)

(సంపాదకులు : విద్యారత్న శ్రీ నిడుదవోలు—వేంకటరావు, డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు. డెమ్మీ- 93+12+148 పుటలు. వెల రూ 5/— ప్రకాశకులు—ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవనం, హైదరాబాదు—4.)

ఇది సంకలన గ్రంథాల్లో నాల్గవదయినా, తక్కినవాటికంటె విలక్షణమైనది. సంకలన గ్రంథాల్లో వివిధ విషయాలను గురించిన పద్యాలు ఇతర గ్రంథాల నుండి సేకరింపబడి ఒక గ్రంథంగా రూపొందించబడతాయి. ఇందులో ఇతర గ్రంథాలనుంచి గ్రహించబడిన పద్యాలు ఒక కథారూపంగా తీర్చి దిద్దబడినవి.

'ఉజ్జయినీ నాథుఁడగు సుకీర్తి యను భూపతికి కుమారుఁడగు రాజశేఖరుఁడను రాజు పాండ్య భూపతి పుత్రి యైన రత్నసుందరిచే స్వయంవరమున వరింపఁబడుట యను నితివృత్తమును తీసికొని పూర్వకవుల పద్యములను సమయానుగుణ్యముగా నా యా సందర్భములలో సంధానించి యీ సంకలనము' సమకూర్చబడినది. పద్యములన్నీ సిద్ధహస్తులైన కవుల గ్రంథములనుండి స్వీకరించబడినవే! సమన్వయం కుదరడానికి అక్కడక్కడ చిన్న చిన్న వచనాలను మాత్రం సంధానకర్త చేర్చాడు.

సంకలనగ్రంథం అనిచెప్పకపోతే ఇది ఒక ప్రబంధమనే భ్రాంతి కలుగుతుంది. వివిధ ప్రబంధాలలోని మణులవంటి పద్యాలను ఒక భూషణంగా కూర్చి వాగ్దేవికి సమర్పించ బట్టే దీనికి 'ప్రబంధమణి భూషణ'నామం సార్థకమైనట్లు తోస్తున్నది.

ఈ గ్రంథాన్ని కీ. శే. మానవల్లి—రామకృష్ణ కవిగారి పీఠికానుబంధాలతోకూడా వనపర్తి సంస్థానాధీశులు శ్రీ రాజా రామేశ్వరరావు బహద్దరు వారు 1910 లో ముద్రింపించారు. ఆ ప్రతులు చాలా కాలంనుంచీ అలభ్యంగా ఉన్నవి. అందువల్ల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు సమర్థులైన యిరువురు విద్వాంసుల సంపాదకత్వాన దీన్ని ప్రకటించి ఆంధ్రసాహిత్య లోకానికి ఎనలేని సేవ చేశారు. మూలగ్రంథానికి శ్రీ వేంకటరావుగారి విపుల పీఠిక ఒక భూషణంగా—ప్రబంధమణి భూషణ భూషణంగా ఉన్నది.

దీని సంకలనకర్త యెవరో తెలియలేదనీ, అతడు తన పేరు చెప్పుకోలేదు. సరికదా, పద్యాలు

ఏ గ్రంథాల్లోంచి గ్రహించినదీకూడా తెలుపలేదు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన 'ప్రబంధ రత్నావళి' పీఠికనుబట్టి దీనిని పొన్నాడ పెద్దిరాజు కూర్చినట్లు తెలుస్తున్నది. ఏయే గ్రంథాల నుండి ఏయే పద్యాలు గ్రహింపబడినదీ వాటి సంఖ్యల తోనూ, పాఠాంతరాలతోనూ కూడా శ్రీ వేంకటరావు గారు తమ విపుల పీఠికలో వివరంగా చూపి యున్నారు.

ఈ గ్రంథంలో ఉదాహృతములైన ప్రబంధా లలో ప్రాబ్నన్నయ యుగానికి సంబంధించిన ఆది పురాణం మొదలుకొని దక్షిణాంధ్రయుగంలోని విజయవిలాసం వరకూ 50 వరకూ లభ్యములూ, అలభ్య ములూ, లభ్యములలో ముద్రితాలూ, అముద్రితాలూ కూడా ఉన్నవి. ఆయా ప్రబంధాలను గురించీ, ప్రబంధ కర్తలను గురించీ పీఠికలో అనేక విషయాలు చెప్ప బడినవి. ఎన్నో ప్రయోగ వైచిత్రులు వెన్నెలకంటి కవి కుటుంబం వారి వంశవృక్షం, వారి కాలనిర్ణయం, నారన సూరన రచించిన ఉదయనోదయపు సమగ్ర కథాంశము మున్నగు విషయాలు వివరింప బడినవి. ఏభై గ్రంథాలను గురించిన విశేష విషయాలను తెలియజేస్తున్న శ్రీ వేంకటరావుగారి పీఠికయే ఒక వాఙ్మయ విమర్శ గ్రంథంగా ఉన్నదని చెప్పవచ్చును.

దీనితో శ్రీ కవిగారి తొలిముద్రణపు పీఠికకూడా చేర్చి ముద్రించ బడింది. అందువల్ల పీఠికలో కొన్ని యెడల కవిగారు విమర్శలకు గురిఅయినా—ఆయన యెడల పీఠికాకర్తకు ఉండే గౌరవం వెల్లడి అవు తున్నది.

విద్వద్విమర్శకులకు ఎంతో ఉపయుక్తమైన యీ పీఠికలో కొన్ని విషయాలు పరస్పర విరుద్ధంగా కానవస్తున్నవి. ఆదిపురాణకర్త పంపకవి అని 8-వ పుటలో ఉన్నది. కాని 11 వ పుటలో పొన్నకవి అని ఉన్నది. అలాగే అరుణాచల పురాణంనుంచి యీ సంక లనకర్త రెండు పద్యాలను ఉదాహరించినట్లు 20 వ పుటలో ఉన్నది. 21 వ పుటనుబట్టి 4 పద్యా లున్నట్లు తెలుస్తున్నది. ఇవి అచ్చు పొరపాటు కావచ్చును. వీటితోపాటు అచ్చు తప్పులున్నూ ఉన్నవి. ఇట్టి గ్రంథంలో అట్టివి లేకుండా ఉండేటట్లు చూడడం ఎంతో అవసరం.

ప్రస్తుతం అలభ్యమైన యీ అమూల్యమైన గ్రంథాన్ని విలువైన పీఠికతో ప్రకటించిన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారూ, సంపాదకులూ ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులని చెప్పవలసి ఉన్నది.

"ఆంగీరస"

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.